


# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

శ్రీ జయంతి రామయ్యపంతులుగారి

శ త వా ర్షి క జ న్మ ది నో త్స వ స్మా ర క సం చి క

## Sri Jayanti Ramaiahpantulu's Centenary Commemoration Volume



దేశభాషలందు తెలుగు లెస్స

సంపుటము ౪౯
Vol 49

సంచికలు ౨-3
Parts 2-3

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి ఇ., డి లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు.)

(శ్రీ)

జయంతి రామయ్యా పంతులు గారి

శతవార్షిక జన్మదినోత్సవము

18—7—1960

# స్మారకసంచిక

ఆంధ్రసాహిత్య పరిషత్సంస్థాపకులు - శ్రీ సూర్యరాయాంధ్ర
నిఘంటు సంపాదకులు-బహుళ శాసనప్రకాశకులు నగు

# శ్రీ జయంతి రామయ్య పంతులుగారి
# శతవార్షిక జన్మదినోత్సవము

ఆంధ్రభాషాసముద్ధారమున కాజన్మాంతమునకును నపారముగ కృషియొనర్చి, ఆంధ్రసాహిత్య పరిషత్తు నొకపుత్రికగను, శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు నొకపుత్రునిగను భావించి, తత్పోషణమునకై తన జీవితసర్వస్వము నంకితముచేసిన ధన్యజీవి శ్రీ జయంతి రామయ్య పంతులుగారు. వీరు 18-7-1860 లో జన్మించినారు. ఉత్తమ ప్రతిభా సంపన్నులయిన పంతులుగారు ఆంధ్రభాష, ఆంధ్రదేశచరిత్రము నిలిచి యుండినంత కాలము తమపేరు స్మరింపఁజాలిన, భాషాసేవ యొనర్చిన మహనీయులు. అట్టి శ్రీ రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవము 18-7-1960 వ తేదిని ప్రభల సుందరరామభవనము ఆంధ్రసాహిత్య పరిషత్తునందు జరుపఁబడినది.

ఆనాఁడు ఆంధ్ర సారస్వతాభిమానులయిన ప్రముఖులు పరిషద్భవనమున సమావిష్టులై శ్రీ పంతులుగారు నిర్వహించిన మహత్తరకృత్యముల నుగ్గడించి, వారిసద్భావమును హార్దికముగ సంస్మరించుకొనినారు. ఆసభకు శ్రీపీఠికాపుర ప్రభుత్వ కళాశాలాధ్యక్షులు శ్రీ పేరాల్ల శ్రీరామం ఎమ్.ఏ.బి యి డి. గారు అధ్యక్షతవహించి, రామయ్యపంతులుగారి గ్రాంధికాంధ్ర భాషాసేవను, వారి ప్రతిభావిశేషమును మహత్తర కార్యనిర్వహణ దక్షతనుగూర్చి గంభీరోపన్యాసము గావించిరి. పిమ్మట, చిరకాలము శ్రీ పీఠికాపురాధీశ కళాశాలాధ్యక్షులుగా నుండి, ఆంధ్రసాహిత్య పరిషత్కార్య నిర్వాహకవర్గసభ్యులై కోశాధికారిగా నుండిన శ్రీపెద్దాడ రామస్వామి ఎమ్.ఏ. గారు- శ్రీ పంతులుగారితోఁ దమకుఁ గలఁ పరిచితి నుగ్గడించుచు, ఆకాలమున బయలుదేఱిన దేశోద్ధారక మహాపురుషులలో రామయ్యపంతులు

గా రొకరని సహేతుకముగ నిరూపించియున్నారు. పంతులు గారికి పరమాప్తులై, చిరకాలము శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయమున బనిచేసిన శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, పంతులుగారితోఁ దమకుఁగల సాహిత్యబాంధవ్యము నుగ్గడించి, వారి స్వరూప స్వభావములను లలితముగ సభ్యుల కెఱుకపఱచినారు. ఆ వెనుక, పంతులుగారు పరిషదధ్యక్షులుగానుండిన సమయమున, వారు కీర్తిశేషులయినతరువాతను సుమారు ముప్పదివత్సరములు పరిషత్ప్రధాన కార్యదర్శిగాఁ బనిచేసిన శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు పంతులుగారు పరిషదధ్యక్షులై, శాసనపరిశోధకులై నిర్వహించిన మహత్తర కార్యముల నుగ్గడించినారు. శ్రీ పుల్లెల రామచంద్రమూర్తి ఎమ్.ఏ గారు, శ్రీ బులుసు వెంకటేశ్వర్లు ఎమ్.ఏ గారు ఇతర ప్రముఖ సాహిత్యరసికులు వారివారికి పంతులుగారితోఁగల పరిచితి నెఱిఁగించుచు, వారు గ్రాంధికాంధ్రభాష కొనరించినసేవను ప్రశంసించియున్నారు ఈవిధముగ శ్రీ జయంతి రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవము సాహిత్యసేవాపరుల సమావేశమున సుప్రసన్నముగఁ గొనసాగినది.

శ్రీ పంతులుగారు స్థిరసంకల్పులు. వారేకార్యము చేయఁదలపెట్టిన నది భావికాలమున సుస్థిరముగనుండవలెనని యెంచియే పని సాగించుచువచ్చిరి. శాసనపరిశోధనము, ఆంధ్రసాహిత్యపరిషత్స్థాపనము, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటునిర్మాణము, అముద్రితగ్రంథప్రకటనము, ఆంధ్రేతిహాస పరిశోధకమండలికి ప్రాపుగానుండుట మున్నగుపనులన్నియు నందులకే నిదర్శనములు. ప్రభుత్వోద్యోగము సాగించునపుడు, దానిని విరమించిననాఁడుకూడ వారాంధ్రభాషకుఁజేసిన సేవ యమూల్యమైనది. వారట్టిస్థిరసంకల్పులు గావుననే, ఆంధ్రదేశమున బయలుదేఱిన భాషాసంస్థలన్నిటిలో పంతులుగారిచే నెలకొల్పఁబడిన ఆంధ్రసాహిత్య పరిషత్తొక్కటియే గ్రాంథికాంధ్రభాషా సముద్ధరణమున నేఁటి కేఁబది యేండ్లు

చూడఁగలిగిన సద్ధమై యొసలారినది. ప్రాచీనాంధ్రభాషాపజములు కాలవేగమునఁబడి నశించిపోకుండ నిలువఁబెట్టుటయే వారి ప్రధానాశయము. ఆనాఁడు వారు కావించిన కృషిమూలముననే యీనాఁటికిని పాఠశాలలయందు, కళాశాలలయందు పాఠ్యములుగా నుండెడి గ్రంథములలో గ్రాంథికాంధ్రభాష నిలిచియున్నదనుట నిశ్చయము. వారు జీవించియుండగనే రెండునర సంపుటములు వెలువడి, యీనాఁడు కొలఁది యక్షరముల భాగము మాత్రమే కొఱవడియున్న శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు సమగ్రముగ వెలువడినచో పంతులుగారు చేసిన భాషాతపస్సు ఫలియించును. దానికి సహృదయులయిన యాంధ్రభాషాభిమానుల సహకార మావశ్యకము

పంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవమునకు స్మారకముగా వారిచే నెలకొల్పఁబడి 49 యేండ్లుగాఁ గొనసాగుచున్న పరిషత్పత్రిక రెండుసంచికలను గలిపి స్మారకసంచికగా ప్రచురింపఁదలచి, ప్రార్థించినవెంటనే తమయమూల్యమయిన వ్యాసములను బంపించిన రచయితలకు, కవులకు, నా కృతజ్ఞతాభివందనములు. పంతులుగారు జీవించియున్నరోజులలో పరిషత్పత్రికాముఖమున శాసనములు ప్రకటించు పరిపాటియుండెడిది. వారిచరిత్ర పరిశోధనను స్మరింపఁజేయు తలంపుతో నేవియేని వ్యాసములను బంపుఁడని కోరఁగా, ప్రతిబింబసహితమయినశాసనములను వ్యాసములను దయతోనొసఁగిన శ్రీ కొల్లూరు హర్షవర్ధన శర్మగారికిని శ్రీ హెచ్. కె. నరసింహస్వామిగారికిని ప్రత్యేకముగ నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను. జ్యేష్ఠాషాఢమాసములలో వెలువడవలసిన సంచికను బ్రచురింపఁ దలఁచియుండగా నీ స్మారకసంచిక వెలువఱుచు సంకల్పము గలిగినది. తన్మూలముగ దీనిని వెలువఱుచుటలోఁ గొంతయాలస్య మనివార్యమైనది. దానికిఁ బాఠకులు మన్నింతురు గాక యని ప్రార్థన.

ఇట్లు,
సంపాదకుఁడు.

## శ్రీ జయంతి రామయ్యగారు

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

సీ. రేకెత్తె నొకనాఁడు పత్రికటమ్మగు 'కవి
త్రియ'వాణి కగ్గు లెంచెడిమనీష
కాలూనె నొకపరి గ్రాంథికాంధ్రము చ
ర్చక కంగభంగంబు చేయుబుద్ధి
చెలరేఁగె నొకతఱి చిన్నారి తెలుఁగుకై
తకు దిగంబరత యందమనునూహ
పొడసూపె నొకసారి పొల్లకబ్బములు బి
డ్డల కగ్గువాలుగా కలుపుకొఱకు
సంభవామి ధర్మసంస్థాపనార్థాయ
యన్నరీతి నట్టి యవసరముల
నిలిచి కక్షలములఁ దోలఁచి జయంతి రా
మయ్య తెలుఁగువారియశము నిలిపె.

సీ. ధనవంతులను జమీందారుల ఱేఁడుల
కవితో నొక్కత్రాటికిని దెచ్చి
కవిపండితవిమర్శకశిరోమణుల నెల్ల
మేటిబోధల నొక్కమాట నిలిపి
అధికారివర్గమ్ము నలచేత బిగియించి
ధనపిశాచిని కాలఁ దన్ని నిలిచి
ప్రభుకోటిసాయమ్ము పరిభవమ్ముగ నెంచి
యసమానపరుల కాలాననీక
ఆంధ్రసాహిత్యపరిషత్తు నలవరించి
సూర్యరాయాంధ్రకోశ ముత్సుకతఁ గూర్చి
పరిషదాశయసిద్ధికై ప్రాకులాడి
ధన్యతనుగాంచితోయి విద్వద్వతంస!

ఉ. కజ్జలగ్రామ్యవాదపరిఖండన ఖండనఖాద్యయుక్తి సం
పజ్జయభూషితోగ్రదురవాపకఠోర కుఠారమూర్తి! నీ
పజ్జల గ్రాంథికాంధ్రి బహుభంగుల పెంపుల నింపు నింపె నీ
వొజ్జలబంతి వైతివిగదోయి త్రిలింగజనాళి కెప్పుడున్.

ఉ. ఆడినమాటమాటయు శిలాక్షర, మేయొకయుక్తి పల్కు, వె
న్నాడని రామబాణము, మహామహ! పెట్టినకోట నీకు నూ
టాడనికార్యదీక్ష, పరమార్థమె నీదగుపట్టుకొమ్మ, నీ
వాడినదాఁట పాడినదియయ్యెను బాటగ పండితాగ్రణీ!

గీ. చేసి చేయించి చెప్పించి చెప్పినంత
మొనసి చేసిన యాదర్శమూర్తి వీవ
కొండ లుడ్డాడి నీమీద కూలుచున్న
నడుగు కదుపని మేరుధీరుఁడవు నీవ.

ఉ. ఒప్పులుగాంచి తప్పులనునూహను కోశముఁగూర్చి యజ్ఞతన్
కుప్పలు తిప్పలెన్నిన ప్రకోపపు వ్రాఁతలు నింద లన్నిటిన్
తప్పకచూచి యిందొక పద మ్మొకయక్కరమేన్ గ్రహింపఁగా
చొప్పడ దేమివ్రాఁత లనిచూత్కృతిచేసి హాసించి తయ్యరే?

చ. అనితరశక్తి మీఁది విబుధాగ్రణి! చెప్పక చెప్పె యుద్ధ మ
ల్లుని బెజవాడశాసననిరూఢపరీక్షఁ విమర్శకుల్ ప్రభుల్
కొనగొని మీఁదు ధీపటిమకున్ మది మెచ్చుచు వేలవిత్తమున్
వినయముతోడఁ గాన్కలిడు వేడుక లాంధ్రులు విస్మరింతురే?

గీ. దేవభాషాకృతులు తేటతెన్గులోని
కనువదించి స్వతంత్రకావ్యములఁ గూర్చి
కవిగను విమర్శకుఁడుగను ఘనతకెక్కి
యున్నతోద్యోగివై వన్నె గన్న దొరవు.

ఉ. సాలున కొక్కు-మాంత్రె స్వరసంగతి హాయిగ గొంతులెత్తి వే
దా లనుచుండి శ్రావణికిఁ దార్కొ-నుబాపల విత్తనాలకుం
జాలెడివారు వీరలని సాదరవృత్తి బహూకరించు నీ
పాలితధర్మరీతి యొరవళ్ళుపుమీా మన తెల్గువారికిన్.

సీ. ఒక యోరచూపులో సకలమ్ము పసివట్టి
యున్నదున్నటు పల్కు-నూహ నీది
ఒక చిన్నదగ్గులో సకలమ్ము పెకలించి
యరిశక్తిహరియించుగరిమనీఁది
ఒక వాదయుక్తితోఁ బ్రకటసంస్థానముల్
నిలఁబెట్టఁగల బుద్ధిబలమునీది
ఒక బొమవిరుపుతో నొగినెంతవానినేఁ
ద్రోసి రాజనఁజాలు త్రోవనీది
అత డు కొండంతపండితుం డగునుగాక
కవియగు విమర్శకుం డగుఁగా కనిన్ను
కాదనఁగ నొక్కఁడును సమకాలికులను
గానరాకుంట నీమహాఘనత గాదె.

చ. నిలిపితి వెన్నొ దీపముల నీదుహాయాముని పాత్రపాత్రములో
దులిపితి పీఠికారచనతో వెలయించియు వానిఁగొన్ని నీ
కలము వెలార్చి మించినయఖండశతాధికసద్విమర్శనల్
కొలదులె? భాష్యపంక్తు లనుకోవల దే తదధీనసారముల్.

గీ. తెలుఁగువాణికి మణిమయోజ్వలకిరీట
మై విరాజిలు సూర్యరాయాంధ్ర కోశ
మకట పూర్తి కాలేదనునట్టి బెంగ
వలదు రామార్య! తీర్తు మాతలఁపు వడినె.

# ధన్యమూర్తి

ద్విభాష్యం వెంకటరావు.

ఆఱనిదివ్వెగా నలరి యాంధ్రజనాళికి వెల్గుదారులన్
దీఱిచి సాహితీసుగతి దేశము నాల్గుచెఱంగులందుఁ బెం
పారఁగఁ జేసి యెన్నఁడును వాడనిపోడిమిఁ గూర్చినట్టి యా
ధీరు జయంతి రామయసుధీవరు నెంచెద నాంధ్రికోల్వుగన్.

చికిలి చేసిన కత్తి వాసి కడుహత్తి
సరసపండిత శివనాథశాస్త్రి వాణి
వ్రాసె నేకసంథాపాటవమ్ము నూని
చికిలికన్నుల రామయ్య చిన్ననాఁడె.

పనివడి తెల్గునేల నలువంకల గ్రుంగుడు వడ్డమేటి శా
సనముల సేకరించి పరిషత్తున నెక్కొనఁ జేసె భారత
మ్మునఁగల పాఠముద్దెలియ మూఁడుశతమ్ముల నేర్చికూర్చె నా
ఘనుని పరిశ్రమమ్మునకుఁ గల్గుట ముద్రిణభాగ్య మెన్నఁడో.

సూర్యారాయ నిఘంటువు
నార్యులు మెచ్చంగ నిర్వహణముం జేసెన్
కార్యాకార్య వివేచన
ధుర్యతఁ బరిషత్తు నిలిపి దోహదమిచ్చెన్.

పలికినపల్కు వేదమయి పండితపాళికి సత్ప్రమాణమై
మలచినయూహ శిల్పమయి మన్ననకెక్కఁగ శాశ్వతస్థితిన్
నిలిపిన వ్రాఁతలెల్ల కమనీయములై సుకృతిత్వ మందఁగా
నలరు జయంతి రామవిబుధాగ్రణి ధన్యుఁడు మూఁడుమూర్తులన్.




# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

సంవత్సరము చందా రు 3—0—0

సంపుటము ౪౯ జ్యేష్ఠ-భాద్రపదములు సంచిక ౨-3
Vol 49 No 2-3


## శ్రీ జయంతి రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవ స్మారకసంచిక

## విషయసూచిక

# ఛందోదర్పణము—అర్ధసమవిషమవృత్తపరిశీలనము

భట్టాచార్య.

ఛందశ్శాస్త్రములలో నన్నయకవీయము తరువాత నెన్నఁదగిన యనంతుని ఛందోదర్పణమును శ్రీ వావిళ్ళవారు మూఁడవ పర్యాయము ముద్రించి సాహితీ లోకమున కందించిరి. ప్రథమముద్రణము శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారి విపులోపోద్ఘాతముతోను, ద్వితీయ ముద్రణము శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి పీఠికతోను వెలువడినవి. ఆప్రథమ ద్వితీయ ముద్రణములు అత్యంతదోషభూయిష్ఠములై యనేక విమర్శల కాలవాలమైనవి. తృతీయ ముద్రణము శ్రీ రావూరి దొరసామిశర్మగారి సమీక్షతోఁ బ్రకటింపఁబడినది. వారిందు చాల శ్రద్ధ వహించిరని చెప్పక తప్పదు. ద్వితీయ ముద్రణముపై వచ్చిన విమర్శనలన్నింటిని పరిశీలించి యందు యోగ్యములైన వానిని బరిగ్రహించుట జరిగినది. ఒండు రెండు స్వల్పదోషములున్నను తృతీయ ముద్రణ ఛందోదర్పణము చాల వఱకు దోషరహితముగా వెలువడె నని చెప్పవచ్చును.

శ్రీ రావూరి దొరసామిశర్మగారు తృతీయ ముద్రణమునందు ముప్పది పేజీల సమీక్ష చేసిరి. అందు శ్రీ శర్మగారు అనంతామాత్యుని ఛందమునఁ గల స్వస్థాన విషమ వృత్తమైన యంగజాస్త్రమును స్వస్థాన సమవృత్తముగాఁ జేర్కొనిరి. కాని యయ్యది సరి కాదని మాయభిప్రాయము. శ్రీ శర్మగారు తమ సమీక్షలో నిట్లు వ్రాసిరి.

"అంగజాస్త్రము

అనంతుఁడు దీనిని స్వస్థాన విషమ వృత్తమని చూపినాఁడు.

భూరి భమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్థంబై యట సామున్
శౌరీవి న్మ సజంబు గాంతమై
యారూఢంబగు నంగజాస్త్రమున్.

"ఒక్క ఛందమున నొగిఁ గొని పాదముల్ వేఱైన స్వస్థాన విషమమయ్యె"అని యనంతుని నిర్వచనము (119) ఒకే ఛందమునఁ బుట్టిన నాలుగు భిన్నవృత్తములు నాలుగు పాదములందున్న స్వస్థాన విషమ వృత్తమగునని పై నిర్వచన భావము. పై లక్ష్యమునఁ బూర్వార్థమున, భ-మ-స-గ-గణములు, ఉత్తరార్ధమున, మ-స-జ గ-గణములున్నవి. నాల్గు పాదముల భిన్నవృత్తములు లేవు. పై లక్ష్య పద్యము స్వస్థానార్ధసమ వృత్తలక్షణ ప్రకారమున్నది. అనంతు డెట్లు విషమ వృత్తమని పేర్కొని నాఁడో దురూహ్యముగా నున్నది."

(త్రి-ము-స-81 పేజి)

అని శ్రీ శర్మగారు వ్రాసిరి. దీనిఁ బరిశీలించుటకు ముందు అనంతుఁడు సెప్పిన స్వస్థానార్ధ సమవిషమ వృత్తములకు లక్షణ మెట్లు చెప్పెనో చూడవలయును.

అనంతామాత్యుఁడు తన ఛందోదర్పణము నందు ఇట్లు చెప్పినాఁడు.

వ॥ మఱియు నర్ధసమవృత్త విషమవృత్తంబు లెట్టివనిన.

ధర నొకటియు మూఁడును నగు
చరణంబులు మఱి ద్వితీయ చాతుర్థికవి
స్ఫురితాంఘ్రులుఁ దమలో నను
సరియగు నర్ధసమ వృత్త చయమునఁ గృష్ణా
జరగునందు స్వస్థానార్ధసమ మనంగ
ఛంద మొకటన నెట్టి లక్షణముదగుల

ప్రథమ తృతీయ చరణములు, ద్వితీయ చతుర్థచరణములు ఒకే ఛందమునఁ బుట్టిన వృత్తములు గలదిగా నున్న నది స్వస్థానార్ధ సమ వృత్తమని యందురు.

స్వస్థాన విషమ వృత్త విషయము

"విషమ వృత్తంబులు వెలయుఁ బాదంబుల
గణములు వేర్వేఱుగా నొనర్ప
సనియు స్వస్థానంబు నటపర స్థానంబు
సర్వ పరస్థాన సంజ్ఞికంబు
నొక్క ఛందంబున నొగిఁగొని పాదముల్
వేఱైన స్వస్థాన విషమ మయ్యె
నొక పాద మొక్కట నున్న పాదంబులు
క్రిందటి చందంబునందు నైన
మీఁది చందంబునందైన మెఱయఁ జెప్ప
నవి పరస్థాన విషమ వృత్తాహ్వయములు
వెండి సర్వపరస్థాన విషమమునకు
నన్నియును జెప్ప ఛందంబు లబ్జనాభ!

స్వస్థాన విషమ వృత్తములు, పరస్థాన విషమ వృత్తములు, సర్వ పరస్థాన విషమ వృత్తములు అని విషమ వృత్తములు త్రివిధంబులు.

ఒక్క ఛందమునఁ బుట్టిన భిన్న వృత్తములు, పాదములు వేఱు వేఱుగా ప్రథమ తృతీయ చరణములు, ద్వితీయ చతుర్థ చరణములు ఒకటిగా నుండునట్లు కాక భిన్నముగా నని యర్థము చెప్పిన స్వస్థాన విషమవృత్తమగును. ఇచట శ్రీ శర్మగారు నాలుగు భిన్న వృత్తములు నాలుగు పాదములం దుండవలెనని భావించిరి. "పాదముల్ వేఱైన" అను దానికి అన్ని పాదములు భిన్నముగా నుండవలె

నని యర్థము చెప్పఁగూడదు. స్వస్థానార్థసమవృత్తమునందుఁ జెప్పిన లక్షణము కంటె వేఱైన విధముగా నని యర్థము అనంతుని అభిప్రాయము గూడ నియ్యదియే.

ప్రథమ తృతీయ చరణములు, ద్వితీయ చతుర్థ చరణములు ఒకే ఛందమునఁ బుట్టిన వృత్తములు గలదిగా నున్న అది స్వస్థానార్థ సమవృత్తము. ఈ లక్షణమునకు భిన్నముగాఁ జెప్పిన స్వస్థాన విషమ వృత్తము అనఁగా దాని నిట్లు చెప్పవచ్చును ప్రథమ పాదము ఒక విధము గాను, మిగిలిన మూఁడు పాదము లొక విధముగా నుండుట ఒక పద్ధతి. ప్రథమ ద్వితీయ చరణములు, తృతీయ చతుర్థ చరణములు ఒక విధముగాను జెప్పుట మఱియొక పద్ధతి. ప్రథమ ద్వితీయ చతుర్థ పాదములు ఒక విధము గాను, తృతీయ పాదము మఱియొక విధముగా జెప్పుట నిదియొక పద్ధతి. ఇవి యన్నియు స్వస్థాన విషమ వృత్త భేదములే. వీని యన్నింటికి ననంతుఁడు లక్ష్య లక్షణములఁ జూపియే యున్నాఁడు. చూడుఁడు.

స్వస్థాన విషమ వృత్తములందు నంగజాస్త్రము-
భూరి భమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్ధంబై యట సామున్
శౌరీ విన్మసజంబు గాంతమై
యారూఢంబగు నంగ జాస్త్రమున్.

ప్రథమ ద్వితీయ చరణములు-భ-మ-స-గ-గణములు గాను, తృతీయ చతుర్థ చరణములు-మ-స-జ-గ-గణములుగా నుండునట్లు చెప్పిన నది స్వస్థాన విషమ వృత్తములందు నంగజాస్త్రమగును. ఈ వృత్తమును శ్రీ శర్మగారు "పై పద్యము స్వస్థానార్థ సమ వృత్తలక్షణ ప్రకారమున్నది. అనంతుఁడెట్లు విషమ వృత్తమని పేర్కొని నాఁడో

దుర్గూహ్యాము" అని నుడివిరి. శ్రీ శర్మగారు ఒకపరి స్వస్థానార్ధ సమ వృత్తలక్షణమును బరిశీలించుట మంచిది. సరిగాఁ బరిశీలింపక అనంతునిపై దోషమాపాదించుట తగునా? అనంతుఁడు "ఒకటియు మూఁడును నగు చరణంబులు మఱి ద్వితీయ చాతుర్థికవి స్ఫురితాంఘ్రులు తమలోనను సరియగు నర్ధసమ వృత్తచయము" అని లక్షణము చెప్పియున్నాఁడు. దానికి భిన్నముగా ప్రథమ ద్వితీయ చరణములు, తృతీయ చతుర్థ చరణంబులు ఒకటిగా నుండునట్లు చెప్పిన యీ యంగజాస్త్ర వృత్తమును స్వస్థానవిషమ వృత్తమని కాక స్వస్థానార్ధ సమ వృత్తమని పొరపడి చెప్పి యనంతునిపై దోషారోపణము గావించుట వింతగా నున్నది.

స్వస్థాన విషమ వృత్తమునందు వరాంగియను వృత్తము.

సరిత్పదాబ్జా జతజల్ గగల్ బం
ధురంబగున్ రెంటఁ జతుర్థ కాంఘ్రిన్
గారాముతోఁ దాజ గగల్ వరాంగిన్
హరార్చితా మూఁడవ యంఘ్రి నొందున్

ప్రథమ ద్వితీయ చతుర్థ చరణములు

జ-త-జ-గగ-గణములతోను, తృతీయ పాదము, త-భ-జ-గగ-గణములతో నున్న స్వస్థాన విషమ వృత్తములందు వరాంగి నామక వృత్తమగును.

నదీప్రఘోషము

నాగతల్పా మొదల్నాల్గు రేఫంబులున్
జగన్నివాసా జతజంబు రేఫయున్
దగంగ నమ్మూఁడు పదంబులందు జా
తిగాఁ బ్రవర్తించు నదీప్రఘోషకున్

ప్రథమ పాదము నాలుగు రగణములును, శేషించిన పాదత్రయము-జ-త-జ-ర-గణములు గలిగియున్నది స్వస్థాన విషమ వృత్తములందు నదీప్రఘోష వృత్తమగును. అనంతుఁడు లక్షణ లక్ష్యములొకేపద్యమునందుఁ జూపియున్నాఁడు. పై పద్యములఁ బరిశీలించినఁ దెల్లముగాఁ గలదు. సహృదయ పండిత పరిశోధకలోకము పై మాయభిప్రాయములఁ బరిశీలించి తమ యభిప్రాయము లొసంగునని తలంచెద.

# పాతఞ్జలమహాభాష్యము—పస్పశాహ్నికము

శ్రీభాష్యం అప్పలాచార్య.

(గతసంచిక తరువాయి)

"అభక్ష్యో గ్రామ్యకుక్కుటః, అభక్ష్యో గ్రామ్యసూకరః"

'గ్రామములో పెరిగినకోడిని పందిని తినరాదు' అను నిషేధముచే 'అడవికోడి అడవిపంది' తినఁదగినవి యని చెప్పకయే తెలియును.

అట్లే శబ్దములవిషయమునఁగూడ-'గోవు' అనునది సుశబ్దము అని యుపదేశించిన తద్భిన్నములగు 'గావి' మొదలగునవి యపశబ్దములని చెప్పకయే గ్రహింప వీలగును.

'గావి' మొదలగునవి యపశబ్దములు అని యుపదేశించిన 'గోవు' అనున దొక్కటే శబ్దమని మనము గ్రహింపఁగల్గుదుము.

మూ. కిం పున రత్ర జ్యాయః ?

అ. ఈ రెండు పద్ధతులలో నేది మంచిది ?

మూ. లఘుత్వా చ్ఛబ్దోపదేశః

లఘీయాన్ శబ్దోపదేశః । గరీయా నపశబ్దోపదేశః । ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః । త ద్యథా గౌరిత్యస్య శబ్దస్య గావీ గోణీ గోతా గోపోతలికే త్యేవమాదయోఽపభ్రంశాః । ఇష్టాన్వాఖ్యానం ఖల్వపి భవతి॥

అ. తక్కువ కనుక సుశబ్దముల నుపదేశించుటయే మంచిది. సుశబ్దముల నుపదేశించుట తేలిక. అపశబ్దముల నుపదేశించుట కష్టము. ఒక్కొక్కశబ్దమునకు నెన్నియో అపభ్రంశరూపములు గలవు. ఉదాహరణమునకు 'గోవు' అనుశబ్దమునకు 'గావి, గోణి,గోత, గోపోతలిక, మున్నగునవెన్నియో యపభ్రంశరూపములు కలవు. శబ్దముల నుపదేశించినలాఘవమే కాక, కావలసినవాని నుపదేశించుటచే నిశ్చయజ్ఞానమును సులభముగాఁ గలుగును.

మూ. అథైతస్మిన్ శబ్దోపదేశే సతి కింశబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపదపాఠః కర్తవ్యః. గౌ రశ్వః పురుషో హస్తీ శకుని ర్మృగో బ్రాహ్మణ ఇత్యేవమాదయః శబ్దాః పఠితవ్యాః?

అ. శబ్దముల నుపదేశింపవలె నన్న నెట్లుపదేశింపవలెను? సాధుశబ్దములను ప్రతిపదమును పఠింపవలెనా? "గోవు, అశ్వము, పురుషుఁడు హస్తి, శకుని, మృగము" అని ప్రతిశబ్దమును ఉపదేశింపవలెనా?

మూ. నేత్యాహ।అనభ్యుపాయ ఏష శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపదపాఠః। ఏవం హి శ్రూయతే-"బృహస్పతి రిన్ద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్దపారాయణం ప్రోవాచ. నాంతం జగామ" బృహస్పతిశ్చ ప్రవక్తా, ఇంద్ర శ్చాధ్యేతా దివ్యం వర్షసహస్ర మధ్యయనకాలః. న చాంతం జగామ, కిం పున రద్యత్వే యః సర్వథాచిరం జీవతి వర్షశతం జీవతి. చతుర్భిశ్చ ప్రకారై ర్విద్యోపయుక్తా భవతి-ఆగమకాలేన, స్వాధ్యాయకాలేన, ప్రవచనకాలేన,వ్యవహారకాలేన ఇతి. తత్ర చాస్యాగమకాలేనై వాయుఃకృత్స్నం పర్యుపయుక్తం స్యాత్।తస్మా దనభ్యుపాయః శబ్దానాం ప్రతిపత్తౌ పదపాఠః.

అ. కాదు సాధుశబ్దముల నెఱుంగుటకు ప్రతిపదపాఠము సరియైన ఉపాయము కాదు. పూర్వము బృహస్పతి యింద్రునకు సాధుశబ్దముల నెఱిఁగించుటకు "ఇది సుశబ్దము ఇది సుశబ్దము" అని ప్రతిపదము వేయిదివ్యసంవత్సరములు పారాయణముచేసెనఁట; కాని పూర్తి కాలేదఁట. ఉపదేశమును జేసినవాఁడు బృహస్పతి అధ్యయనము చేసినవాఁడు ఇంద్రుఁడు

అధ్యయనముచేసినకాలము వేయి దివ్యసంవత్సరములు. అయినను పూర్తికాలేదు. ఇఁక నీకాలమున నీప్రతిపదపాఠ మెట్లు సాధ్య

మగును? పూర్తిగా బ్రతికినవాఁ డీకాలమున నూఱేండ్లు బ్రతుకును. విద్య నాలుగువిధములుగా నుపయోగపడవలెను. 1. విద్యను గురువు నుండి గ్రహింపవలెను. 2. తా నభ్యసింపవలెను 3. ఇతరుల కుపదేశింపవలెను 4. తాను వ్యవహారమున నుపయోగింపవలెను.

ప్రతిపదపాఠము చేసిన జీవించియున్నంతకాలము అధ్యయనముతోనే గడచిపోవును. కావున ప్రతిపదము పఠించుట సులభమైన యుపాయము కాదు.

మూ. కథం తర్హీమే శబ్దాః ప్రతిపత్తవ్యాః ?

అ. అయిన మఱి యెట్లు శబ్దముల నుపదేశింపవలెను ?

మూ. కించి త్సామాన్యవిశేషవ ల్లక్షణం ప్రవర్త్యమ్ । యేనాల్పేన యత్నేన మహతో మహతః శబ్దౌఘాన్ ప్రతిపద్యేరన్. కిం పున స్తత్ ? ఉత్సర్గాపవాదా.కశ్చి దుత్సర్గః కర్తవ్యః,కశ్చిదపవాదః.

అ. సామాన్యలక్షణములు, విశేషలక్షణములు నుండునట్లు నిర్మింపవలెను. అటులైన నల్పమగుప్రయత్నముచే నధికమగు శబ్ద సమూహముల నెఱుంగ వీలగును. [ఒకజాతికిఁ జెందినశబ్దములస్వరూపమును బరిశీలించి యన్నిటికిని సంబంధించియుండునట్లు సామాన్య నియమమును జేయవలెను. అట్టిసామాన్యశాస్త్రమునకు "ఉత్సర్గము" అని పేరు. ఆనియమముచే సాధింపఁబడని కొన్నిరూపములలో సామాన్యనియమమునకు బాధకముగ విశేషనియమమును జేయవలెను. ఇది 'అపవాదము' అనఁబడును] ఇట్లు ఉత్సర్గాపవాదశాస్త్రములతో శాస్త్రరచనను గావింపవలెను.

మూ. కథంజాతీయకః పున రుత్సర్గః కర్తవ్యః,కథంజాతీయకోఽపవాదః ?

అ. ఉత్సర్గము ఏవిధముగా నుండవలెను ? అపవాదము ఏవిధముగా నుండవలెను ?

మూ. సామాన్యే నోత్సర్గః కర్తవ్యః। తద్యథా-"కర్మణ్యణ్" తస్య విశేషే ణాపవాదః। తద్యథా "ఆతో౽నుపసర్గే కః"

అ. ఉత్సర్గము ఒకజాతికిఁ జెందినశబ్దము లన్నింటియందును బ్రివర్తించుట కనువుగా సామాన్యముగా నుండవలెను ఉ: కర్మణ్యణ్. కర్మవాచకమైనశబ్దము ఉపపదముగా నుండఁగా ధాతువునకు 'అణ్' ప్రిత్యయము వచ్చును. 'కుంభం కరోతి'-అనునర్థమున కుంభశబ్దము ఉపపదముగా నుండఁగా కృధాతువునకు అణ్ ప్రిత్యయము వచ్చి 'కుంభకార' అనురూప మేర్పడును. గాం దదాతి గోదః, అనుచోట 'గో' అనుశబ్ద ముపపదముగా నుండఁగా 'దా' ధాతువునకు కూడ 'అణ్' రావచ్చును. కాని యది వచ్చిన 'గోదః' యనురూపము సిద్ధింపదు. అందులకు పై 'కర్మణ్యణ్' అను నుత్సర్గమునకు అపవాదముగ 'ఆతో౽నుపసర్గే కః' ఆకారాంతములైన ధాతువులకు ఉపసర్గము ముందులేకుండ నున్నపుడు కర్మవాచక ముపపదముగా నుండఁగా 'క' ప్రిత్యయము వచ్చును ('అణ్' రాదు) అని చెప్పెను ఇది వెనుకటి 'కర్మణ్యణ్' అనుశాస్త్రమును బాధించును. ఇట్లుఉత్సర్గాపవాదములతో శాస్త్రరచనను సాగింపవలెను.

మూ. కిం పున రాకృతిః పదార్థః, ఆహోస్విద్ ద్రివ్యమ్?

అ. పదార్థము జాతియా, ద్రివ్యమా? పాణిని యాశయ మేమి?

**మూ.** ఉభయ మిత్యాహ.

కథం జ్ఞాయతే? ఉభయథా హ్యాచార్యేణ సూత్రాణి పఠితాని। ఆకృతిం పదార్థం మత్వా జాత్యాఖ్యాయా మేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్ ఇత్యుచ్యతే ద్రివ్యం పదార్థం మత్వా "సరూపాణా"మి త్యేకశేష ఆరభ్యతే.

అ. ఈశాస్త్రమున రెండునుగూడ పదార్థములుగనే భావింపఁబడినవి. ఎట్లు తెలిసినది? పాణినిసూత్రిములను రెండువిధములగు నర్థములనుగూడ అంగీకరించియే రచించెను.

-తి పదార్థ మని భావించి "జాత్యాఖ్యాయా మేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్" అనుసూత్రమును రచించెను.

వ్యక్తి పదార్థమని భావించి "సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" అనుసూత్రమును రచించెను.

వి. "జాత్యాఖ్యాయా" మనుసూత్రముచే జాతిని తెలియఁజేయుపదమునకు ఏకత్వమునఁగూడ బహువచనము వికల్పముగ వచ్చును. అని చెప్పెను. 'బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు' అనిన 'బ్రాహ్మణుఁడు' అనుపదమొకవ్యక్తినిగాక బ్రాహ్మణజాతిని దెలియఁజేయును. ఇచట "బ్రాహ్మణులుపూజ్యులు" అనికూడ ప్రయోగింపవచ్చును. ఈసూత్రమున పాణిని శబ్దమునకు జాతి యర్థమని భావించెను.

"సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" ఒక విభక్తిలో సమానమైనరూపముగల శబ్దము లున్నచో నొక్కటిమిగిలి మిగిలినవి లోపించును. అనుసూత్రముచే రామశబ్దము బహువచనమున ముగ్గురురాములను తెలియఁజేయుటకు మూఁడురామశబ్దములను ప్రయోగించిన (రామ, రామ, రామ) ఒక్కరామశబ్దము మిగిలి తక్కినవి లోపించును ఈసూత్రములో శబ్దమునకు వ్యక్తియే యర్థమని పాణిని భావించెను. కావున జాతి, వ్యక్తి యనునవి రెండును పదమున కర్థములే యని యీశాస్త్రమున గ్రహింపవలెను,

## శబ్దార్థసంబంధ నిత్యత్వ విచారణము

మూ. కింపున ర్నిత్యః శబ్దః ఆహోస్విత్ కార్యః ?

అ. శబ్దము నిత్యమా ? లేక అనిత్యమా ? (కార్యమా)

వి. శబ్దము ఎవరిచేతను సృజింపఁబడినదికాక స్వతస్సిద్ధముగా నుండునదా ? లేక ప్రయత్నజన్యమై నశించునదా? అని సందేహము.

శబ్దము నిత్యమే యయిన దానిని సాధించుటకు ప్రయత్నమావశ్యకముకాదు. కనుక వ్యాకరణము నిరర్థకము.

శబ్దము నిత్యమని యంగీకరించినవారిలోఁగూడ మతభేదములు కలవు.

మీమాంసకులు ఒకానొకధ్వనిచే వ్యక్తముచేయఁబడు వర్ణ రూపమగుశబ్దము నిత్యమని యందురు. వారిమతమున 'వర్ణము'శబ్దము. అది నిత్యము. పదము వాక్యముకూడ వర్ణసమూహరూపములే. వైయాకరణులు మనకు విన్పించువర్ణముగాని, పదముగాని వాక్యము గాని శబ్దము కాదనియు, వీనిచే బుద్ధిలో నభివ్యక్తమగు వర్ణము, పదము, వాక్యము అనుమూఁడును నిత్యశబ్దములే యనియందురు. వర్ణ స్ఫోటము, పదస్ఫోటము అనురెండును నిత్యములని యంగీకరించినను వాక్యమే ముఖ్యశబ్ద మనియు, నదియే నిత్యమనియు సిద్ధాంతీకరించిరి. వాక్యములోని పదములు, పదములోని వర్ణములు కల్పితములే యని వివరించిరి, వైశేషికులు ధ్వనియే శబ్దమని యందురు. ఆధ్వని రెండు విధములు. 1. వర్ణరూపము 2. అవర్ణరూపము. ఈ రెండువిధములగు ధ్వనియు కార్యమే (క్రియాజన్యము-అనిత్యము) కాని నిత్యము కాదని చెప్పిరి.

ఇట్టిమతభేదము లుండుటచే పరిశ్నించుచున్నాఁడు.

మూ. సంగ్రహ ఏత త్ప్రాధాన్యేన పరీక్షితమ్-నిత్యోవా స్యాత్ కార్యోవేతి। తత్రోక్తా దోషాః ప్రయోజనా న్యప్యుక్తాని। తత్ర త్వేష నిర్ణయః-యద్యేవ నిత్యః, అథాపి కార్యః, ఉభయథాపి లక్షణం ప్రవర్త్య మితి.

అ. శబ్దము నిత్యమా కార్యమా? యనువిషయము సంగ్రహ మను గ్రంథమున బాగుగ పరిశీలింపఁబడినది. అందలిదోషములును, ప్రయోజనములును అచటనే వివరింపఁబడినవి. నిత్యమైనను, కార్య మైనను శబ్దమునకు లక్షణము ఆవశ్యకమే యని నిర్ణయింపఁబడినది

మూ. కథంపున రిదం భగవతః పాణినే రాచార్యస్య లక్షణం ప్రవృత్తమ్ ?

అ. పాణిన్యాచార్యులీశబ్దానుశాసనమును జేయుటలో శబ్దము నిత్యమని భావించెనా ? అనిత్యమని (కార్యమని) భావించెనా ?

వి. తాను క్రొత్తగా శబ్దములను, వానిద్వారా యర్థములను, వానికిఁగలసంబంధమును సృజించి ప్రయోగమున కందిచ్చెనని భావించెనా ? లేక సిద్ధముగానున్న శబ్దములకు, అర్థములకు వానికిఁగలసంబంధములకును వివరణముగా లక్షణమును రచించెనా ?

మూ. సిద్ధే శబ్దార్థసంబంధే.

సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి.

అ. శబ్దార్థసంబంధములు సిద్ధములు.

శబ్దము. అర్థము, సంబంధము అనుమూఁడును సిద్ధములే

వి. శబ్దము నిత్యము-వైయాకరణులు "స్ఫోటము" అనురూపమున నుండుశబ్దము నిత్యమని యంగీకరించిరి. 'స్ఫోటము' అనఁగా నర్థము నభివ్యక్తముచేయఁజాలునది. మనము శ్రవణేంద్రియముచే గ్రహించుశబ్దముకాక దానిచే నభివ్యక్తమై బుద్ధిలో భాసించు శబ్దమే స్ఫోటము. అదియే అర్థమును ప్రకాశింపఁజేయును. అది నిత్యము. అది పదరూపమునఁగాని వాక్యరూపమునఁగాని యుండును. వాక్యస్ఫోటమే ముఖ్యసిద్ధాంతము.

2. అర్థము-ఇదియు నిత్యమే శబ్దమునకు 'జాతి' లేదా వ్యక్తి యర్థమనిచెప్పుదురు. 'జాతి'శబ్దముచే వాచ్యమగునపు డదియెటులును నిత్యమే కనుక అర్థము నిత్యము.

లేదా వ్యక్తి (ద్రవ్యము) శబ్దముచే వాచ్యమనిన నాఁడు గూడ ఈద్రవ్యము లన్నియు నసత్యమగు నుపాధులతోఁగూడిన

సత్యమగు బ్రహ్మస్వరూపములే కనుక నిత్యములు ఇట్లు అర్థము నిత్య మని యెఱుఁగవలెను.

3. ఇఁక శబ్దార్థములసంబంధము-అదియు నిత్యమే. శబ్దార్థములకుఁ గలసంబంధ మీనాఁ డెవరిచేతనో కల్పింపఁబడినది కాక యనాదిగా వచ్చుచున్నదగుటచే నిత్యమే.

మూ. అథ సిద్ధశబ్దస్య కః పదార్థః ?

అ. 'శబ్దార్థసంబంధములు సిద్ధములు' అనుచోట సిద్ధశబ్దమునకర్థ మేమి ?

మూ. నిత్యపర్యాయవాచీ సిద్ధశబ్దః। కథం జ్ఞాయతే ?
యత్కూటస్థే ష్వవిచాలిషు భావేషు వర్తతే।తద్యథా
సిద్ధా ద్యౌః, సిద్ధా పృథివీ,సిద్ధ మాకాశ మితి

అ 'సిద్ధము' అనుశబ్దము 'నిత్యము' అనుశబ్దమునకు పర్యాయపదము. అదెట్లు తెలియుచున్నది?
లోకములో నశింపని చలింపని పదార్థములను సిద్ధము లనుచున్నారు.
దివము సిద్ధము-పృథివి సిద్ధ-ఆకాశము సిద్ధము.

మూ. ననుచ భోః కార్యేష్వపి వర్తతే-తద్యథా-సిద్ధ ఓదనః, సిద్ధః సూపః, సిద్ధా యవాగూ రితి।యావతా కార్యేష్వపి వర్తతే,తత్ర కుత ఏత న్నిత్యపర్యాయవాచినో గ్రహణమ్ ? న పునః కార్యే యః సిద్ధశబ్ద ఇతి.

అ. ఓయీ ! 'సిద్ధము' అనుశబ్దమును కార్యములగు (ప్రయత్నజన్యములై యనిత్యములగు) నర్థములతోఁ గూడ వాడుచున్నారే! ఓదనము సిద్ధము-పప్పు సిద్ధము-యవాగువు (గంజి) సిద్ధము. అని (ఓదనము మున్నగునవి నిత్యపదార్థములు కావు) ఇట్లు సిద్ధశబ్దము నిత్యపదార్థములకును, కార్యపదార్థములకును గూడ సంబంధించినది గాఁగన్పట్టుచుండ, నిచటి 'సిద్ధము' అనుపదము 'నిత్యము' అనుదాని

పర్యాయపదమే కాని 'కార్యము' అనునర్థము నిచ్చునది కాదని యెట్లు తెలిసికొనవలెను ?

మూ. సంగ్రహే తావత్ కార్యప్రతిద్వంద్విభావా న్మన్యామహే, నిత్యపర్యాయవాచినో గ్రహణ మితి। ఇహాపి తదేవ.

అ. సంగ్రహమనుగ్రంథమున "శబ్దము కార్యమా లేక సిద్ధమా" అనుచర్చలో కార్యశబ్దమునకు ప్రతిద్వంద్విగా (విరుద్ధముగా) సిద్ధశబ్దమును వాడినారు. కావున నిచటను సిద్ధశబ్దమును ఆయర్థముననే గ్రహింపవలెను.

మూ. అథవా సంత్యేకపదా న్యప్యవధారణాని। తద్యథా-అబ్భక్షో వాయుభక్ష ఇతి-అప ఏవ భక్షయతి, వాయుమేవ భక్షయతీతి। గమ్యతే ఏవ మిహాపి సిద్ధ ఏవ, న సాధ్య ఇతి.

అ. అవధారణార్థకమగు 'ఏవ' కారము లేకపోయినను కొన్ని పదము లవధారణార్థమును కలిగియుండును. 'అబ్భక్షః' అనుమాటలో 'ఏవ' అనునది లేకున్నను "నీటినే తినువాఁడు" వాయుభక్షః అనుచోట వాయువునే తినువాఁడు అనునర్థములు వచ్చుచున్నవి. అటులనే "శబ్దార్థసంబంధములు సిద్ధములు" అనుచోట 'సిద్ధములే' యను నవధారణార్థమును జెప్పిన-సిద్ధములే కాని సాధ్యములు కావు (నిత్యములే కాని కార్యములు కావు) అని యర్థమును జెప్పవచ్చును.

వి. శబ్దార్థసంబంధములు సిద్ధములు అనుచోటసిద్ధము అనుపదమునకు 'నిత్యము' అనియర్థమును జెప్పవలెను కాని సిద్ధశబ్దమునకు 'కార్యము' అనునర్థములతోఁగూడ ప్రయోగ ముండుటచే నిత్యమని యెట్లర్థము నిశ్చయింపఁగలము. అందులకై "సిద్ధములు" అనుచోట సిద్ధములే యని యవధారణార్థకము చేర్చిననాఁడు "కార్యములు" ఎల్లపుడు సిద్ధములు కావుకనుక నిత్యములు అనునర్థము సులభముగా లభించును

అథవా పూర్వపదలోపోఽత్ర ద్రష్టవ్యః-అత్యంతసిద్ధః సిద్ధ ఇతి।తద్యథా దేవదత్తో దత్తః, సత్యభామా భామేతి।

అ. "శబ్దార్థసంబంధములు సిద్ధములు" అనుచోట "సిద్ధములు" అనుపదము అత్యంతసిద్ధములు అనుసమాసములో పూర్వపదమగు 'అత్యంత'పదము లోపించినరూపమని తలంపవలెను. లోకమున "దేవదత్తుఁడు-దత్తుఁడు-సత్యభామ-భామ" మున్నగు పదములలో పూర్వపదమును వదలినరూపము లున్నవిగదా !

వి. శబ్దార్థసంబంధములు అత్యంతసిద్ధములు అనిన నిత్యము అని యర్థము వచ్చును. కార్యములగువస్తువులు మునుపులేకుండి (ప్రాగభావము) ఇపు డుండి, తరువాత లేకుండు (ప్రధ్వంసాభావము) స్వభావముగలవి కావున అత్యంతసిద్ధములు కావు.

మూ. అథవా "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నహి సందేహాదలక్షణమ్" ఇతి నిత్యపర్యాయవాచినో గ్రహణ మితి వ్యాఖ్యాస్యామః.

అ. "సందేహము కల్గినంతమాత్రముననే యొకదానిని లక్షణము కాదని వదలరాదు. పెద్దలవ్యవహారము ననుసరించి చేసినవ్యాఖ్యానమువలన విశేషార్థములను గ్రహింపనగును" అనుపరిభాష ననుసరించి యిచటిసిద్ధశబ్దము నిత్యపర్యాయముగ గ్రహింపవలెనని వ్యాఖ్యానింతుము.

మూ. కింపునరనేనవర్ణ్యేన।కిం న మహతా కంఠేన నిత్యశబ్దఏవోపాత్తః యస్మిన్నుపాదీయమానేఽసందేహః స్యాత్.

అ. ఇంతప్రయత్నించి వ్యాఖ్యానింపఁదగిన సిద్ధశబ్దము నేల వాడవలెను ? "శబ్దార్థసంబంధములు నిత్యములు" అని నిత్యశబ్దమునే స్పష్టముగా నేల ప్రయోగింపరాదు. అట్లయిన సందేహమే యుండదుకదా ?

మూ. మాంగలిక ఆచార్యో మహతః శాస్త్రౌఘస్య మంగలార్థం సిద్ధశబ్ద మాదితః ప్రయుంక్తే । మంగలాదీనిహి శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణిచ భవంతి, ఆయుష్మత్పురుషాణి చాధ్యేతారశ్చ సిద్ధార్థా యథాస్యు రితి.

అ. మంగళమును కోరుచున్న ఆచార్యుఁడు మహత్తరమైన శాస్త్రమున కాదియందు మంగళార్థము సిద్ధశబ్దమును ప్రయోగించినాఁడు. మంగళారంభముగల శాస్త్రములు వినువారికి, చదువువారికి శక్తిసామర్థ్యములను వర్ధిల్లఁజేసి యాయుర్వర్ధకము లగును.

వి. భాష్యములో 'వార్తికములు' కొన్ని కలవు. ఆవార్తికములలో మొదటిది "సిద్ధేశబ్దార్థసంబంధే" మొదలగు వార్తికము. అందుచే నిచట మంగళప్రదమగు సిద్ధశబ్దము ప్రయోగింపఁబడినది.

మూ. అయం ఖలు నిత్యశబ్దో నావశ్యం కూటస్థే ష్వవిచాలిషు భావేషు వర్తతే

కిం తర్హి ?

ఆభీక్ష్ణ్యేపి వర్తతే।తద్యథా నిత్యప్రహసితో నిత్యప్రజల్పితఇతి యావతాఽభీక్ష్ణ్యేఽపి వర్తతే తత్రాప్యనేనైవార్థః స్యాత్-"వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నహి సందేహా దలక్షణమ్" ఇతి। పశ్యతి త్వాచార్యో మంగళార్థశ్చైవ సిద్ధశబ్ద ఆదితః ప్రయుక్తో భవిష్యతి, శక్ష్యామి చైనం నిత్యపర్యాయవాచినం వర్ణయితు మితి। అతః సిద్ధశబ్ద ఏవోపాత్తో న నిత్యశబ్దః।

అ. సిద్ధశబ్దమును వీడి నిత్యశబ్దమును ప్రయోగించినను సరియగు నర్థము రాదే !

నిత్యశబ్దమును నశింపని చలింపని వస్తువులందే ప్రయోగించుట లేదు

'ఎల్లపుడు' అనునర్థమునఁగూడ ప్రయోగము లున్నవి. "నిత్య ప్రహసితుఁడు నిత్యప్రజల్పితుఁడు" "నిత్యము నవ్వువాఁడు, నిత్యము మాటలాడు వాఁడు" అను చోట్ల 'నిత్యము' అనునది 'ఎల్లపుడు' నను నర్థము నిచ్చును.

నిత్యశబ్దము నుపయోగించినను సిద్ధశబ్దమునకు వలెనే వ్యాఖ్యానము చేతనే ప్రస్తుతార్థమును నిర్ధరింపవలెను

కావుననే యాచార్యులు మంగళము కూడ సాధింపఁబడునని సిద్ధశబ్దమునే ప్రయోగించి వ్యాఖ్యానముచే నిత్యపర్యాయమని గ్రహింపఁజేసినారు.

మూ. అథ కం పునః పదార్థం మత్వా ఏష విగ్రహః క్రియతే సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి ?

అ. శబ్దార్థసంబంధములు నిత్యములు. శబ్దము అర్థము, సంబంధము అనునవి నిత్యములు అని చెప్పినపుడు అర్థము కూడ నిత్యమనుచున్నారే! అర్థమున మీ యభిప్రాయమున నేది ?

వి. 'శబ్దార్థసంబంధము' అనునది ద్వంద్వసమాసము. ఇందు మూఁడుపదములకు ద్వంద్వమా? లేక రెండు పదములకు ద్వంద్వమా? యనునది ప్రశ్న. శబ్దము, అర్థము, సంబంధముఅను మూఁటికిని సమాహారద్వంద్వము చేసిన శబ్దార్థసంబంధము అనురూప మగును కాని యిట్లు చేయుట కొకసందేహము. అర్థము నిత్యమా? కాదా? యని. స్ఫోటరూపమగుశబ్దము నిత్యమేకనుక శబ్దవిషయమున సందేహము లేదు. ఆ శబ్దమునకు అర్థమునకుఁ గల సంబంధము (తాదాత్మ్యము) శబ్దరూపమే యగును కావున నదియు నిత్యమే.

ఇఁక అర్థము మూఁడు విధములు. వ్యక్తి(ద్రవ్యము)కొమ్ములు తోక గంగడోలు మొ॥ వానితోఁ గూడిన గోవ్యక్తి (ఇది నశించునది కావున అనిత్యము.)

2. ఆకృతి-(ఆకారము-సంస్థానము) గోవు యొక్క ఆకారము. అన్ని గోవులయందు కాన్పించు నాకారము. దానిచేత నిదిగోవు అని తెలియఁజేయు గోత్వమను ధర్మము వ్యక్తము చేయఁబడును (ఇది నశించును-అనిత్యము)

3. ఆకృతి (జాతి) అన్నిగోవులయందుండు సమానధర్మము గోత్వము - (వ్యక్తి నశించినను ఇది నశింపకయుండును. నిత్యము) అర్థము నిత్యము అనినచో నిందులో నేది నిత్య మని విమర్శించు చున్నారు.

పరబ్రహ్మ యొక్కటే సత్యమను సిద్ధాంతమున మిగిలిన వన్నియు ననిత్యము లేనైనను వ్యవహారదశయందు నిత్యముగానుండు 'జాతి' నిత్యమని చాలమంది యంగీకరించిరి.

వైయాకరణుల సిద్ధాంతమున శబ్ద మెట్లు స్ఫోటరూపము నిత్యమో, యట్లే యర్థము కూడ బుద్ధిలో భాసించునదియే (బౌద్ధమే) ప్రవాహతః నిత్యమే-అది వ్యక్తియైనను ఆకృతియైనను సరియే. మన యింద్రియములకు గోచరించునది శబ్దప్రతిపాద్యమై శాబ్దబోధలో విషయమగు నర్థము కాదు. దానిచే బుద్ధిలో భాసించునర్థమే యర్థము. అది నిత్యము. శబ్ద ముచ్చరింపఁగనే మనబుద్ధిలో అర్థము ఎల్లపుడు భాసించు చుండును. ఆ భాసించునర్థము ఎల్లపుడు నొకటియే కాక పోయినను నొకేవిధముగా నుండును. నీరు మాఱుచుండినను ప్రవాహము ఎడతెగక పాఱుచో నెట్లది నిత్యముగనే భావింపఁబడునో యట్లే బుద్ధిలో భాసించు నర్థమును నొకేవిధముగా నుండుటచే నిత్యమే. దీనిని ప్రవాహ నిత్యత యందురు.

మూ. ఆకృతి మిత్యాహ। కుత ఏతత్ ?

వ్యాప్తి నిత్యా ద్రవ్య మనిత్యమ్।

అ. 'ఆకృతి'యే పదమున కర్థము అని తలంచితిమి.

'ఆకృతి' నిత్యము 'ద్రవ్యము' అనిత్యముకదా !

మూ. అథ ద్రవ్యే పదార్థే కథం విగ్రహః కర్తవ్యః? సిద్ధేశబ్దే అర్థసంబంధే చేతి। నిత్యో హ్యర్థవతా మర్థై రభిసంబంధః।

అ. 'ద్రవ్యము' పదమున కర్థ మనినపుడు 'శబ్దార్థసంబంధము' అనుచోట విగ్రహవాక్య మెట్లు చెప్పవలెను ?

"శబ్దమును అర్థసంబంధమును" అని చెప్పవలెను. అర్థమునకు శబ్దముతోఁ గల సంబంధము నిత్యమే గదా !

మూ. అథవా ద్రవ్యఏవ పదార్థే ఏష విగ్రహో న్యాయ్యః। సిద్ధే శబ్దే అర్థే సంబంధేచేతి। ద్రవ్యం హి నిత్య మాకృతి రనిత్యా।

కథం జ్ఞాయతే ?

ఏవంహి దృశ్యతే లోకే మృత్కయాచి దాకృత్యా యుక్తో పిండో భవతి, పిండాకృతి ముపమృద్య ఘటికాః క్రియంతే, ఘటికాకృతి ముపమృద్య కుండికాః క్రియంతే। తథా సువర్ణం కయాచి దాకృత్యా యుక్తం పిండో భవతి, పిండాకృతి ముపమృద్య రుచకాః క్రియంతే,రుచకాకృతి ముపమృద్య కటకాః క్రియంతే, కటకాకృతి ముపమృద్య స్వస్తికాః క్రియంతే। పున రావృత్తః సువర్ణపిండః పున రపరయా ఆకృత్యా యుక్తః ఖదిరాంగారసవర్ణే కుండలే భవతః। ఆకృతి రన్యా చాన్యాచ భవతి, ద్రవ్యం పున స్తదేవ। ఆకృత్యుపమర్దేన ద్రవ్యమే వావశిష్యతే॥

అ. లేదా "ద్రవ్యము" పదమున కర్థమనినపు డే "శబ్దమును అర్థమును సంబంధమును సిద్ధములు" అని మూఁడు పదములుగా విగ్రహము చెప్పుట సంగతమగును. ద్రవ్యము నిత్యము-ఆకృతి యనిత్యము గదా ! అది యెట్లు తెలియుచున్నది ?

లోకములో మనము చూచుచున్నాము గదా !

మన్ను ఒక యాకృతితో పిండమనివ్యవహరింపఁబడుచున్నది. పిండాకృతిని చెఱిపి ఘటికలుగను-ఆయాకృతిని జెఱిపి కుండికలుగను చేయఁబడుచున్నది.

అట్లే బంగారము ఒక యాకారముతో బంగారపు ముద్దగా నుండును. ఆయాకారమును జెఱిపి గాజులుగను, గాజులను మార్చి కుండలములుగను జేయఁబడుచున్నది.

ఇట్లు 'ఆకృతి' వేఱు వేఱుగఁ గా ననగును. కాని ద్రవ్యమంతట నొక్కటియే గదా !

వి. ఇచట 'ఆకృతి' యనఁగా నాకారము.

'ఆక్రియతే వ్యవచ్ఛిద్యతే అనేన ఇతి ఆకృతిః' దేనిచేత ఇతరములగు వస్తువులనుండి వేఱుచేయఁబడునో యది యాకృతి. ఇది రెండు విధములు—ఒకటి మనకగపడు నాకారము. ఇది మాఱుచుండును-ఇది యనిత్యమైన యాకృతి.

ఈ యాకారము గల కొన్ని వస్తువులను జూచిన తరువాత నా తెగకుఁజెందిన వస్తువులయందుఁగల సమానధర్మ మొకటి యీ యాకారముచే వ్యక్తము చేయఁబడును. అదియే 'జాతి' గోత్వము—బ్రాహ్మణత్వము-ఘటత్వము మొదలగునది. ఇది నిత్యమైన యాకృతి.

ఇట్లు వ్యంజకమగు రూపము నందును, వ్యంగ్యమగుజాతియందును గూడ నాకృతిశబ్దము వర్తించును. ఇచట భాష్యకారుఁడు మొదటి యర్థమును తీసికొని ఆకృతి నశించును, ద్రవ్యము నశింపదు- అను సిద్ధాంతమును నిరూపించుచున్నాఁడు.

మూ. ఆకృతావపి పదార్థే ఏష విగ్రహో న్యాయ్యః సిద్ధే శబ్దే. అర్థే, సంబంధే చేతి.

అ. "ఆకృతి పదార్థము" అనిన నాఁడు గూడ "శబ్దమును,

అర్థమును, సంబంధమును నిత్యములు" అని శబ్దార్థ సంబంధములను చోట మూఁడు పదములుగ విగ్రహము చెప్పుట న్యాయ్యమే.

వి. ఆకృతి నిత్యము కాదనియు ద్రవ్యమే నిత్యమనియుఁ జెప్పి ద్రవ్యము పదార్థమని యంగీకరించినపుడే శబ్దమును అర్థమును సంబంధమును నిత్యము లనుట పొసగు ననెను. అచట ఆకృతి యనఁగా 'నాకారము' అను నర్థమును గ్రహించెను. ఇచట 'ఆకృతి' యనఁగా జాతి యని గ్రహించి యాకృతియు నిత్యమే యనుచున్నాఁడు.

మూ. నను చోక్తం-ఆకృతి రనిత్యా-ఇతి

అ. మఱి యిపుడే 'యాకృతి యనిత్యము' అని చెప్పినావు గదా!

మూ. నైతదస్తి-నిత్యాఽఽకృతిః

కథమ్? న క్వచిదుపరతేతి కృత్వా సర్వత్రోపరతా భవతి। ద్రవ్యాంతరస్థా తూపలభ్యతే.

అ. ఆకృతి యనిత్యము కాదు-నిత్యమే ఆకృతి యొకచోట కాన్పింపక మరుగుపడినను అంతటను లేకుండ పోదుగదా! వేఱొకచోటఁ గాన్పించుచుండును.

మూ. అథవా నేదమేవ నిత్య లక్షణమ్-ధ్రువం కూటస్థమవిచాల్యనపాయోపజనవికార్యనుత్పత్త్య వృద్ధ్య వ్యయయోగి యత్తన్నిత్యమితి। తదపి నిత్యం యస్మింస్తత్త్వం నవిహన్యతే। కింపునస్తత్త్వమ్? తస్య భావస్తత్త్వమ్ ఆకృతావపి తత్త్వం నవిహన్యతే॥

అ. స్థిరముగా నిశ్చలముగా నుండునదియు, పుట్టుట, ఉండుట, పెరుగుట, మార్పుఁ జెందుట కృశించుట నశించుట అనునాఱు వికారములును లేనిదియు నిత్యమనఁబడును

కాని యిదియే నిత్యలక్షణము కాదు. ఏది నశించినను తద్గతమగు ధర్మము నశింపదో యదియు నిత్యమే ఆకృతి నశించినను తద్ధర్మము నశింపదు-కావున నదియు నిత్యమే. (సశేషము)

శివాయ గురవే నమః

# సూరి లలితోక్తి చాతురి

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

"శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరి బాలవ్యాకరణారంభమున ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులు చేసినవి పెక్కులు కానఁబడుచున్నవి.

కొన్ని లక్షణ గ్రంథముల పేళ్లుమాత్ర మిప్పుడు వినఁబడుచున్నవి. కానఁబడు గ్రంథములందు సంస్కృత సమములకు లక్షణములు బహుతరముగా రచింపఁబడినవి గాని తక్కిన భాషకు విశేషాకారముగా రచింపఁబడినవి గావు. కాఁబట్టి యా లక్షణగ్రంథములు చదువువారికి నిస్సందేహముగా వచనరచన సేయుకౌశలము చిరకాలము బహు లక్ష్యములయందుఁ బరిశ్రమచేయక రానేరదు. కాఁబట్టి యిట్టి కొఱఁత వారింపఁబూని పెక్కులక్ష్యములు సావధానముగాఁ బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని... ప్రకృత గ్రంథరూపముగా రచించినాఁడ." అని పీఠికలోఁ దెలిపి యుండెను.

పై వాక్యముల ననుసరించి సూరి ప్రాచీనము లగు నాంధ్ర లక్ష్య లక్షణ గ్రంథములను బలుమాఱు సావధానముగాఁ బరిశీలించి ప్రాచీన లక్షణగ్రంథములు చాలవఱకుఁ దత్సమప్రక్రియను మాత్రమే విశేషముగా నిరూపించున వగుటచేఁ దాను దక్కిన యాచ్ఛిక భాషాస్వరూపమును సయితము విపులముగ బోధింపవలయు ననియు, నది బాలురకు వచన రచనసేయుటలో మిక్కిలి యుపకరింపవలయు ననియు, వాఙ్మయమున వచనకావ్యములు సయితము పెక్కులు వెలయువలయు ననియు మిక్కిలి కుతూహలపడి, ప్రాచీన లక్షణ గ్రంథము లుపేక్షించిన యాచ్ఛికపదజాలమును గూడ నేర్చి కూర్చు

కొని, యొక నియతమగు ప్రక్రియాప్రణాళిక యేర్పఱచుకొని బాల వ్యాకరణము రచింపఁ గడఁగినటులు సుస్పష్టముగాఁ దెలియుచున్నది.

ఆరంభించుటలోఁ దా నెక్కడో దూరమునఁ గూరుచుండి లక్షణకర్తగా పేరు గడించుటకయి తోఁచినరీతి నేదో యొక లక్షణ గ్రంథము రచించి పడవైచుటమాత్రము యాతని దృష్టిగాదు. మఱి, అంతకుఁ బూర్వము ఆచ్ఛికపద స్వరూపమును దెలుపు ప్రక్రియ యంతగా లేకుండుటచే నట్టి పదజాలమును ప్రాచీన కావ్యములలో నున్నదానిని దన కంటి కానినంతవఱకు సేకరించి సమగ్రముగను సంగ్రహముగను బోధింపవలయును. ఆ బోధించునది తెనుఁగున నిర్దుష్టము సరసము నగు వచనరచనకు వలసిన కౌశలమును బాలురకుఁ గలిగించునదై యుండవలయును. అది యే కొలఁదిమందికోగాదు— ఆంధ్రదేశమందలి బాలబాలికల కందఱకును.

చిన్నయసూరినాఁటికి వచనగ్రంథములు మిక్కిలి యరుదు. తెనుఁగుదేశ మందలి బాలబాలిక లందఱను జక్కని వచనము సయితము రచింప సమర్థులనుగా దిద్ది తీర్పవలయునని యాతనికి గొప్ప కోరిక యగుటచే దేశమునందలి బాలబాలిక లందఱను దనయంతేవాసులుగా నాతఁడు భావించినాఁడు. తా నొక ప్రధాన కళాశాలలో నధ్యాపకుఁడు గూడ నగుటచే శిష్యబృందము నడుమఁ జిఱు నవ్వు మోముతోఁ గూరుచుండి, భాషా సంప్రదాయములను బోధించుచున్నంతటి తృప్తి యీ రచనాసమయమునఁ గూడ నా మహనీయునకుఁ గలదేమో యనిపించును. కావుననే సూత్రోదాహరణముల నిచ్చుటలోఁ గూడ "వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!" అని తన చుట్టును బాలురఁ గలయఁ జూచుచున్నటులు, పేరుపేరున సంబోధించి యొకవంకఁ గూరుచున్న బాలికల నుద్దేశించి "వచ్చితిరి

కాంతలు? వచ్చితిరి కాంతలార!'' అని ముందుగాఁ బలుకరించి, మరల బాలురదిక్కు మొగంబై "అన్నలార! మిమ్ము నడిగెద నొక మాట'' అని బాలురనుమాత్రము ప్రశ్నించు సన్నివేశము (తత్సమ 37) నుచితముగా సంఘటించెను. సమాధానములు చెప్పుటలో బాలికలు బిడియపడుదురని కాఁబోలు బాలురనే ప్రశ్నించుట! ఆప్రశ్నించుటలో శిష్యుల యెడ నాతనికిఁగల వాత్సల్యమును, బాలికలయెడ మర్యాదయు వారికందఱకుఁ బ్రశ్నోత్తర రూపమున నేదో బోధించుచున్న తీరును నొకదానివెంట నొకటి స్ఫురించును. అనఁగా, నీ దేశమందలి బాలబాలికల కందఱకు నొక తరగతి యేర్పఱిచి తానధ్యాపకుఁడై బోధించుచున్నతీరు ఈగ్రంథమునందుఁ బెక్కుతావుల గోచరించుచు నాతని యుత్సాహమును వెలువరించుచుండు ననుట.

తాను బోధింపదలఁచినదా ప్రాచీన భాషాలక్షణము; ఎదుటనున్నవారా బాలురు, పసివారు. కావునఁ దాఁ జెప్పెడి మాటలు శుష్కములై యేవో యుదాహరణ సమన్వయమాత్రప్రయోజనములై యుండరాదు. మఱి, మృదుమధురములై, నీతిబోధకములై, గంభీరభావ గర్భితములై, పురాణకథా స్ఫోరకములై, ఛందోబద్ధములై వారి హృదయములకు హత్తుకొనవలయును. తియ్యతియ్యని యనుపానములతో నారోగ్యకరములగు నౌషధముల నిచ్చునట్లు లలిత లలితము లగు సూక్తులతో భాషా స్వరూప వైవిధ్యమును సోపానక్రమమున నా పసివారి మనస్సులకుఁ బట్టునట్లు బోధింపవలయును. ఇదీ బాలవ్యాకరణ రచనలో చిన్నయసూరి దృక్పథము. కావుననే గ్రంథారంభమున;

"అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం

గను బాల వ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్"

అని తన హృదయము నావిష్కరించి యుండెను. అనఁగాఁ దా నే విషయము వివరించినను, ఏ లక్ష్యము చూపినను అందుఁ గుదిరినంత వట్టు లాలిత్యము గోచరించి బాలురకు నుత్సాహ జనకమై యాకర్షకము కావలయునని యాయన కుతూహలము. దీనిని బట్టి సూరి హృదయమెంత మృదువైనదో, యాయన భావ మెంత విశాలమో, బాలురయెడ నాయన కెట్టి యభిమానమో గ్రహింపుఁడు.

"అతఁడు శ్రీమంతుఁడు-ఇతఁడు గుణవంతుఁడు; వాని వంశము శ్రీమంతము; వీని వంశము గుణవంతము."- (తత్సమ 71) పై వాక్యములను జదువుట తోడనే యాతఁడు బాలురను దన యెదుటఁ గూర్చుండఁ బెట్టుకొని వారిలో నొక్కరిని వ్రేలితోఁ జూపుచు విషయముల బోధించుచున్న నన్నివేశము మన కన్నులకుఁ గట్టును. అంతియ గాదు, ఆ పిల్లలలో నొకనిని బిల్చి "భవ ద్గుణంబులు-త్వదాశ్రయములు" (తత్సమ 87) 'నాయనా! నీవు సుగుణవంతుఁడవు గావలెను, అట్లగుట నీ ప్రవర్తనాభ్యాసమువలనఁ గలుగును. అది నీలోనే యున్నది గాని యొకరు తెచ్చిపెట్టవలసినది గాదు సుమా!' అని బోధించు తీరును, స్ఫురించుచున్నది. ఆ తరువాతి వాక్యములు "మత్పుణ్యము లసద్రూపము" 'నా పుణ్యము చాల మంచిది. ఏల, యన-మీవంటి శ్రద్ధాళువులగు బాలకుల కుపదేశించుటచే నా పరిశ్రమ సార్థకమగుచున్నది గనుక.' అను నభిప్రాయ మిందు గర్భితము. "భవిష్యత్కాలము ధూర్వ్యాహము" 'రాఁబోవుకాల మెట్టిదో! భాషా విషయకముగా నెట్టి యలజడులు పుట్టునో! కంటికే గాని కర్ణమునకు గోచరింపని యీ యరసున్నలతోఁ జిక్కులు పడలేమయా' యని

గోలవెట్టు సుకుమారులు కొంద ఱిప్పటికే యుద్భవించినారు. ఈ ప్రబుద్ధులవలన నెప్పటికోగాదు- "అల్ప కాలమున హ్రస్వముమీఁద ఖండ బిందువునకుఁ బూర్ణ బిందువు (శూన్యత) బహుళంబుగా నగు (సంజ్ఞ 14) నేమోయని భీతి పొడముచున్నది. నేను బహుపరిశ్రమ చేసి సంతరించిన యీ వ్యాకృతి నియమముల నెంత భద్రముగా సంరక్షింతురో! భారము మీయది సుఁడీ! యని తన చుట్టు నున్న బాలురను గలయఁజూచి యుపదేశించుచున్న తీరు స్ఫురించుటలేదా!

సంజ్ఞా పరిచ్ఛేదమునఁ దత్సమ, తద్భవ, దేశ్య గ్రామ్య పదముల స్వరూప స్వభావములను, లక్ష్య లక్షణ ప్రదర్శన పూర్వకముగా నుపదేశించి కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ మున్నగు వైరి సమాసములంగూర్చి యీ కుఱ్ఱల కెట్లు బోధింపనాయని మథనపడి "ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రామ్యంబు" "పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయినను గ్రహింపఁదగు" నని తాత్పర్యము; అని చెప్పి వదలినాఁడు. ఆ పదములలో లక్షణ వైరుధ్యము చూపవలయును. అయినను బెద్దలు వ్యవహరించిరి గాన మనకుఁ బరిగ్రాహ్యములని బోధింపవలయును. భాషాస్వరూప బోధన వ్యాజమున నీయొక్క వాక్యములో బాలుర కెంత చక్కనిధర్మము నుపదేశించెనో, పెద్దలయెడ నాతనికిఁ గల గురుభావ మెట్టిదో, యాయన యుపదేశకౌశల మెట్టిదో గుణగ్రహణ లాలసులకు వేఱ వివరించి చెప్పఁబనిలేదు.

ప్రసంగము వచ్చినపుడెల్ల నుదాహరణ వ్యాజమున బాలుర హృదయములకు నాఁటుకొనునట్లు నీతులను ధర్మములను బోధించుట యాతని సహజ రమణీయ సరణులలో నొకటి- "సత్యము సర్వశ్రేయము, అది లేనిచో సర్వ ధర్మములు వ్యర్థములు" (సంధి 55)

సత్యము పలుకుట యన్ని ధర్మముల కంటె నుత్తమోత్తమ మని బోధించుటకదా! అట్లే "ధనంబుచేత సౌఖ్యంబు గలుగు, విద్యచేత యశంబు గలుగు" ధనము - విద్య యీ రెండింటివలనఁ గలుగు ప్రయోజనముల తారతమ్యము చూపుచు, సౌఖ్యము తాత్కాలికము, యశము శాశ్వతము కావున, ధన మార్జించుట కన్న విద్య సంపాదించుట యెక్కుడు లాభకరమని బోధించుట యాతని యాంతర్యము. ఈ వాక్యములలో సూక్ష్మములో మోక్షమను రీతిగా నందమయిన బింబ ప్రతిబింబ భావముగూడ నిమిడియున్నది. "లోభంబు కంటె నితరంబు దోషంబులేదు, మానహానికంటె మరణము మేలు" (కారక 12) "జ్ఞానమువలన ముక్తుం డగు" (కారక 14) "మోక్షమున నిచ్చగలదు" (కారక 18) "విద్యాశాలియగు పురుషుని సకల జనులు సమ్మానింతురు" "భూతదయాళురగుమహాత్ములకు శ్రేయంబు కలుగును" (కారక 28) ఉదాహృత వాక్య పద్ధతిని బరికింపుఁడు. లోభము దుర్గుణమనియు, మానవునకు మానము రక్షణీయమనియు విద్యావంతుల నెల్లరు గౌరవింతురనియు, భూత దయాపరులై మెలంగుట శ్రేయోదాయక మనియు, బాలురకు బోధించు తీరు ప్రతి వాక్యవిన్యాసమునను గానవచ్చును.

ధర్మములను నీతులను బోధించుటయే గాక, యవకాశము కలిగినప్పు డెల్లఁ జిన్న చిన్న వాక్యములలోఁ బురాతన ప్రసిద్ధ కథాంశములుగూడ బాలుర హృదయములకు హత్తుకొనున ట్లుదాహరించుట యీతని రచనలో గమనింపవలసిన యింకొక విశేషము.

1. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు (కారక-12)
2. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించె (క్రియ-124)
3. రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు (కారక-32)

4. జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను (కారక-8)
5. రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు (కారక-32)
6. రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె (కారక-22)
7. లంకం గలకలంబు పుట్టె (కారక-22)
8. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబునకేతెంచె (క్రియ-120)
9. సుగుణాభిరాముఁడు రామునకు జోహారువొనర్చెద (కారక-27)

ఇట విశ్వామిత్ర యాగ రక్షణ సందర్భమున రాముఁడు రాక్షసులఁబరిమార్చుట- విశ్వామిత్రుఁడు రాముని మిథిలానగరమునకుఁ దనవెంటఁ గొంపోవుట- రాముఁడు, లోకత్రియవీరు లెల్లరు నాకులతఁ జెందునట్లు వారిసమక్షమున శివధనుర్భంగము గావించుట- జానకిని బరిణయ మాడుట- లోకైక ధానుష్కుఁడై పరశురాముని జయించుట- భరతాదు లెంతగా వేఁడుకొన్నను మనోనిశ్చయమును సడలింపక, 'రాజు నాజ్ఞను విధాతృ నానతి'గఁ బాటించి, అరణ్యవాసమునకై పట్టిన ప్రతిన వీడకుండుట- అరణ్యమునఁ దన ధానుష్కతా మహిమ వెలయించి మహావీరులగు రక్కసులఁ బెక్కుర నుక్కడఁగించుట- హనుమానుని యెడ భగవానునితోఁ దుల్యమగు మహత్త్వమును భావించుట- వాలి నొక్క బాణంబునఁ గూల నేయుట- రావణు నంతటి వానిని జంక నిడికించుకొని సప్తసముద్రములందు ముంచియెత్తిన బలశాలియగు వాలిని, ఒక్కకోలతోఁ గూలనేసె నను వార్త ప్రాఁకుట తోడనే యింక మన సంగతి యేమగునోయని లంకావాసులలోఁ గలకలంబు పుట్టుట- ఆ పిమ్మట రాముఁడు రావణునిం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగఁ బుష్పకారూఢుం డయి సాకేతంబున కేతెంచుట- మున్నగు

రామాయణము నందలి ప్రధాన కథాభాగములు పెక్కులు పయి వాక్యములందు సూచితములు. ఇట్లు శ్రీరాముని గుణగణములను సూచించుటమాత్రమేగాక 'సుగుణాభిరాముఁడు రామునకు జోహారు చొనర్చెద' నని పలుకుట గూడ మిక్కిలి సందర్భోచితముగఁ గాన వచ్చును. ఈ యుదాహరణములలో లక్షణ సమన్వయము గావించు కొన్న పిమ్మట దూరదర్శునులగు నుపాధ్యాయులును సుకుమారమతు లగు బాలకులును రామాయణకథాఘట్టములను గుఱుతునకుఁ దెచ్చు కొని వినోదింప వలయునని యాతని యాశంసనము.

వ్యాకరణ ప్రక్రియల నడుమ నిట్టి కమనీయ కథాఘట్టములు స్ఫురింపఁ జేయుటకు నాతని హృదయకోమలత యెంతటిదై యుండ వలయునో సుదూరము పరికింపుఁడు.

ఇట్టిపట్ల "కాకరుతంబు కంటె నన్యంబు కర్కశంబు లేదు, ఖరరబు కంటె నితరంబు భారవాహకంబు లేదు" అని యుదాహ రించినను లక్షణసమన్వయంబున కెట్టి కొఱఁతయుం గలుగదు. అయి నను నీరసములు నిరుపయోగములు నగు వాక్యముల నిరూపింపక, ఆనందకరములు నాకర్షకములు సకలానుభవ సిద్ధములు నగు వాక్య ములం జూపుటలోని లాలిత్యము మెప్పు లందక తప్పదు గదా!

ఈ సందర్భమున మఱికొన్ని యుదాహరణములతీరు మీఁదఁ బరికింపుఁడు—

తిర్యక్కులు కర్తలగునపుడు భూత తద్ధర్మాద్యర్థకముల ప్రథమ పురుష బహువచనంబునకు నేకవచనం బగు ననుటకు; (క్రియా–25)

'చిలుకలు వలికెను—చిలుకలు వలుకును'

అని యుదాహరణములు. 'కాకులు కూసెను — కాకులు కూయును' అనరాదా ? అనవచ్చును- అనఁడు. వ్యాకరణమునం

మయినను బాలకుల చెవులకు సోఁకవలసినవి చిలుకల పలుకులుగాని కాకుల యఱపులు కావని యాతని దృష్టి.

మఱియు, తద్ధర్మాదులగు లాడర్థములు చూపుటలో (క్రియా-22)

1. తద్ధర్మము;- 'కులాలుఁడు కుండలు వానును'. కుండలు వానుట (తయారు చేయుట) కుమ్మరి ధర్మము. ఇతర కులవృత్తులు కాలక్రమమున నెన్ని తాఱుమాఱు అయినను, కులాలుని వృత్తిమాత్ర మితరాక్రాంత మయినటు లింతవఱకుఁ గానరాదు. కుండలు చేయు ధర్మము కుమ్మరిదే యని బాలురుగూడ గ్రహింపఁగల యంశము.

2. తచ్ఛీలము;- 'జ్వాలన జ్వాలంబు లుప్పరం బెగయును'— అగ్నిజ్వాలకుఁ బయికెగయుట స్వాభావము. దీపము నెటు వంచినను దాని కొస మీఁదికే లేచుచుండుట నిత్యమును బాలురు చూచు చుండునంశ మగుటచే, తచ్ఛీలార్థమునకై యొసంగిన యీ వాక్యము బాలకుల సులభసమన్వయమునకు మిక్కిలి సముచితము.

3. సంభావన;- 'ఇప్పుడు వాఁ డింట నుండును'—'ఈ సమయమున బహుశః వాఁడింటనే యుండవచ్చును'- అను నూహ యిందు సుస్పష్టము.

4. సంప్రశ్నము;- 'ఉందునా, పోదునా' ఇటఁ బ్రశ్నార్థము సులభముగనే స్ఫురించును. కాని తక్కిన యుదాహరణముల కంటె దీనియందొక విశేషము పొడగట్టుచున్నది.

తద్ధర్మము, తచ్ఛీలము మున్నగునవి యన్నియు నిచటి క్రియా ప్రత్యయములకు నర్థములు. అనఁగా, ఆ ప్రత్యయములే యీ యర్థములను బోధింపవలయు ననుట.

ఇటఁ గొందఱు 'ఉందునా పోదునా' అను వానిలో 'ఆ' కార మొకటి చేర్పఁబడినదే ! ఇటఁ బ్రశ్నార్థమును బోధించెడిది 'ఆ'కా

రమా ? క్రియా ప్రత్యయమా ? 'ఆ' కారము తొలఁగించి 'ఉందును, పోదును' అనినచోఁ బ్రశ్నార్థము లేశమును స్ఫురింపదే ! 'ఆ' కారము చేర్చిన యెడ, ఈ లకారము (లొట్టు) మాత్రమే యననేల ? లడాది లకారము లెల్లను ప్రశ్నార్థకములే యనవలసి వచ్చునే ! ఉన్నాఁడా ? ఉండెనా ? ఉండఁగలఁడా ? ఉండఁడా ? మున్నగు వానిలో నెల్ల 'ఆ' కార యోగముచేఁ బ్రశ్నార్థము స్ఫురించుచునే యుండునే ! ఇంతే యేల ! క్రియాపదములకే గాక, 'వాఁడా ? వీఁడా ?' అని యిట్లు 'ఆ' కారము దేనికొస నుంచినను అవి యెల్లఁ బ్రశ్నార్థకములే యగుచుండునే! ఇట్టి స్థితిలో 'లొట్టు'మాత్రమే ప్రశ్నార్థకమని చెప్పుట యెట్లు పొసఁగును ? అని శంకింపవచ్చును. నిజమే-కాని-

ప్రశ్న యనునది సాధారణముగ సమాధానసాపేక్షము.— అనఁగా 'వండెనా' అను ప్రశ్న వండెననియో, లేదనియో సమాధానమును గోరెడిదయి యుండు ననుట. అతఁడు రాముఁడా ? గోవిందుఁడా ? అను ప్రశ్న 'ఫలానివాఁడు' అను సమాధానము నపేక్షించునదై యుండును. అట్టిచోట్ల 'ఆ' అనునది ప్రశ్నార్థమును బోధించుచుండును.

తద్ధర్మాదులందలిది అట్టి ప్రశ్నార్థము కాదు. ఇది సమాధాననిరపేక్షము. మామూలు ప్రశ్నకంటె విలక్షణము. ఆ విలక్షణత స్ఫురింపవలయుననియే కావలయును సూరిగారు దీనిని 'ప్రశ్న' మనక 'సంప్రశ్న' మని పేర్కొనినారు.

అనివార్యములగు రెండు పనులు చేయవలసి వచ్చినపుడు— వానిలో, ఏపని చేయుటకును వలనుపడని క్లిష్ట సమస్య తటస్థించినపుడు-కర్తవ్యము నిర్ణయింపరాని సందర్భములో నిట్టి సంప్రశ్న ప్రయోగమేర్పడును.

శాకుంతలమందలి యొక సన్నివేశమును గుర్తునకుఁ దెచ్చుకొన్నచో, ఈ సంప్రశ్న స్వరూపము మనకు స్పష్టముగా సూటిగా గోచరించును.

కణ్వాశ్రమమున దుష్యంతుఁడు; "ఇతస్తపస్వికార్యమ్-ఇతో, గురుజనాజ్ఞా-ద్వయమ ప్యనతిక్రమణీయమ్.-కిమత్ర ప్రతివిధాతవ్యమ్!"

ఋషికార్యము నెఱవేర్చుటకయి - ఆశ్రమమున - ఉండకను - తప్పదు. పురమునుండివచ్చిన గురుజనాజ్ఞను బాలించుటకు-అటు పోవకను-తప్పదు-ఉందునా? పోదునా?- ఉండుటా? పోవుటా? (ఉండడమా? పోవడమా?) ఏమి చేయుటకును వీలుకానరాకున్నదే! అనుచున్నాఁడు.

అది విని "త్రిశఙ్కురివ అన్తరాళే తిష్ఠ" ఇచట నుండుటయుఁ గుదురదు-అచటికి వెళ్లుటయుఁ గుదురదు.- త్రిశంకువువలె నంతరాళమున వ్రేలాడుచుండుము. అని విదూషకుఁడు పలుకుచున్నాఁడు.

ఇట్టి చోట్ల-కింకర్తవ్యతానిర్ణయము తేలని సందర్భములందు వేసికొను నిట్టి ప్రశ్నమే సంప్రశ్నము. ఇది యెదుటివారు కర్తవ్యము నిర్ణయించి సమాధానము చెప్పవలసిన ప్రశ్న కానేకాదు.

పరస్పర విరుద్ధములగు రెండు (కొన్ని) పనుల వికల్ప సమస్యలోనే యీ సంప్రశ్నము గోచరించును.

వికల్పము లేకుండ, 'ఉందునా' అని- ఒక్క పదమును మాత్రమే ప్రయోగించినచో నది లాడంతమే యయినను నచటిది మామూలు ప్రశ్నమే. సంప్రశ్నము కాదు.

ఈ ప్రశ్నకు-ఉండుమనియో వెళ్లుమనియో సమాధానము అపేక్షితము-ఏదో యొక సమాధానమునకు సంభవమును గలదు- ఇట్టి యెడ ఈ 'లాట్టు' భావ్యర్థకము- 'ఆ' కారము ప్రశ్నార్థకము.-

ఈ సూక్ష్మమును గూడ గుర్తించియే సూరి- 'కుండలు

వానును, 'ఉప్పరంబెగయును' 'ఇంటనుండును' మున్నగు తక్కిన యుదాహరణములందువలెఁ గ్రియాపదమును ఒక్క దానినే యిచ్చుటకు వలనుపడకనే యీ యొక్కచోట మాత్రము 'ఉందునా ? పోదునా ?' అని పరస్పర విరుద్ధార్థకములగు క్రియాపదములు రెండిటిని గలిపి యీ యుదాహరణము చూపియుండెను.

## మఱొక్క చిన్న యంశము

ఉండనా ? పోనా అని లోకవ్యవహారయున నొక ప్రయోగరీతి కలదు:—ఇటఁగూడ సంప్రశ్నార్థమే స్ఫురియించును. కాని యిచట ఉండను పోను అనురూపములు సమాపకక్రియాపదము లనిమాత్రము బాలురు భ్రమింపవలదు, ఇవి నుజ్యంతములు—కేవల భావార్థకములు,—ఉండుటా? పోవుటా? అనుప్రయోగములును బట్టితత్సమానార్థకములగు నుజ్యంతములతో ఉండనా పోనా? అనుమున్నగువాడుక లేర్పడియున్నవి–నుజ్కికి భావార్థకత లోకవ్యవహారముననే గాక కవిప్రయోగములందును బెక్కుతావులఁ గానఁగును–దాని నిట పోదాహరణముగ వివరించి చూపుట–కొంతకుఁ గొంత ప్రసక్తమేయయినను శాఖాచంక్రమణావైముఖ్యముచే విరమించితిని.

కాఁగా లకారములలో లొట్టుమాత్రమే సంప్రశ్నార్థక మని తేలుచున్నది.క్రింది భారతప్రయోగమును బరిశీలింపుఁడు.

అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరలతోన యేనుఁ జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడియై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమీ.

(ఉద్యోగ-౩-112)

ఇది ద్రౌపది వాక్యము-

జూదమున నోడఁబడి-దాసినై యుండి వారికడ కోడలికము నెఱపుట యెట్లు? అసలు-కోడలనుగదా! వారియింట దాసీత్వము నవలంబించుట యెట్లు? ఏతీరున మెలఁగుటకును వీలు కనఁబడదే! అని యామె యెటుచేయుటకును దోఁపని తనక్లిష్టసమస్యను నివేదించుచున్నది.

ఇట 'లాట్లు' నే సోమయాజులు ప్రయోగించియున్నారు

ఈచూపునఁ బరికించినచో నిట్టికవిప్రయోగములు పెక్కులు లభింపఁగలవు.

భాషలో నిట్టి యర్థవిశేషమును నిగూఢముగ బోధించు నీ తెలుఁగు నుడికారమును గుర్తించియు-లాడంతప్రయోగములందే యీ యర్థము స్ఫురించుటను గమనించియు- భారతాది ప్రయోగసరణిని బరిశీలించియు-విలక్షణప్రశ్న మనుస్ఫురణమునకై సంప్రశ్న మని పేరిడియు - సూరి తద్ధర్మాదులందు దీనిని జేర్చియున్నటులు గోచరించును.

5. సాతత్యము; 'సర్వంబునం దీశ్వరుఁ డుండును-సర్వం బీశ్వరుని యం దుండును; లోకములందలి ప్రత్యణువునందును నీశ్వరుఁడుగలఁడు. ఈశ్వరునియం దీలోకములన్నియు నిమిడియున్నవి. ఇట్టియింతటి సాతత్యమును మఱియేలక్ష్యమందును జూపుట పొసఁగదు. అది యటుండ నీశ్వరుని సర్వాంతర్యామిత్వమును సర్వమయత్వమును నిర్దేశించి, బాలురకుఁ దాత్త్వికదృష్టి నంకురింపఁజేయుటయు నావశ్యకము-ఎట్టిచూపులతో నెన్నియూహాలతో వాక్యములు కూర్చునో పరికింపుఁడు.

ఇటులే కృష్ణుండు తల్లివలన డాఁగె (కారక-9)

రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి. (కారక7)

అనువాక్యములలో, కృష్ణుని బాల్యక్రీడలు, బలరామకృష్ణుల విద్యాభ్యాసము మున్నగు భాగవత కథాంశములు నిర్దిష్టములు.

'జరాసంధుఁడు రాజులచేతఁగప్పంబుఁగొనియె.' (కారక 4.)

రాజులనెల్లర జయించి వారిచే జరాసంధుడు కప్పములుగొనుట హరివంశకథకుఁ బ్రస్తావము.

కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను." (క్రియ 124)

ఈచిన్న వాక్యమువలన భగవద్గీతాప్రసక్తి యంతయు స్ఫురింపకమానదు.

ఈరీతిగా వ్యాకరణద్వారమున నొకవంక ధర్మములను నీతులను బ్రస్తావించుచు, వేఱొకవంకఁ బురాతనగాథలను స్ఫురింపఁజేయుచు, నడుమనడుమ భక్తిని నెలకొల్పఁజాలు నలఁతియలతివాక్యములను ఛందోబద్ధములై కంఠస్థములగుట కనువయిన చిన్నచిన్న పద్యభాగములను గూర్చుట యీతనిరచనలోని మఱియొక్క విశేషము. ఈక్రిందివాక్యములను దిలకింపుఁడు.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద. (కారక. 27)
హరి ననుఁగృపఁగాంచెడును. (క్రియ. 26)
హరి ననుఁగృపఁ గాంచుతను. (క్రియ 26)
ఆర్తిహరుఁడగు నినుఁగొల్తు నంబుజాక్ష. (కారక
నందతనయుండు నాకు దిక్కు. (కారక. 19)
దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు. ,,
శుభవిధాయుల రామకృష్ణుల భజింతు. ,,
భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు. ,,
అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు. (కారక-29)
ఆద్యుఁడ ప్రమేయుఁడు నగు హరిని గొలుతు- (కారక-30)
ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌ హరిని గొలుతు- ,,

ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు ”
ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁ
డై యొసంగెడు దేవుని నభినుతింతు-(కారక-31)

భగవద్భక్తిగర్భితములగు నిట్టివాక్యములు పసివారి హృద యములందు ముద్రితములై యొకప్పుడుగాకున్న నొకప్పుడేని స్మృతిపథమునకు రాకమానవనియు రావలయుననియు నాతని తలంపు-

సూరి వైష్ణవప్రపత్తి సంకలితుఁడగుటచే హరిభక్తిని బోత్సహించుచు నాతఁడిచ్చు నుదాహరణములు రామకృష్ణపరములై రామాయణభాగవతప్రసక్తములై యుండుననుటలో వింత యేమియును లేదు- అట్లుండుట కాతని వైష్ణవమత గౌరవమే కారణము. సూరికి హరిభక్తితత్పరత యపారమే యయినను నన్యమతములయెడఁగాని యితరదైవతములయెడఁగాని నిరసనభావ మావంతయు లేదనికూడ గోచరించును.

సంబోధనమునఁ బ్లుతమును బ్రదర్శించునెడ (తత్సమ-35) 'ఓ విష్ణూ3' అను నుదాహరణ మొక్కటియే చాలినను, దాని ప్రక్కను 'ఓ శంభూ3' అనికూడ నుదాహరించుటలోఁ దన సమదృష్టిని రవంత స్ఫురింపఁజేసెనా యనిపించును.

సూరిగారు సరహృదయులు-సరళస్వభావులు- మితభాషులు- మృదుభాషులును. కఠినములు నశ్లీలములగు పదము లుపయోగించుటగాని, పరుషముగాఁ బ్రసంగించుటగాని, ఒకరిని లఘూకరించుటగాని యాతని స్వభావమే కా దనిపించును. లక్షణనిరూపణముపట్ల నితరుల మతము తనకభిమతము కాకున్న తావులందు-

'అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు పలికెఁనది నిరాకరంబు' (సంధి-54)

'కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె;నది గ్రాహ్యంబు గాదు' (క్రియ-68)

'ప్రానుపాదవుల కాదిలోపం బొకండు వచియించె;నది యవిచారమూలకంబు (ప్రకీర్ణ-10)

అని యీతీరున మృదువుగను విషయప్రధానముగను జెప్పి విడిచివైచునేగాని వ్యక్తులపేరయిన నెత్తుట యాతనికి రుచింపదు.

ఇంతయేల ! లాఘవాపాదకములుగాని, అగౌరవసూచకములుగాని, అమంగళములుగాని యగు కార్యములను దెలుపు క్రియలుగల వాక్యములలోఁ గర్తృపదములను గూర్పవలసి వచ్చినపుడు;

దేవదత్తుఁడు వంటకమును వండెనుఁ (కారక-2)

మైత్రుఁడు చైత్రునిచేత ఋణంబు గొనియె- (కారక-4)

మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె. (కారక-9)

చైత్రునిచే మైత్రుండు కొట్టంబడి మడిసె (క్రియ-38)-మున్నగురీతిని, ఏ కర్తలనో సృజించి వాక్యములు చూపునేగాని వంటకమువండుట, ఋణంబుగొనుట, రాజ్యభ్రశమునొందుట, మరణించుట మున్నగు క్రియలకు ప్రసిద్ధరామాది కర్తృపదములను వాడనేలేదు-దీనినిబట్టి యాయనహృదయ సారళ్య మెట్టిదో ప్రసంగధోరణి యెంత మృదువుగ నుండునో సులభముగా గ్రహింపవచ్చును-

మఱియు, చేదర్థకానంతర్యార్థకాది ప్రత్యయముల కుదాహరణము లిచ్చునపుడుగూడ

'వానలు గురిసినం బంటలు పండును' (క్రియ-41)

'జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె-' (క్రియ-42) అని లోకకళ్యాణమును, మనోహరదృశ్య సన్నివేశమును గోచరింపఁజేయువాక్యములే యాతనికి స్ఫురించునుగాని,యమంగళములు జుగుప్సితములునగు భావము లాసహృదయునికి స్ఫురింపవేమోయనిపించును

'వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు, వీరు మువ్వురు శ్రీభూనీళలు-' (ఆచ్ఛిక- 26)

ఆయా దేవతామూర్తులను గన్నుల యెదుటఁ జూపి బాలుర హృదయముల కాదివ్యరూపములు హత్తునట్లు చెప్పుతీరు పయి యుదాహరణములలోఁ గన్పట్టును- ఇందలి విషయము; - సర్వనామక్రియాపదముల బహువచనము మహద్వాచకముల కెటులుండునో మహతీవాచకములకుఁ గూడ నటులే యుండు నని నిరూపించుట.——ఆ నిరూపించుటలో, ఏ స్త్రీవాచకరూపముల నిచ్చినను ప్రకృతమునకు లక్ష్యములు కాకపోవు. అట్లుచూపుట యాతని స్వభావము కాదు. వీలగు నంతవఱకుఁ బురాణమూర్తులను, నందును దేవతామూర్తులను బాలురకుఁ జూపి చెప్పవలయును-

ఆదృష్టితోడనే "వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు వీరుమువ్వురు శ్రీభూనీళలు" అని విష్ణుని పట్టపురాణులను ప్రసంగవశమున బాలుర కనుల యెదుట సాక్షాత్కరింపఁజేసిన ట్లుదాహరించియుండెను.

సాధారణముగా నీయవలసిన యుదాహరణములలోనే యింత దూరపుఁజూపుగల సూరిగారు, విశేషించి చూపఁదగిన ప్రయోగములలో నెంత జాగరూకత వహింతురో ; తన్మూలమునఁ జదువరులగు ఆ బాలుర కెన్నిరీతులఁ దత్త్వధర్మోపదేశములు చేయుదురో యించుక పరికింతము

కారక పరిచ్ఛేదములో "అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి కారణంబు లెద్దాన నగు, దానికి వలన వర్ణకంబగు" (కారక- 9) నను సూత్రమునకు వారొసఁగిన యుదాహరణము లెంత సార్థకములో, తన్మూలమున సూరిగారు విద్యార్థులకు సూక్ష్మముగా నెన్నిధర్మరహస్యముల నెఱిఁగించిరో పరికింపుఁడు.

"పాపంబువలన నేవగించె"- ఏవగింపవలసినది పాపము. పాప కృత్య మెట్టిపరిస్థితిలోను సేయరాదనుట.

"అధ్యయనంబువలన డస్సె"- ఊరక పెదవులపైఁజదువుట గాదు. అలసిపోవునట్లు చదువవలయును.

"పాడివలనం బరాకు వడియె"- పరాకు పడరానిది ధర్మము. దేనివిషయమునను బరాకుపడరాదు. విశేషించి ధర్మమువిషయమున. "చోరునివలనం గాచె" అందఱలోఁ జోరులు భయజనకులు, హానికరులు, కాన నెట్టివారినేని వారివలన రక్షింపవలయును.

"భోగంబులవలన విరమించె" - అనుభవించుచున్న కొలఁది భోగము లెంతవారికేని యధఃపతనము గావించును. కావున వానినుండి మనస్సును మరలించుకొనవలయును.

"శోకంబువలన వారించె"- ఇతరులదుఃఖమును మాన్పుటకు యత్నింపవలయును.

ఈ విధమున నిదానముగాఁ జూచినచో సూరిగా రుదహరించిన వాక్యములొకవంక లక్ష్యానుభవమును లక్షణజ్ఞానమును గలిగించుచు, వేఱొకవంక ధర్మసూక్ష్మములనుగూడ బాలుర కుపదేశింపఁజాలి యుండును.

చిన్నయసూరి మంచివివేచనముతోపాటు నిదానమగుచూపును లౌకికమగు ప్రజ్ఞయుఁ గలవ్యక్తి, శాస్త్రీయ విషయములు క్లిష్టములై దురవగాహములై యారంభదశలో నున్న వారికెంత విసుపు జనింపఁ జేయునో గుర్తించిన తత్త్వజ్ఞుఁడు. కనుకనే లోకవృత్తములను మనోహర సన్నివేశములను దన యుదాహరణములలో నతినిపుణతతోఁ బొదిగి వ్యాకరణ గ్రంథమును జక్కని కావ్యలాలిత్యము గోచరించు నటులు రచించెనా యనిపించును.

కారక పరిచ్ఛేదములో 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు' (కారక-24) నను సూత్రము గలదు. జడ వాచక శబ్దములు ద్వితీయకుఁ బ్రథమావిభక్తి వచ్చుట యిందలి విషయము. దాని కుదాహరణములుగా "వాఁడు పువ్వులు దెచ్చె" (వాఁడు పువ్వుల

లను దెచ్చె) ఆకె సొమ్ములు దాల్చె (ఆకె సొమ్ములను దాల్చె) వాఁడిల్లు వెడలె (వాడింటిని వెడలె)అను వాక్యముల నిచ్చియుండెను. వీనిని సామాన్య దృష్టితోఁ జూచినచో 'పువ్వులను'అను ద్వితీయకు 'పువ్వులు' అని ప్రథమ వచ్చుట మాత్రమే గోచరించును. కాని యీ సూత్రమందలి పదముల కూర్పును, నుదాహరణ వాక్యరీతిని గలిపి నిదానముగాఁ బరికించినచో నిది యొక చిన్న వినోద ఘట్టముగా స్ఫురించును. లోకమున జడుని ద్వితీయ (భార్య) తఱచుగాఁ బ్రథమ యగునఁట ! అనఁగా సంసార రంగములో నతి స్వతంత్రయై ప్రధానురా లగుననుట. ఎట్లందురా, వాఁడు జడుఁడు. సంసారమును జక్కఁదిద్దుకొననేరఁడు. ఆ భారము సయితము, తాను వహింపవలసి వచ్చుటచే నామెకు గొంత విసుగును, భర్తపై నలక్ష్యభావము నేర్పడుట సహజము అట్టి భార్యకు నేదేనొక మార్గమున నాతఁడు ప్రీతిని గలిపింప యత్నించుట సహజము. అందులకేఁ గావలయును వాఁడు పాపము, ఆమె యిచ్చకమునకై పూవులు దెచ్చినాఁడఁట. ఆమె యాతఁడు తెచ్చిన పూవులు ముడుచుకొన నిచ్చగింపక యావఱకున్న సొమ్ములు దాల్చినదఁట. అతఁ డెంతజడుఁడైనను దాఁదెచ్చిన పూవులు నిరాకరించుట వలనఁ జిన్నఁబోక తప్పదుకదా ! చిన్నవోయి యేమియుఁ జేయలేక, ఏ మాటయుఁ బలుకలేక యిల్లు వెడలినాఁడఁట. ఈ చిన్న ఘట్టమున, చేఁతగాని మగని సంసారపు సన్నివేశము స్ఫురింపఁజేసి యెంత సరసమగు సమాసోక్తిని సంఘటించెనో? పరికింపుఁడు.

సూరి, ప్రాచీను లుపేక్షించిన యాచ్ఛిక పద ప్రక్రియను వివరించుటయేఁ గాక దక్కిన గ్రంథము మొత్తమునఁ దెనుఁగు పదములను, తెనుఁగు వాక్యములను, దెనుఁగు పలుకుబడులను హెచ్చుగా నుదాహరించియుండెను. ఆచ్ఛిక,తద్ధిత, క్రియా, కృదంత, ప్రకీర్ణక పరిచ్ఛేదములలో నాయన చూపిన దంతయు గేవల యాచ్ఛిక పద ప్రక్రియయే. తత్రాపి, తెనుఁగు క్రియల స్వరూప స్వభావ

ములను గూర్చియు, వాని వివిధ రూపముల ప్రక్రియలను గూర్చియు మిక్కిలి విపులముగను విశదముగను వివరించియుండెను. దీనివలన, ఆచ్ఛిక పద ప్రక్రియా నిరూపణమున లాక్షణికులలోఁ బ్రముఖుఁడన్న విశిష్టత యాతనికి దక్కినది. ఆ భావన యాయన మాటలలోఁగూడ నిగూఢముగా నిమిడియున్నదేమో యనిపించును. క్రియలలో నిష్పన్నములగు రూపముల ప్రక్రియను జక్కని యానుపూర్వితోఁ సమగ్రముగఁ బ్రదర్శించి, యా పరిచ్ఛేదము తుట్టతుదిని "కన్యాది యోగంబునఁ బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగానగు" (క్రియా 124) నని వివరించుచు "కృష్ణుండర్జునునకు విశ్వరూపంబుంజూపె" నని యుదాహరించెను. కృష్ణుఁడర్జునునకు విశ్వరూపము చూపినరీతిగనే, యింతదనుకఁ బూర్వులు చూపక విడిచిన యాచ్ఛికపద విశ్వరూపమును దా నీప్రకరణమున బాలురకుఁ జూపఁగల్గితినని తనలోఁదాను తృప్తిఁజెందనా యనిపించును. నిజమున కాపరిచ్ఛేదము అంత విపులముగను విశదముగను నున్నది కూడ.

ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములను విధించుచు "పూచెను గలువలు, తోఁచెను జుక్కలు, చేసెను ఢక్కులు, నెగడెను దమములు, మొగిడెను బద్మము" అని యుదాహరించెను. స్థూల దృష్టికిఁ బై యుదాహరణములలోఁ గ్రమముగాఁ బరుషములకు సరళము లాదేశము లగుటయే చూపట్టును. కాని యా యుదాహరణ సరణిని, గ్రమమును సూక్ష్మముగాఁ బరిశీలించి కావ్యదృష్టితోఁ జూచినచో నీ వాక్య సరణియందు సాయంసంధ్యావర్ణన మిమిడి యున్నటులు గోచరించును. సాయంకాలమగుట తోడనే కమలబాంధవుఁ డస్తమించుటయుఁ గలువలతేఁ డుదయించుటయుఁ బరిపాటి కదా! చంద్రోదయ మగుటతోడనే కలువలు పూచినవి. చుక్కలును బొడసూపినవి. క్రమముగాఁ జీఁకటు లలముకొనినవి. కావుననే జారచోరులు టక్కులు (మోసములు) సేయ మొదలిడిరి. జలజబాంధవుఁ డస్తమించెను గానఁ బద్మములు ముకుళించినవి. ఈ తీరునఁ గువలయ వికాసము, నక్షత్రోదయము, తమఃప్రసారము, జారచోర

విజృంభణము, పద్మముకుళనము ఆదిగాఁగల సాయంకాల ధర్మ ములను నిరూపించుటచేఁ దత్సమయస్ఫూర్తియు, సంధ్యాకాల ప్రవర్త మాన ప్రకృతిసిద్ధ కార్యస్ఫూర్తియుఁ గలిగించెను. సూరి బుద్ధిపూర్వక ముగా నిట్టి సన్నివేశములఁ గల్పించెనా, లేక యానుషంగికముగా నయ్యవి కుదురుపడినవా, యను చర్చతో మనకుఁ బ్రసక్తి వలదు. శుష్కములగు వ్యాకరణాంశములను నిరూపించుపట్లఁ గూడ సూరి మనోహరమై లలితమగు రచనారీతి ననుసరించు నని గుర్తించుట మాత్రమే సరసమార్గము.

ఇట్లే సంధిపరిచ్ఛేదాంతమున ననుకరణ సంధి సూత్రోదా హరణములుగా "వర్ధతాంశ్రీయనియె, తుభ్యంనమోయనె, కింతత్తనియె, కస్త్వమ్మనియె, దాసోహమ్మనె, తత్కర్తవ్యమ్మనె" అను వాక్య ములు గలవు. సాధారణముగాఁ జూచినచో సంస్కృతవాక్య ములు తెనుఁగులో ననుకరించినపు డుండవలసిన విధానము మాత్రమే పై వాక్యములలో గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించితి మేని యిందొక వినోద ప్రసంగము గూడ నిమిడియున్నట్లు బోధపడును. వైష్ణవ సంప్రదాయముగల యాచార్యుఁడు తన శిష్యుని 'వర్ధతాంశ్రీః' సంపద వర్ధిల్లును గాక, యని మంగళాశాసన పూర్వ కముగాఁ బలుకరించినాఁడఁట. వైష్ణవ సంప్రదాయము ననుసరించి "దాసోహ" మనుచుఁ బ్రణామ మొనర్పవలయును. అది గుర్తింపని యా శిష్యుఁడు, అయ్యా! నమస్కార మను సాధారణ రీతిని "తుభ్యం నమః" అని పల్కినాఁడఁట. అంతట నాచార్యులు 'కింతత్?' 'కస్త్వమ్?' అదేమోయి! నీ వెవఁడవు? వైష్ణవుఁడవు గావా ? యని హెచ్చరిం పఁగా, నప్పు డాతఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నాలుక కఱచుకొని, తప్పు దిద్దుకొని "దాసోహ"మ్మనియె నఁట. అటుపై ఆచార్యులు 'తత్కర్త వ్యమ్' "అట్లు చేయవలయునోయి" యని పల్కినారఁట. ఈ వైష్ణవ గురుశిష్యుల ప్రసంగమునందలి ముచ్చటను గమనింపుఁడు.

సాధారణముగా గద్యముకంటెఁ బద్యము శాశ్వతమై పఠనాను

కూలమై ధారణయోగ్యమై యుండును. కావుననే ప్రాచీన గ్రంథములు ఛందోబద్ధములుగనే రచింపఁబడినవి. చింతామణి వికృతి వివేకములు సంస్కృతమునను, భూషణ చూడామణ్యాదు లాంధ్రమునను బద్య మయములై యుండుట సర్వవిదితము. ఇట్లు ప్రాచీనాంధ్ర లాక్షణి కులు బాలకుల ధారణానుకూలతకే తమ రచనలను ఛందోబద్ధములు గావించియుండిరి.

చిన్నయసూరియు నీ యభిప్రాయముతోడనే తొలుదొల్తఁ దన వ్యాకరణమును బద్యాంధ్రవ్యాకరణ మనుపేర ఛందోరూపము ననే యుపక్రమించియుండెను. పిమ్మట లక్షణ రచనమున ఛందో నిర్బంధ మున్నచో నవ్యాప్త్యతివ్యాప్తులు దుర్నివారము లగునని గుర్తించి తాదృశదోషరహితముగను నిష్కృష్టముగను సంక్షిప్తము గను లక్షణము బోధింప నిశ్చయించి వచన రూపముగా, నందును సూత్రరూపముగాఁ, దుదికిఁ దన వ్యాకరణము సంతరించెను. అయి నను నాతని సూత్ర గమనమునందును సూత్రార్థవివరణసరణి యందును నుదాహరణ మార్గమునందును గణబద్ధమైన పద్యభాగ ములనడక లిమిడియేయుండును. ఇంతయేల కేవలవచనరూపమైన నీతిచంద్రికగూడఁ దాళలయాన్వితమై పెక్కుతావులఁ బద్యపాద ములుగాఁ గుదురువడుననుట యనుభవజ్ఞు లెఱుంగనివిషయము గాదు. అనఁగా నాతనివాక్కులే సహజముగా ఛందోగర్భితము లన్నమాట. మచ్చునకయి యిటఁ గొన్నిటిని బ్రదర్శింతును. సూత్రములలో—

1 పట్టి-వర్ణకంబు-హేతువులగు-గుణ-క్రియల-కగు'ను.)

2 ఈయోగ-మంబులుప-రంబులగు-నపుడు, ఉత్వం-బునక-త్వంబగు.

3 ద్వంద్వంబు-నందుబు-కారంబు-నకురవ-ర్ణంబువి-భాషను (గలుగు చుండు)

4 అందు-వరుసను-రెండేసి-ప్రథమ-మధ్యమో-త్త-మంబుల-నంబడు.

5 మధ్యమము-డుజ్జులు-ముజ్జునా-బడును. వివరణములలో

1 మీరలు-పెద్దలి-త్యాదులు-ప్రాయిక-గ్రహణంబు-చేరక్షి-తంబు-లయ్యె.

2 ఏనిప్రి-భృతిశబ్ద-ములుగొన్ని-నియమసా-పేక్షంబు-లయియుండు.
3 చైత్రుని-చేతమై-త్రుండుకొ-ట్టంబడి-మడిసెని-త్యాదిసి-ద్ధంబ-యయ్యె.
4 ప్రకృతి-జన్య-,బోధంబు-నందుఁబ్రి-కారంబు· భావంబు.
5 ఊష్మరే-ఫంబులకు-ద్విత్వంబు-గలుగదు.

ఉదాహరణములలో.

1 తుల్యార్థ-యోగంబునందుచై-త్రునితోడ-మైత్రుండు-దుల్యుండు.
2 గోవుల-లోపలఁ-గపిలబ-హుక్షీర.
3 ముక్కంటి-కడలిదా-చూలి-నలువ.
4 మూఁడుజ-గములుము-జ్జగములు-మూఁడులో-కములుము-ల్లోకముల్.
5 సుగుణాభి-రాముఁడు-రామునకు-జోహారు.
6 వానలు కురిసినం-బంటలు-పండును-వాఁడుర-మ్మనినబో-యితిని-(నేఁడు)
7 అన్న-దమ్ములు-తల్లి-దండ్రులు-ఊరు-వల్లెలు-ఆలు-మగలున్
8 నాప-చేను-పాప-ఱేఁడు-నాము-పాము-ప్రేము-వేము, అమ్ము-ఎమ్ము-కనుము-ఇనుము-ఉడుము-ఎనుము·జనుము-మినుము.
9 మాన-హాని-కంటె-మరణము-మేలు.(రా)
10 రాముని, కంటెన-న్యుండుధా-నుష్కుండు-లేఁడు.

సూరి తన గ్రంథమును "వృషశైలంబున వెలసి...కోర్కులు చాలంగా నొసఁగు కల్పసాలముఁ గొలుతున్" అని దేవతా నమస్కార రూపమగు మంగళముతో నుపక్రమించి పంకజాక్షాయ నాథాయ-వేంకటేశాయ మఙ్గళ"మ్మని శుభాంతముగా ముగించి యుండెను. ఈ పద్ధతి సర్వగ్రంథకర్తృ సాధారణము. ఈయన యింతమాత్రముతోఁ దృప్తిచెందక బాలుర శ్రేయమును మఱింతగా

నభిలషించినయాతఁ డగుటంజేసి గ్రంథమున తుట్టతుది సూత్రము సయితము "రేఫంబులు లఘ్వలఘువులునుం డక్కుంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు" అని శ్రేయః పదాంత ముగా గ్రంథమును ముగించుటలో గోచరించు విశిష్టత గమనింపఁ దగినది. అంతియగాదు. ఆయన లక్షణ రచనములోఁ దన్మయతనంది యసామాన్యమగు నుల్లాసముతోఁ బైని సూచించినరీతిని లక్షణము లతోపాటు ధర్మము,నీతి, భక్తి, వినయము,గాంభీర్యము, పెద్దలయెడ గౌరవము, పరదూషణవైముఖ్యము మున్నగువానిని గూడ వినోద ములతో లలితోక్తులలో బాలురకు బోధించి, వారిని లక్షణజ్ఞులుగ మాత్రమే గాక గుణసంపన్నులుగ సయితము తీర్చి దిద్దుటయే పరమ లక్ష్యముగా నెంచి, యందులకై తన జీవితమును ధారవోసిన ధన్య మూర్తి. బాలవ్యాకరణమున నామహనీయుని తాత్పర్యము నడు గడుగునను దూరపుఁజూపుతో నాకళించుకొని, యాతని భావములకు సన్నిహితులై, మృదువైన యాతని ప్రకృతిని గ్రహించి, యాయన నాదర్శముగ నెంచుకొనఁగల్గిన బాలకులు, సూరి యభిలాషము ననుస రించి లక్షణవేత్తలే గాక, గుణసంపన్నులు సయితము గాకమానరు. ఉదాత్తప్రకృతులకు సన్నిహితములగు పరుషములు సరళములు గాకుండు టెట్లు !

తుదినొక్కమాట-వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార ! 'మీకు మేలు గలిగెడును.' 'మీకు మేలు గలుగుతను' 'దీర్ఘాయుల రగుఁడు' 'శుభంబగును.' అని యెల్లయెడల మీశ్రేయమునే కాంక్షిం చుచు, మీ భాషాభిజ్ఞతకయి జీవితమును ధారవోసిన చిన్నయసూరి లలితోక్తి చాతురిని నామాటలతో రేఖారూపముగ నయిన మీకుఁ జూపఁగలిగితినా 'నేను ధన్యుఁడ'ను-అది గ్రహించి ఆనందింపఁ గలిగితిరా. 'మీరుధన్యులరు.'

# వ్య క్తి వి వే క ము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

అయినను, "రామస్య పాణి రసి" మొదలగు తావులందు సమాసమును చేయరాదు; వాక్యమునే ప్రయోగింపవలయును; అను విషయము కవులకే తెలియును. ప్రతి పదమును ఖండ ఖండములు చేసి ఇది ప్రకృతి ఇది ప్రత్యయము-అను విభాగము చేయుట మాత్రమే నేర్చినవైయాకరణుల కీ విషయము తెలియదు. వారికి కావ్యము నందలి రసమాధుర్యాది విషయ పరిజ్ఞానము శూన్యము. అందుచే నెచట సమాసము చేయవచ్చును? ఎచట చేయరాదు? అను విషయమై వైయాకరణు లుపేక్ష వహించిరి. కలలో నైనను వారు సాహిత్యామృత రసాస్వాదము వలనఁ గలుగు చమత్కారము ననుభవింప లేదు. ఈశబ్ద మీధాతువు నండి యీ ప్రత్యయమును జేర్చుటచేఁ బుట్టినదని ప్రతిశబ్దమునకును వ్యుత్పత్తిని చెప్పుదురు. రసశూన్యమైన యీ వ్యుత్పత్తిజ్ఞాన మున్నంత మాత్రముననే వారు మేము వైయాకరణులమని విఱ్ఱవీగుచుందురు - వివిధములగు శబ్దములను సృష్టింపఁగలరు. అర్థములలోఁ గల చమత్కారమును మాత్రము గుర్తింపలేరు. వ్యాకరణ లక్షణమున్నఁ జాలును. రసాభివ్యక్తికి ప్రతిబంధకమైనను సరియే పునరుక్తాది దోషములున్నను సరియే, వేనిని విచారింపకయే వారు శబ్దములను ప్రయోగింతురు. కవులన్ననో రసాస్వాదమున కనుగుణమైన శబ్దములను ప్రయోగించుటయందే శ్రద్ధను వహింతురు. అందుచే నిచట సమాసమును చేయవచ్చు నిచటఁ జేయరాదను పరిశీలనను చేయుట కర్హులైన వారు కవులే గాని తదితరులు గారు. ఈ విషయమింకను విస్తరముగముందు ముందు నిరూపింతుము.

శ్లో॥ "ప్రకరణ కాక్వాదిసఖో యస్యార్థోఽర్థాన్తరం ప్రకాశయతి
ఇష్టార్థ భంగ భీతేః శబ్దో న సమాస మర్హతి సః"
(సంగ్రహార్యాశ్లోకము)

తా॥ ఏశబ్దము యొక్క వాచ్యార్థము, ప్రకరణమో కాకుస్వరమో, మఱియొకటియో సహాయముగా గలదియై, వేఱొక యర్థమును ప్రకాశింపఁ జేయునో, ఆ శబ్దమును సమాసములోఁ గూర్చినచో, కవి ప్రతిపాదింప నెంచిన యర్థము సిద్ధింపదు. అందుచే నట్టి శబ్దము సమాసమున కర్హము కాదు.

అంబికా కేసరీ సమాస విచారము

ఇప్పటికి, సమాసము నెచటఁ జేయఁ గూడదు? ఎచటఁ జేయవచ్చును? అను విషయమును స్పష్టముగ నిరూపించితిమి. ప్రస్తుతము "సంరంభః కరికీటమేఘ శకలోద్దేశేన" యను శ్లోకమునందు, "అంబికా కేసరీ" అను సమాసమున "అంబికా" యను పదము కేసరి పదమునకు విశేషణముగ నుపయోగింపఁబడినది. దీనివలనఁ గలుగు నుపయోగమేమి? ఇతర సింహముల నుండి వ్యావర్తింపఁ జేయుటయా? యనఁగా నితర సింహముల కంటెవిభిన్నమైనదీ సింహ మని చెప్పుటయా? లేక, పరమేశ్వరి యనుగ్రహించి, తనపాదము నుంచుటచే నీ సింహమునకు, ప్రపంచము నంతను మించఁగల శౌర్యాతిశయము సిద్ధించినదని తెలియఁజేయుటయా?

మొదటి పక్షమును గ్రహింతుమేని, సామాన్యముగ సింహజాతికి సహజమైన యహంకారము కంటె నధికమైన యహంకారము పరమేశ్వరి యొక్క సింహమునకుఁ గల్గుటకు ప్రత్యేకమగు కారణము కన్పడదు. ఇతర సింహముల యందట్టి యహంకార ముదయించినచో నది నిర్హేతుకమనియే యెంతుము. అటులే యీ సింహ విషయమునఁ గూడ నతిలోక శౌర్యోదయము నిష్కారణమనియే మన మనుకొన

వలెను. "అంబికా" యను పదమును విశేషణముగ నుపయోగించి నందు వలన, నితర సింహములకు పరమేశ్వరీ సంబంధము లేదనియు, నీ సింహమున కట్టి సంబంధమున్నదనియు తెలియునను మాట సత్యమే కాని యాసంబం: మున్నంత మాత్రముననే, ఉపకార లేశమునైనను నామెనుండి పొందకున్నను సింహమున కట్టి యతిలోకశౌర్య ముద యించు ననుట యుక్తియుక్తము కాదు.

ఇచట మఱియొక సమాధానము నీ విధముగఁ జెప్పవచ్చును. అంబికా కేసరీ-యను పదమునందలి కేసరి శబ్దము క్రొత్త జాతికిఁ జెందిన సింహమును తెలియఁజేయును. ఈ జాతికిఁ జెందిన సింహమున కీపద్యమునందు వర్ణితమైన లోకాతిశాయి శౌర్యము సహజమే. అందు చేతనే యీసింహ మితరసింహములకు సహజమైన యహంకార లేశ మును తాను గూడ ప్రకటించుటకు సిగ్గునొందినది. ఇతర సింహము లేనుఁగులఁ జూచినను, మేఘములఁ జూచినను గర్జించును. ఆ సింహముల కంటె విలక్షణమైన పరమేశ్వరి యొక్క సింహము గూడ నటులే యేనుఁగును మేఘమును జూచి గర్జించుచో, నిఁక దాని విశేష మేము న్నది? ఇదియును మిగిలిన సింహములతో సమానమేయైనది- కాని యీ సింహము యొక్క దృష్టిలో నేనుఁ గొక చిన్న పురుగు. మేఘ మొక యల్పాల్పమైన వస్తువు. అట్టి యల్ప వస్తువులపై విజృంభిం చుట యీ సింహమునకు లజ్జాకరము. అందుచే వానిని గన్నెత్తియైనఁ జూడదు. దిగ్గజములు, ప్రళయకాల మేఘములపైఁ గూడ విజృంభిం పదు. వానిపై కురుకుటగూడ తనకు లజ్జాకరమనియే యీ సింహము భావించును. ఇట్లిచట నున్న కేసరి పదము క్రొత్తజాతికిఁ జెందిన సింహమును తెల్పునని మనము సమన్వయము చేయవచ్చును. ఇట్టి ప్రయోగములు పూర్వకవుల రచనములలో మనకుఁ గన్పడును.

ఉదాహరణమునకు-"మోహన్తు హరే ర్విహంగమో హన్తు"
హరేః=విష్ణువు యొక్క, విహంగమః=పక్షి, మోహం హన్తు=మోహ
మును చంపివేయుం గాక-అని యీ వాక్యమున కర్థము. ఇచట విహం
గమ శబ్దమునకు గరుడజాతికిం జెందిన పక్షివిశేషమే యర్థము. పక్షి
సామాన్య మర్థము కాదు. అటులే యిచటం గూడ ప్రత్యేక జాతికిం
జెందిన సింహమే కేసరి శబ్దమున కర్థమని మనము సమన్వయింపవలెను.
"మోహన్తు హరేర్విహంగమో హన్తు" అను వాక్యమున, గరుడునకు
విష్ణువు నుండి ప్రత్యేకానుగ్రహము లభించినట్లు వర్ణితము కాలేదు
విష్ణువు యొక్క సంబంధము మాత్రమే హరేః అను పదమువలన
నిరూపితమైనది. అయినను హరియను పదము విహంగమమునకు
విశేషణవాచకమే యైనది అటులే "అంబికా కేసరీ" యనునపుడును
నంబికా సంబంధము వలన కొ్రిత్తజాతికి సంబంధించిన సింహము
భాసింపవచ్చును. కావున నీ ప్రయోగ ముచితమైనదియే.

ఈ సమాధానము సరియైనది కాదు పరమేశ్వరి యొక్క యను
గ్రహము సంపర్కము లేనట్టియు, పై పద్యమునందు వర్ణితములైన
లక్షణములు కలట్టియు నొక ప్రత్యేక జాతికిం జెందిన సింహము, పర
మేశ్వరికి వాహనముగా నున్నట్లు ప్రసిద్ధియే లేదు. ఈ యర్థము కవి
చెప్పందలచినదియును గాదు.

సంరంభః కరికీటమేఘ శకలోద్దేశేన యను పద్యమునందు కవి
ప్రతిపాదింపనెంచిన యభిప్రాయమిది.

ఒక మహాకవి యెడతెగని పట్టుదలతో సరస్వతీదేవి నారా
ధించినాండు. ఆ దేవి ప్రత్యక్షమైనది. వరము లిచ్చినది. మహాకవికి సాటి
లేని ప్రతిభాపాండిత్యము లబ్బినవి. నేను సాటిలేని కవి నని యాతండను
కొనెడివాండు. ఇతరపండితుల వలెనే కవులవలెనే తాను వ్యవహ
రించుట తనకు లజ్జాకరమనుకొనినాండు. గొప్ప గొప్పకవులను పండితు

లను సైతము లెక్కచేయుటలేదు. ప్రతిభాది గుణము లనేకములు నాయందున్న వనుగర్వ మాతనికి బలిసినది. నేను సహృదయ చూడామణి ననుకొనుచుండెడివాఁడు కాని తన గర్వపుతీటనుబోఁగొట్టఁగలిగిన పండితకవి మఱియొకఁడు తనతో సమానమైనవాఁడు తనకుఁ గన్పడకుండుటచే నామహాకవి దుఃఖితుఁడై నాఁడు. ఆమహాకవి,యప్రస్తుతమే నైనను, తనతోఁ బోల్చుటకుఁ దగిన యంబికా కేసరిని పురస్కరించుకొని సాదృశ్య మూలమైన యప్రస్తుతప్రశంసాలంకారము వలన దనయభిప్రాయము నీ పద్యమున నావిష్కరించినాఁడు.

సహజముగనే విద్యాచమత్కారాతిశయము కల్గినదని చెప్పుట కవి కిష్టమైన విషయము గాదు. సరస్వతీ పాదానుగ్రహము వలననే తనకా విద్యాతిశయము కలిగినదని చెప్పుటయే యాతని కిష్టము. సరస్వతి-కవి వీరికిని, అంబిక-కేసరి, వీఁకిని బింబప్రతిబింబభావము నిరూపితమైనందు వలన నీయర్థమే సముచితము రమణీయమునై యుండును. అందుచే నితర కేసరివ్యావృత్తి మాత్ర ఫలకమే యంబికా రూపవిశేషణ మనుట పొసగదు.ప్రథమపక్షము పరాస్తమైనది.

ద్వితీయపక్షమును పరిగ్రహించుచో సమాస రచనమే యుపపన్నముగాదు. కేసరి యందొక చమత్కారాతిశయమున్న దనుట వలన దానియందుత్సాహమే వర్ణితమైనది. కేసరియందీయుత్సాహము కలుగుటకు ముఖ్యకారణము పరమేశ్వరియేఅందుచే నామెకే యిచట ప్రాధాన్యముకల్గును.సమాసముచేసినపుడీ ప్రాధాన్యమునశించిపోవును. ఈ విధముగ, విధేయ విశేషణమైన యంబికకు రావలసిన ప్రాధాన్యము నశించు చుండుటచే నిచట యంబికా కేసరీ యను సమాసము పనికిరాదు. సమాసమునందు విధ్యనువాదభావము మఱుగుపడి పోవునను విషయము నీవఱకే చెప్పితిమి.

ఆక్షేపము విశేషణము యొక్క యర్థము విశేష్యార్థమున కుత్కర్షను కలుగఁజేయునపు డావిశేషణార్థము విధేయమై ప్రధానమైన దగును-సమాసము చేసినచో విశేషణమునకుఁ గల ప్రాముఖ్యము నశించును-అందుచే నట్టి తావులందు సమాసమును చేయఁగూడదని మీరనుచున్నారు కాని కొందఱు సమాసము చేసినను విశేషణ ప్రాముఖ్యము భాసింపవలయు ననుచున్నారు-అట్లు భాసించుట వారి కిష్టము. కావున సమాసమునందు చమత్కారము కలుగదు-వాక్యము నందే చమత్కారము భాసించు ననువాదము యుక్తము కాదు.

సమాధానము-చమత్కారము భాసించినపుడును, భాసింపనపుడును నర్థములలోఁ గల వైచిత్ర్యము నింతకుఁ బూర్వమే యుదాహరణ ప్రదర్శన పూర్వకముగఁ దెల్పితిమి సమాసము చేయుచో చమత్కారాభావము సంభవించు నను విషయము ప్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు మన కొకటి యిష్టమైనపుడు అది మనకు లభింపనిచో దాని కొఱకై ప్రయత్నింతుము. సమాసము నుండి చమత్కారము భాసించుట మాకిష్టము కానే కాదు. చమత్కారమనునది వాక్యము నుండి భాసించుటయే మాకిష్టము సమాసము నుండి గూడ చమత్కారము భాసింపవలయునని కోరు వైయాకరణులకు వాక్య సమాసార్థములలోఁ గల యర్థ వైచిత్ర్యము భాసింపలేదనియే మా తాత్పర్యము

"మిథ్యైవ తస్మను చిన్తితం ద్వితయ మప్యార్యానుజోఽసౌ గురుః
మాతా తాత కళత్ర మిత్యనుచితం మన్యే విధాత్రాకృతమ్"

ఇంతకుఁ బూర్వమే వ్యాఖ్యాతమైన యీ శ్లోకమున "ఆర్యానుజః" తాతకళత్రమ్-అను సమాసములయందుఁగూడ చమత్కారము భాసించుచున్నదని వైయాకరణు లందురు. కాని యది వాస్తవము కాదు. ముత్యపు జిప్పను చూచి వెండియనుకొనుటవలె నిదియు

భ్రాన్తియే. ఇచటఁ గూడ వ్యాఖ్యాన రూపముగ నున్న వాక్యము నుండియే వారి కీచమత్కారము ప్రతీతమగుచున్నది. సమాసము నుండి మాత్రము గాదు. వాక్యార్థము వలన గోచరమగు చమత్కారమునే సమాసార్థము నందారోపించుచున్నాము. కావున వాక్యము నందే చమత్కారము భాసించును-సమాసమునందు భాసింపదు-అను విషయము యుక్తి యుక్తమేయని తేలినది.అందుచే "ఉద్యోగః కరి కీట మేఘ శకలోద్దేశేన'' యను శ్లోకము నీ విధముగ మార్చి చదువుట మంచిది.

శ్లో॥ ఉద్యోగః కరికీట మేఘశకలోద్దేశేన సింహస్యయః
సర్వస్యైవ సజాతి మాత్ర నియతో హేవాక లేశః కిల
ఇత్యాశాద్విరదక్షయాం బుధఘటా బంధేపి నోద్యుక్తవాన్
యోసా కుత్ర చమత్కృతే రతిశయం గాధ్యాహరిత్యాతునః.

ఈవిధముగ సవరింతుమేని మేము చూపిన మూఁడు దోషములును తొలగిపోవును మొదట-"అసంరబ్ధవాన్'' అని యున్నది. అచట నఞ్ సమాసము మంచిది గాదని వివరించితిమి. అందుచే దానిని తొలఁగించి న+ఉద్యుక్తవాన్''అని పాఠమును సంవరించితిమి-ఇపుడా దోషము పోయినది. "యోసా''-అనునపుడు యచ్ఛబ్దమున్నది తచ్ఛబ్దములేదు అట్లుండుట దోషము ఆ దోషము పోవుటకై "యః-సః'' అనుపదములను రెంటిని ప్రయోగించితిమి-అంబికా కేసరీ యను సమాసమును తొలఁగించి గార్వ్యాహరిర్యాతునః''

అని ప్రయోగించితిమి- గార్వ్యాః అను విశేషణము విడిగా నుండుటచే దానికి ప్రాముఖ్యము వచ్చినది-ఇట్లు చేసిన మూఁడు మార్పులతో నీపద్యమునందు చూపిన మూఁడు దోషములును పోయినవి. పరిస్తుత మొక యాక్షేపము చేయవచ్చును. ఈ పద్యము యొక్క నాల్గవ పాదమును.

"సోయం కుత్ర చమత్కృతే రతిశయం గాఢ్యాః హారిర్గచ్ఛతు"
అని మార్చినను యత్తచ్ఛబ్ద ప్రయోగమునకు సంబంధించిన దోషము పోవును-పూర్వమే ప్రకాంతమైన యర్థమును తచ్ఛబ్దము చెప్పుచో నపుడు యచ్ఛబ్ద ప్రయోగమక్కఱలేదు.

ఉదా॥ "తస్య ప్రయాతస్య వరూధినీనాం
పీడా మపర్యాప్తవతీవ సోఢుమ్
వసుంధరా విష్ణుపదం ద్వితీయ మధ్యారురోహేవ రజశ్ఛలేన"

అర్థము- ప్రయాతస్య=యుద్ధయాత్రకు బయలుదేరిన. తస్య=ఆ రాజు యొక్క, వరూధినీనామ్=సేనలయొక్క, పీడామ్=బరువు వలనఁ గల్గిన బాధను, సోఢుమ్=సహించుటకు అపర్యాప్తవత్ ఇవ=సమర్థురాలు కాదేమోయను నట్లు, వసుంధరా=భూమి, రజశ్ఛలేన=దుమ్మునెడు నెపముతో, ద్వితీయం=రెండవ+దగు. విష్ణుపదమ్=ఆకాశమును ఆరురోహ ఇవ=ఎక్కిన దాయన్నట్లున్నది.

వ్యాఖ్య-రాజసైన్యములు యుద్ధయాత్రకు వెడలుచుండగా, దుమ్ము ఆకాశమునకు లేచినది-ఇది ముఖ్యమగు భావము. దుమ్ము లేచుట సహజమెయైనను కవియొక హేతువు నూహించుచున్నాఁడు. సైన్యముల భారమును సహింపలేక భూమిపైకి లేచుచున్నదఁట. కారణము కాని దానిని కారణముగ నూహించుటచేనుత్ప్రేక్షాలంకారము. దుమ్మునెడు నెపముతోనని చెప్పుటచే-అపహ్నవాలంకారము-అపర్యాప్తవతీవ-రజశ్ఛలేన-అనునపు డపహ్నవాలంకృతితోఁ గూడిన యుత్ప్రేక్షాలంకారమనియే చెప్పవలయును - అపహ్నుతి లేనిచో నుత్ప్రేక్షలేదు. కావున నుత్ప్రేక్ష యపహ్నుతిని బాధించుననియు, నందుచే నుత్ప్రేక్షాపహ్నుతులకు సాంకర్యమును జెప్పఁగూడదనియు వ్యాఖ్యాతల యభిప్రాయము-ఆరురోహేవ యనునపుడును నుత్ప్రేక్షాలంకృతి యున్నది. దీనికి పై వానితో సాంకర్యమును జెప్పవచ్చును.

ప్రస్తుతమున మనకు విచార్యమిది-ఇచట "తస్య" (ఆరాజు యొక్క-) అను పదము పూర్వమే వర్ణితుడైన రాజును తెల్పుచుండుటచే,యచ్ఛబ్దము లేకున్నను దోషములేదు. అటులే "సోయంకుత్ర చమత్కృతే రతిశయం గాఢ్యాహరిగ్గచ్ఛతు"అనిమార్చినచో యచ్ఛబ్దములేనిదోష ముండదు గదా! అగుచో, "యోసౌకుత్ర చమత్కృతే రతిశయం గాఢ్యాహరిర్యాతుసః" అనియే యేల మార్చవలయును ?

పై విధముగ మార్చినచో యచ్ఛబ్దములేని దోషము పోవు నను మాట సత్యమే. కాని యర్థములోని చమత్కారాతిశయము మాయమగును- యత్తచ్ఛబ్దములు భిన్నవాక్యములయందున్నపుడే చమత్కారము స్ఫురించుననుట సహృదయుల కనుభవమైన విష యము- అందుచే దీనినిట్లు మార్చవలసివచ్చినది.

శ్లో॥ యత్రోత్కర్షోపకర్షోవా విశేష్యస్య విశేషణాత్

తదేవ వావిధేయం స్యాత్ సమాసస్తత్ర నేష్యతే- (26)

అన్యత్రత్వర్థ సంబంధమాత్రే వక్తుమభీప్సితే

కామచారః తదర్థం హిసమర్థగ్రహణం మతమ్ (27)

సతుసాపేక్షతాద్యస్య దోషజాతనివృత్తయే

ప్రత్యేః స్వతేవ వస్త్వత్వే సాహిన్యాయేన సిధ్యతి (28)

(సంగ్రహ శ్లోకములు)

తా॥ విశేషణము వలనవిశేష్యమునకుత్కర్షగాని యపకర్షగాని కలిగినను, విశేషణమే విధేయమైనపుడునుసమాసము చేయుటతగదు. వస్తు సంబంధము మాత్రమే వివక్షితమైనచో సమాసమును జేసినను మానినను దోషములేదు.-ఉత్కర్షాపకర్షలు ప్రతీయ మానములగు నపుడు సమాసమును చేయఁగూడదని తెలియఁజేయుటకే "సమర్థః పదవిధిః" అను సూత్రమునందు సమర్థపద ముపయోగింపఁబడినది. కాని, సాపేక్షత్వాదిదోష సమూహమును నివర్తింపఁ జేయుటకుఁ

గాదు. తల్లిదండ్రులకు నమస్కరింపుమని యెదుటవానికిఁ జెప్పినపు డెదుటవాని తల్లిదండ్రులకనియే భాసించును. ఇతరుల తల్లిదండ్రులకు నమస్కరింపవలయునను నర్థము రాదు. అటులే చెప్పకున్నను సమర్థములైన పదములకే సమాస మనునర్థము ప్రతీయమానముగుచునే యుండును.

శ్లో॥ కావ్య కాంచన కషాశ్మమానినా కున్తకేన నిజకావ్యలక్ష్మణి
యస్య సర్వనిరవద్యతోదితా శ్లోక ఏష స నిదర్శితో మయా.

తా॥ కావ్యమను సువర్ణమునకు తానొఱపిడి ఱాయిననుకొనిన కున్తకుఁడు వ్రాసిన గ్రంథమునం దీశ్లోకము దోషశూన్యమని ప్రస్తుతింపఁబడినది. ఆ యీ శ్లోకము నిపుడు పరిశీలించితిమి. ఈ శ్లోకము నందే యిన్ని దోషములున్న మిగిలినవానియందెన్ని దోషములున్నవో !

ఇప్పటికి విధేయా విమర్శ దోషము నిరూపితమైనది.

ప్రక్రమభేద దోషము:- ప్రక్రమభేదము కూడ ననౌచిత్యమే. ఎగుడు దిగుడుగనున్న మార్గము ప్రయాణము చేయునతనికి హాయి నీయదు. దుఃఖమునే యిచ్చును. ప్రక్రమభేదముకూడ పాఠకునకు క్లేశమును కలిగించును రసప్రతీతికి భంగమును కలుగఁజేయును.

శబ్దార్థవ్యవహారమునందంతటను. విద్వాంసులు సైతము లోక క్రమమునననుసరింపవలసినదే. రసప్రతీతికి భంగమును సహింపని లోకము, శబ్దార్థవ్యవహారమునందు, ప్రక్రమభేదము నంగీకరింపదు- ప్రారంభించినరీతియే తరువాతఁగూడ నుండవలెనని యభిలషించును. ప్రకృతిప్రత్యయాదు లనన్తముగనుండుటచే, ప్రక్రమభేదము కూడ ననేక విధములుగ నున్నది.

ప్రకృతి ప్రక్రమభేదము:-

"సతతమనభిభాషణమ్ మయా తే పరిపణితం భవతీమనానయన్త్యా
గతధృతి రవలంబితుమ్ బతాసూననలమనాలపనా దహంభవత్యాః"

అర్థము:- భవతీమ్=నిన్ను, అనాసయన్త్యా = తీసికొనిరాని మయా=నాతో, తే=నీకు, సతతమ్=ఎల్లప్పుడును, అనభిభాషణమ్=మాట్లాడకుండుట, పరిపణితమ్=ప్రతిజ్ఞ చేయఁబడినది "-నేను నిన్ను సంకేత స్థలమునకు తీసికొనిరానిచో, నీవు నాతో మాట్లాడవద్దు" అని పంతము పట్టితిని"- కాని, బత !=అయ్యో ! భవత్యాః= నీ యొక్క- అనాలపనాత్=మాటలాడకుండుటచే, గతధృతిః=ధైర్యము పోయినదాననై, అసూన్=ప్రాణములను, అవలంబితుం=ధరించుటకు, అలమ్=సమర్థురాలను కాలేకున్నాను.

ఇచట మాటలాడకుండుటయను నర్థమును తెలుపుటకు మొదట-భష్ (అనభిభాషణమ్) ధాతు వుపయోగింపఁబడినది. - రెండవ పర్యాయము లప్ ధాతువుపయోగింపఁబడినది-(అనాలపనాత్)-భష్-లప్-అను ధాతువులు రెండును మాటలాడుటయను నర్థమునే తెల్పును. అయినను-భష్ అను ప్రకృతి మొదట నుపయోగింపఁబడినది కావున రెండవ పర్యాయముకూడ దానినే యుపయోగించినచో నుచితముగ నుండెడిది.

శబ్దము కూడ భాసింపని యర్థ ప్రతీతి యుండనేయుండదు. అందుచే నొక యర్థము భాసించినపుడెల్ల శబ్దముకూడ భాసించుచునే యుండును శబ్దభేదమున నర్థభేదము వచ్చుననియు నొక మర్యాద కలదు అందుచే ప్రారంభమున నుపయుక్తమైన శబ్దము కంటె వేఱొక శబ్దముపయుక్తమైనచో నర్థమునఁగూడ భేదమున్నదేమో ! యనిపించును. అట్లనిపింపకుండుటకై యుపక్రమోపసంహారము లొకేరీతిగ నుండవలయుననుటలో నౌచిత్యమున్నదని వ్యాఖ్యాతల యభిప్రాయము.

ప్రక్రమాభేదము శబ్దౌచిత్యముగ నెన్నఁజగినది. ఈప్రక్రమాభేదము విధ్యనువాద భావములలో నొక రకమనియు మనము తెలిసి

కొనవలయును.— ప్రారంభముననున్నది యనువాదము-తుదినున్నది విధేయము నగును. ఉదా॥

శ్లో॥ తదా జాయన్తే గుణా యదా తే సహృదయైర్గృహ్యన్తే
రవికిరణానుగృహీతాని భవన్తి కమలాని కమలాని

అర్థము-పదార్థములు:- యదా=ఎప్పుడు, సహృదయైః=సహృదయులచే, గృహ్యన్తే=స్వీకరింపఁబడుచున్నవో (శ్లాఘింపఁబడుచున్నవో) తదా=అప్పుడు, తే, అవి, గుణాః=గుణములుగా (గుణవన్తములుగా) జాయన్తే= పుట్టుచున్నవి - గుణము కలవగుచున్నవని భావము. రవి కిరణానుగృహీతాని=సూర్యకిరణములచే నను(గహింపఁబడినవై (వికసింపఁజేయఁబడినవై) కమలాని=కమలములు, కమలాని భవన్తి=కమలములగుచున్నవి. (ప్రశస్తములై, లక్ష్మీపాత్రములగుచున్నవి).

మఱియొక యుదాహరణము:—

శ్లో॥ ఏవ మేవ జనస్తస్యా దదాతి కపోలోపమాయాం శశిబింబమ్
పరమార్థ విచారే పున శ్చంద్ర శ్చంద్ర ఇవ వరాకః.

అర్థము- ఏవ మేవ=ఈవిధముగనే, జనః=లోకము, తస్యాః= ఆమెయొక్క, కపోలోపమాయామ్=చెక్కిళ్ళకు పోలికగా, శశిబింబమ్=చంద్రబింబమును, దదాతి=ఇచ్చుచున్నది-ఆమె కపోలములు చంద్రబింబమువలె నుండునని లోకమనుచున్నది. పరమార్థ విచారే పునః-నిజమును విచారించుచో, వరాకః=అల్పుఁడగు, దయనీయుఁడగు) చంద్రః=చంద్రుఁడు, చంద్రఇవ=చంద్రుఁడే. ఇవపదమున కవధారణమర్థము. చంద్రుఁడు ప్రతి కృష్ణపక్షమునందును క్షీణించుచుండును కపోలములలో నా ధర్మములేదు. అందుచే కపోలములకును చంద్రునకును పోలిక కుదురదు. చంద్రుఁడే తగ్గిపోవునని భావము.

విశేషములు:- ఏవ మేవ=ఇటులే యనఁగా నజ్ఞానముతోనని

భావము. జనః—విచారాంపకర్యేః గతానుగతికముగలోకప్రసిద్ధినినమ్ము జనులని యర్థము. కళంకరహితమును, లావణ్యా సర్వస్వనిధానమునగు ముఖమధ్యముననున్న కపోలముల కంతకంటె నధికసౌందర్యముగల వస్తువు నుపమానముగ గ్రహించుటకు బదులు, శశరూప కలంకము గల్గి క్షయశీలుండైన చంద్రుని పోలికగఁదెచ్చుట యవిచారమూల మని భావము.

ఇచట మొదట శ్లోకములో రెండు కమలపదములున్నవి. అందు రెండవ కమలపదము కమల సామాన్యమునుగాక లక్ష్మీనివాస స్థానపాత్రతాద్యుత్కర్షత నొందిన కమలమునుదెల్పును. ఉత్కర్ష యిచట కవి వివక్షితము. రెండవ శ్లోకములో చంద్రునియందలి యప కర్ష కవి వివక్షితము. మొదటి కమల, చంద్రశబ్దములుద్దేశ్యములు రెండవ కమల చంద్రశబ్దములు విధేయములు—వాస్తవమున మొదటి కమల శబ్దము సామాన్య కమలమును తెల్పును. ఈ విషయమున మాత్రమీరెంటికిని భేదము పరికల్పితమైనది—ఇటులే చంద్ర శబ్దము లలోఁగూడ రెండవ చంద్రశబ్ద మపకర్షతాపాత్రమైన చంద్రుని తెల్పుటచేతను, మొదట చంద్రశబ్దము లోకప్రసిద్ధినందిన చంద్రునిఁ జెప్పుటచేతను, వాని రెంటికిఁగూడ నపకర్షతా మూలకమగు భేదము కల్పితమైనది.— అయినను, విధేయము ననువాద్యమునైన వస్తువొక టియే. ఆవస్తువును, విధ్యనువాదములలో రెంటను నొకే శబ్దముతోఁ గవి యిచట చెప్పినాఁడు—అందుచే నిది ప్రక్రమాభేదములలో నంత ర్భావమునొందు శబ్దాచిత్యమేయగును - కాకున్న నొక విషయము మాత్రమున్నది. పర్యాయ ప్రక్రమభేదము రాకుండుటకై, శశిబింబ మను తావున చంద్రబింబమని యుపయోగింపవలెను.

మఱియొక యుదాహరణము :-

ఏవ ముక్తోమంత్రి ముఖై రావణః ప్రత్యభాషత

అర్థము :-మంత్రిముఖ్యైః=మంత్రులలో ముఖ్యులైన వారిచేఁ ఏవముక్తః=ఈప్రకారముగఁ జెప్పఁబడిన, రావణః=రావణుఁడు, ప్రభాషత=తిరిగి చెప్పెను.

ఇచట ఉక్తః అనునపుడు వచ్ అనునది ధాతువు. ప్రత్యభాషత అనునపుడు భష్ ధాతువు ఈ రెంటికిని నర్థమొకటియే యైనను ప్రకృతి (ధాతువు) మాఱినది. అందుచే ప్రక్రమభేదదోషము వచ్చినది. ప్రత్యభాషత యనుటకు బదులుగ ప్రత్యవోచత యన్నచో నీదోషము పోవును.

మఱియొక యుదాహరణము.

శ్లో. నాథే నిశాయాః నియతే ర్నియోగాత్
అస్తంగతే హన్త నిశాపి యాతా,
కులాంగనానాం హి దశానురూపమ్
నాతఃపరం భద్రతరం సమస్తి.

అర్థము : నిశాయాః=రాత్రియొక్క, నాథే=భర్తయగు చంద్రుఁడు, నియతేర్నియోగాత్=దైవనియోగమువలన, అస్తంగతే=అస్తమింపఁగా, హన్త=అయ్యో, నిశాపి=రాత్రికూడ. యాతా=వెళ్లిపోయినది. హి=ఎందువలనన, కులాంగనానామ్=పతివ్రతలకు, దశానురూపమ్=భర్తయొక్క దశకనుగుణమైనది, అతఃపరం=ఇంతకంటె, భర్తతో సహగమనము చేయుటకంటె, భద్రతరం=ఎక్కువక్షేమమును కలుగఁజేయునది వేఱొకటి, నసమస్తి=లేదు. ఇచట గతా, యాతా, అనుశబ్దముల కర్థమొకటియే కాని మొదటిదానిలో గమ్ ధాతువు ప్రకృతి. రెండవదానిలో యా ధాతువు ప్రకృతి. ఇట్లు ప్రకృతిభేదమున్నది. ఇది పోవుటకై నిశాపి యాతా యనుటకుబదులు 'గతానిశాపి' అనవలయును.

ప్రశ్న :-ఇటు లోకేపదము నుపయోగించుచో శబ్దపునరుక్తి

యను దోషము రాదా ? "నైకం పదం ద్విఃప్రయోజ్యం ప్రాయేణ" సామాన్యముగ నొకేపదమును రెండుపర్యాయములు ప్రయోగింప రాదు అనునియమ మున్నదిగదా !

సమాధానము:-పునరుక్తి దోషము రాదు. ప్రక్రమాభేదము పునరుక్తియనునవి పరస్పర భిన్నవిషయములు. ఒకశబ్దమును మొదట పలికినమాదిరిగనే తిరిగి పలుకవలసిన తావున ప్రక్రమాభేదమను నదుండవలయును. అట్టి సంబంధముగాని యావశ్యకముగాని లేనపుడు రెండు తావులందును నొకేశబ్దమున్నచో పునరుక్తదోషము సంభవించును. కావున నీరెంటికిని సంబంధములేదు.

"వ్రజతః క్వ తాత వజసీతి పరిచయగతార్థమస్ఫుటమ్
ధైర్యమభినదుదితం శిశునా జననీ నిర్భర్త్సన వివృద్ధమన్యునా"

అర్థము:-జననీ నిర్భర్త్సన వివృద్ధమన్యునా=తల్లి భయపెట్టుట చేత వృద్ధినందిన కోపముగల, శిశునా=పసిపిల్లవానిచేత, తాత=ఓ తండ్రీ, క్వ=ఎచ్చటకు వజసి=వెళ్లుచున్నావు ఇతి=అని పరిచయగతార్థమ్=పరిచయముచేత తెలియఁబడిన అర్థముగల, అస్ఫుటమ్= అస్పష్టమగు, ఉదితం=మాట (రుదితం=ఏడ్పు) వ్రజతః=వెళ్లుచున్న తండ్రియొక్క, ధైర్యమ్, అభినత్=ధైర్యమును పోఁగొట్టెను.

తాత్పర్యము:-ఊరువెళ్లుటకుఁ బ్రయాణమగుచున్న తండ్రిని పసిపిల్లవాఁడు "నాన్నా ఎక్కడకు వెళ్లుచున్నావు"? అని యడిగినాఁడు. ప్రయాణమగుచున్నవారి నట్లడుగుటమంచిదికాదని తెలిసిన తల్లి, శిశువును భయపెట్టినది. శిశువునకుఁ గోపము హెచ్చినది. పసివాఁడు వెళ్ళుటయను నర్థమున తనకుఁ బరిచయమైన "వ్రజసి"యను శబ్దము నస్ఫుటమగు నక్షరములతో 'క్వ వజసి' "ఎచటకు వెళ్ళుచున్నావు" అని యడిగినాఁడు. తండ్రి హృదయమునందలి ధైర్యము సడలిపోయినది.

వ్యాఖ్య:-ఇచటనొకయాక్షేపమున్నది. ఈశ్లోకమున మొదట 'వ్రిజసి' యనుపదమున్నది. తరువాత 'వజసి' యని యున్నది-రెండు పదములును భేధించినవి. ప్రక్రమభేదదోషము రాలేదా ? యని యాక్షేపము.

సమాధానమిది: పెద్దలు వెళ్ళుటయను నర్థమునఁ బ్రయోగించుచుండఁగా శిశువు వినినశబ్దము 'వ్రిజసి' యనియే. శిశువునకాయర్థమునఁ బరిచయమైన శబ్దముకూడ 'వ్రిజసి' యనియే. పరిచయగతార్థమ్మను విశేషణము 'వ్రిజసి' శబ్దమునకే సరిపోవును. అసామర్థ్యముచే శిశువు-'వ్రిజసి' యనుటకుఁబదులు 'వజసి'యని రేఫను లోపింపఁజేసి పలికినాఁడు. కావున నస్ఫుటాక్షరమ్మను విశేషణముకూడ శిశువు వ్రిజసి యనుశబ్దమును పలుకనెంచినపుడే సరిపోవును. ఈ హేతువుల వలన శిశువు పలుకనెంచినది 'వ్రిజసి' యనియే. ఇట్లు రెండుశబ్దముల స్వరూపమును 'వ్రిజసి' యనియే యగుటచే నిచట ప్రక్రమభేదదోషములేదు. కావున నీశ్లోకము ప్రక్రమభేదదోషమునకు ప్రత్యుదాహరణమేకాని యుదాహరణముకాదు.

సర్వనామ ప్రక్రమభేదమున కుదాహరణము.

శ్లో. తే హిమాలయ మామన్త్ర్య పునః ప్రేక్ష్య చ శూలినమ్
సిద్ధం చాస్మై నివేద్యార్థమ్ తద్విసృష్టాః ఖ ముద్యయుః.

అర్థము :- తే=ఆసప్తర్షులు, హిమాలయమ్=హిమవంతుని, ఆమన్త్ర్య=విడి (సెలవుపుచ్చుకొని) పునశ్చ=తిరిగి, శూలినమ్=శివుని ప్రేక్ష్య=చూచి, అస్మై=ఈశివునకు, అర్థమ్=పనిని (పార్వతిని శివునకిమ్మనియడుగుట) సిద్ధమ్=సఫలమైనదానినిగ, నివేద్య=తెలియఁజేసి, తద్విసృష్టాః=ఆయీశ్వరుని యనుజ్ఞను పొందినవారై, (ఈశ్వరునిచే విడువఁబడినవారై ఖమ్=ఆకాశమును గుఱించి, ఉద్యయుః=ఎగిరిపోయిరి. ఆకాశములోనికి వెళ్లిరి'

(సశేషము)

శ్రీజయంతి రామయ్యపంతులుగారి

శతవార్షికజన్మదినోత్సవ

స్మారక సంచిక

సాహిత్యవిభాగము

# కృష్ణత్రోయదము

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

అంతట నొక్కనాఁడు సదనాంతర వేదికనుండి భోజనా
నంతరగోష్ఠిఁ దమ్మ్ముని కరాంబుజ మిచ్చిన పచ్చకప్పురం
బింత గ్రహించి నోట ఘలియించుచు వీచిన తమ్మితావి నే
కాంతము చూచి తిమ్మరుసు కమ్రవచఃక్రమ రంజితాస్యుఁడై.

కలుకుం జిత్తముతోడ నిట్లు పలికెన్: "గోవిందరాజా? మహో
జ్జ్వల - ణ నేలుబడి దైవం బిచ్చునంతన్ నిరా
కులమై నిమ్మకు నీరువోసినటు సాఁగున్; గాని, లోలోన నదో
తెలియంగాక యతృప్తియొండొకఁడు బాధించున్ నిదానించినన్

పరధర్మంబుల యొత్తిడిం గడపి కాపాడన్ స్వధర్మైకత
త్పరమౌ నీసకల ప్రజావళి సమర్థంబై యిహాముత్ర భో
గ రసాభోగము లందుకోఁ గలుగు; నీ కర్ణాటరాజ్యంబుఁ ద
త్పరమోదార నిదానసూత్రమునఁ గాదా! నిల్చి రమ్మాధవున్.

ఎఱుఁగనిఁ జేసి తానోరున కేర్పడియుండిన ధర్మమందు మా
ధురి కలదంచు దానిదెస దూఁకిన రెంటికిఁగాని చేటునం
బారయదె! యీ ప్రజాతతి; ప్రభుత్వము దీనిని గుర్తెఱింగి, తాం
దరవడకుండ స్వ స్వ విహితస్థిరధర్మము నోమఁగావలెన్.

తలఁప ననంతముల్ భువనధర్మము; లొక్కఁడువోలెఁ దోఁచి, పం
కిలమునఁ ద్రోచు తీరు పరికింతుము; లౌకిక ధర్మ సంతతిన్
గలయిక నేతకున్ నడుము గట్టుట చూడఁగఁ బాంచభౌతిక
ప్రళయమె కాని యభ్యుదయపాత్రము కాదది లోకయాత్రకున్.

భిన్నరుచిక మగుచుఁ బెరుగు సాధారణ
ప్రజకు విహిత ధర్మపాలనమున

మనులు తిరముగాక చెదరుట సహజ; మ
య్యాదన రాచటికపుఁ బదను వలయు.

మతిగురులై మహాభ్యుదయ మంగళసారథులై జగత్ప్రజా
ప్రతినిధులౌ మహర్షుల కృపావనధుల్ మనధర్మశాస్త్ర సం
తతు; లవి చూపు శాసనపథంబున నెల్లరు సాఁగఁబోమి నే
తృతఁ గదలించు సత్ప్రభుతయే కద! తత్ప్రజకుం శుభం బిడున్.

ప్రభుత ధర్మము నెడలఁ బ్రవర్తకమ్ము;
మఱి - నివర్తక మగు నధర్మమ్ము పట్ల;
నా యెడలఁ జండమౌ నెండ కాయుఁగాక;
చూడఁగా నది పరిణామసుందరమ్ము.

ఇంతకు నావచించునది యేమనఁగా, మనతేరి కిట్టి సి
ద్ధాంతము లెవ్వియుం దలకుఁ దట్టవు; చెప్పినఁ గిట్టు; వింక రా
ష్ట్రాంతర లబ్ధకీర్తి విభవాధికమౌ మనయేల్బడిం బ్రజా
సంతతి కీయుపేక్ష యపచారముగా కుపకార మెట్లగుం !

తొంటితోప్రివకు సంస్కారధూర్తమైన
క్రోవ కల్పింపఁ గూడని కోర్కి యేదొ
వీర నరసింహపతికి నావిర్భవించు
తీరు కనిపించు; నిది మేలితెలుఁగు కాదు.

అనుచున్ సర్వశిరఃప్రధానుఁడటు తాన్నై యగ్రజుం డిట్లు చూ
పిన యాంతర్య మెఱింగి సోదరుఁడు గోవిందుండు వందారు వ
ల్లన నీరీతి వినీతధీర మధురాలాపానురూపస్వరం
బున నారంభ మొనర్చె లోఁగల తలంపుందాపు లూపాడఁగన్.

"అన్న! సాగర గంభీరమౌ నెడందఁ
దొనఁకివచ్చిన రత్నముల్ దొరకె నేఁడు

## కృష్ణోదయము

ధన్యమగు నీ సహోదరత్వమ్ము చనవు
కలిమి నీయెడఁ జెప్పుకోవలయు నొకఁడు.

అభిజనజ్ఞాన శౌచ శౌర్యానురాగ
మహితమై యొప్పు మీ మహామాత్యపదము
ననుపదము మెచ్చు రాష్ట్ర ప్రజాళి హృదయ
మధిపు నెడల నవిశ్వాస విధురమయ్యె.

పుయిలోటంగొని నేఁటిదాఁక నిటు మీ ముందెప్పుడుం జెప్ప నా
రయనైతిన్; మఱి యీ ప్రభుత్వమునఁ బూర్వంబున్న సౌభాగ్య మీ
యయిదాఱేఁడులఁ దొట్టి డిందువడుటీ రందందుఁ గన్పట్టుః నిం
త యధార్థంబును జెప్పుచోఁ బ్రజ లనుత్సాహు ల్ప్రభుత్వంబునన్.

సారవంతమైన సచివత్వము విభుత్వ
వృక్షమునకు స్కంధరక్ష యగును;
గాని, తల్లివేరుగా నన్న యేలిక
తీరుచెడుట చేటుఁ దెచ్చిపోదె!

మీగురుతా మహత్త్వమున మేల్కొనుచున్న సహోదరుండనై
యేగతి ముచ్చటించుటకునేని భయంబగుదెంచు; నాగతా
నాగత రాజ్యతంత్ర విచయజ్ఞత పెట్టనికోటయైన ప్ర
జ్ఞాగరిమంబు సన్నిధి కొసంగెద నొక్క వచఃపరాణువున్.

"నార కర్ణాట రాజ్య కేదార వీధి
మీరు నాఁటిన ధర్మపు నారు పెరిగి
నలువురును బైరు లందుకోవలయు ననఁగఁ
దొలకరింపఁగవలెఁ గృష్ణోదయంబు."

"ఆంధ్రపురాణము"
శ్రీకృష్ణదేవరాయ పర్వమునుండి.

# పాత్రచిత్రణము—పెద్దన తిమ్మనలు

డాక్టర్ కె.వి.ఆర్. నరసింహం, ఎం.ఏ.పి.హెచ్.డి.

మహాకవి ప్రతిభకుఁగల ముఖ్యలక్షణములలో నొకటి పాత్ర నిర్మాణకౌశలము. సజీవపాత్రనిర్మాణకౌశలము సామాన్యకవులందఱకు నందుబాటులోనుండునదికాదు. పురాణకవులకును ప్రబంధకవులకును గల ముఖ్యభేద మీ పాత్రనిర్మాణనైపుణియందే కానవగును. పురాణకవులు సాధారణముగాఁ బాత్రలయింగితాకారచేష్టాదులను వ్యక్తముసేయుటలోఁ దటస్థభావమును వహింతురు. కథాకథనము-ధర్మస్థాపనము మొదలగు విషయములే వారి కాదరణీయములై యుండును. ఈ రెంటికిని సామరస్యమును గుదిర్చిన తిక్కన వంటి మహాకవులు కొలఁదిమందిమాత్రమే కలరు. అట్టియెడ నమ్మహాకవులును బ్రబంధధోరణి ననుసరించిరనియే చెప్పనొప్పును.

సజీవపాత్రనిర్మాణ మనఁగానేమి? పాత్రలు కొఱడుపాటి కొయ్యబొమ్మలవలె నుండక చైతన్యసహితములై యుండవలయును. సచేతనత్వమునకు ముఖ్యలక్షణము వైవిధ్యము. అనఁగా నే రెండు పాత్రలు నొకతీరున నుండకుండుట. ప్రపంచమున మనుజునిబోలిన మనుజు లున్నను నన్నిలక్షణములయందును వారికి నేకీభావముండుట దుర్లభము. ఎద్దియైనను వైలక్షణ్యము వారియందుఁగోచరించియే తీరును. బాహ్యజగత్తు కావ్యజగత్తునందుఁ బ్రతిబింబించునుగాన విశ్వనిర్మాతయగు బ్రహ్మకుఁ గావ్యనిర్మాతయగుకవి ప్రతిద్వంద్వియగుచున్నాఁడు. కావున బ్రహ్మసృష్టియందుఁ గన్పట్టు వైవిధ్యము కవి బ్రహ్మ సృష్టియందును గన్పట్టవలయును. 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః' అను నాలంకారికవచన మీవిషయమునే బోధించుచున్నది. ఈవైవిధ్యమేలేకున్నచోఁ బాత్రలు నిశ్చేతనములై పోతఁ

బోసిన బొమ్మలపగిది నుండును. అట్టిపాత్రనిర్మాణము మహాకవి కసుఁ దారాఁణము కాదు

సజీవపాత్రనిర్మాణ కౌశలము ప్రబంధకవులందఱకును గలదని చెప్పఁజాలము. గతానుగతికముగా రచించినకవు లనేకులుగలరు. కాని సజీవపాత్రనిర్మాణము నద్వితీయముగా నిర్వహించిన మహాకవులును గలరు. అట్టివారిలో నొక్కఁ డల్లసాని పెద్దనార్యుఁడు.

'పెద్దనార్యుని మనుచరిత్రము శాంతశృంగారములు సంగమించిన తీర్థమని చెప్పవచ్చును. సహజ శృంగారప్రియమైన చిత్తము శాంతోన్ముఖమైనపుడు రచింపఁబడినగ్రంథ మిదియని యిందలి ప్రతిపద్యమును జెప్పకచెప్పుచున్నది. మహాకవి పోతన భక్తిశృంగారములను జోడించెను. పెద్దనార్యుఁడు శాంతశృంగారములను నేర్పుతోఁ గలిపెను. ఈగ్రంథమున మొదటి మూఁడాశ్వాసములయందును నద్వితీయ శిల్పసామర్థ్యము చూపఁబడినది. అయ్యెడఁ దాండవించు రెండు పాత్రములును (ప్రవరుఁడు వరూథిని) బెద్దనగారిపాత్రనిర్మాణసిద్ధికి సంభాషణ చాతుర్యమునకు బుద్ధివిన్యాసమునకు విరోధిరసముల సంఘర్షణకు లక్ష్యభూతములుగా నున్నవి. అట్టిశక్తిగో సృజించినపాత్రలు కావుననే ప్రవరుఁడును వరూథినియు నేఁటికిని సజీవులై యున్నట్లు భావుకుల మనోనయనములకు గోచరించుచున్నారు. జితేంద్రియత్వమునకు శుకమహర్షిని బేర్కొనుట మాని యాంధ్రులు మనుచరిత్ర పుట్టినదాదిగాఁ బ్రవరునిఁజెప్పుకొనుచున్నారు. అట్లే వలపుఁబ్రయోగమునకు రంభను మఱచి వరూధినిని బేర్కొనుచున్నారు. ఈపాత్రముల సజీవతకును నాంధ్రుల మనఃప్రపంచమున నవి కల్పించిన పరివర్తనమునకును నిదియే తారాఁణము. తిక్కన సృజించిన భారతపురుషులకుఁబిమ్మట నాంధ్రులతో నింతసన్నిహితత్వముగల పాత్రలను సృజించినమహాకవి లేనేలేఁడు. ఈనిర్మాణమున కావశ్యకమైన

తత్తత్పాత్రిల యింగితపరిజ్ఞానమును దదుచితమైన సంవాదసరణియు నాటకీయమైన తటస్థపద్ధతియుఁ గృతహస్తుఁడైన పెద్దనకుఁ జక్కఁగా వలవడినవి. ఈ రెండు పాత్రిలును గేవల విరుద్ధములైన రెండురసముల నాశ్రియించియున్నవి. కవి యీ రెంటియందును నేదెసకును మొగ్గక యిరువంకలను సమదృష్టినే పెట్టి యీ రెండు రసములను సమానగాంభీర్యముగల ప్రివాహములుగనే నడిపెను. మనుచరిత్రిమును జదివిన వారెవ్వరును వేశ్యయనికాని శ్రోత్రియునకు ప్రితభంగము చేయనెంచిన వలపుకత్తె యని కాని వరూథినిని నిరసింపరు. మీదుమిక్కిలి యామె యనురాగము విఫలమైనదని చింతించెదరు. అట్లయ్యు నామెవలలోఁ బడక ధీరుఁడై తప్పించుకొనిన ప్రివరుని దలంచి భక్తిపూర్వక నమస్కారమును గావింతురు. ఇది కవిలోని సమభావమునకు ఫలము. ఉత్తరార్ధమునఁ బద్యరచనాసౌందర్యము కథాకథన చాతుర్యము మున్నగు నితరగుణములు కలవేకాని పాత్రిచిత్రిణ మని చెప్పఁదగినది లేదు. ఆకథాభాగమును నట్టిది కోరదు.

అద్వితీయ సౌందర్యమునకును నమేయ వైరాగ్యమునకును నాటపట్టైనవాఁడు ప్రివరుఁడు. వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుఁడనియు ననారతాధ్యాపన తత్పరుఁడనియు నాతఁడు కవిచే వర్ణింపఁబడినాఁడు.

'వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయుజారకామినులకుఁ
బూచిన సంపెంగపొలుపు మధుకరాంగనకుఁబోలె
భోగబాహ్యమయ్యె,'

అని కవియే మెలమెల్లగ వచించి మున్ముందు జరుగనున్న కథాప్రిణాళికకు బీజావాపము గావించినాఁడు. ప్రాతఃకాలముననే వామన

స్తుతిపరత్వమున లేచి వరణాతరంగిణియం దఘమర్షణ మంత్రములా పఠించుచు మున్కలిడుట-సంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని సమిత్కుశ కుసుమ ఫలాదులను గొని బ్రహ్మచారులు వెంటనంటి వచ్చుచుండఁగా గృహంబునకు మరలుట, - నిత్యాగ్నిహోత్రమును నిరతాన్న ప్రదానమును గావించుట-ప్రవరునకు దినకృత్యములు. ప్రవరుఁ డప్రతిగ్రహీత. కులశీల శమదమాదులయందుఁ బతియడుగు జాడలనే నడచునది యాతని యిల్లాలు. అర్ధరాత్రంబున నతిథు లేతెంచినను వలయు భోజ్యము లామె యవ్వారిగాఁగ వడ్డించునఁట. ఎల్లవేళలయందును నతిథి సేవాతత్పరుఁడై యున్న ప్రవరునింటి కొక నాఁ డొకసిద్ధుఁడు వచ్చి తీర్థయాత్రాచరణము నందాసక్తుఁడై యున్న ప్రవరుని పాదములకు సిద్ధౌషధము నొకదానినిం బూసి యథేచ్ఛఁ జనినాఁడు. ఆయౌషధప్రభావమునఁ బ్రవరుఁడు హిమవన్నగమున కేగినాఁడు. చూడవలసిన తావులన్నియుఁ జూచి యింటి కేగ నుద్దేశిం పఁగా సిద్ధుఁడొసఁగిన పాదలేపనము కరఁగిపోయినది. విచారపరీత చేతస్కుఁడైన ప్రవరుఁడు విధివశమున వరూథినియను స్వర్వేశ్య వసిం చియున్న స్థలమున కేగెను. ఇట వరూథినీ వర్ణన మత్యద్భుతముగాఁ గావింపఁబడినది. అద్వితీయరూపలావణ్యయగు నయ్యచ్చరలేమ మకరాంక శశాంక మనోజ్ఞమూర్తియగు ప్రవరుని నేకాంతమునఁ జూచి నంతనే కామించినది. మహీసురాన్వయంబెక్కడ నీతనూవిభవ మెక్కడ నను నాశ్చర్య మామెకుఁ గలిగినది. ననుసిగ్గుదొంతరలు క్రమ్ము కొనిరాఁగా నొక్క పోకనునుబోదియఁ జేరి విలోకన ప్రభావీచికలఁ దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పినది.

ప్రవరుఁడు వరూథినిని సమీపించినాఁడు. మదనవేదనకు లోనయి తత్తరపాటుతోడ తనతోవ కడ్డముగానిలిచిన యయ్యంగ నామణిని జూచి విభ్రాంతుఁడై యాతఁ డిట్లు పల్కినాఁడు.

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ ! యొంటిఁ జరించెదోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిన్
గ్రొవ్వన నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరు వెద్ది ? శుభంబు నీ కగున్"

ఇది ప్రవరుని తొలిపలుకు. ఒంటిగా నివ్వనభూమిఁ జరించు నీ వెవ్వతె వని యాతని ప్రశ్న. నేను బ్రాహ్మణుఁడను. గ్రొవ్వి యున్న గాగ్రమునకుఁ జనుదెంచి త్రోవ తప్పితిని. తెరు వెఱింగింపుమని ప్రార్థన. శుభంబు నీ కగు నని యాశీర్వాదము.

ఈ పద్యమున శుద్ధ శ్రోత్రియునకుఁగల నిరాడంబర చిత్త వృత్తియు నిష్కల్మషమైన వాగ్ధోరణియు నతి మనోజ్ఞముగాఁ జిత్రింపఁబడినది. గ్రొవ్వి యున్నగాగ్రమున కేతెంచితి నని తన్నుఁదాను నిందించుకొనుటయు శుద్ధ శ్రోత్రియ లక్షణమే. నిష్కపటమైన యీ ధోరణి నాలించి నిలింపవేశ్యయు నొక్కింత నవ్వి నర్మగర్భముగా నిట్లు ప్రత్యుత్తర మిచ్చినది.

"ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా గింతియకాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ కింత భయంబు లే కడుగ నెల్లిదమైతిమి మాట లేటికిన్"

శుద్ధ సత్త్వమూర్తియగు ప్రవరున కీసమాధానమునందలియంతరార్థము గోచరింపలేదు. నీ వెవ్వతెవన్న ప్రశ్నకు సమాధానముగా వరూధిని యీ క్రిందిప్రత్యుత్తర మిచ్చినది.

"చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమినచెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్టజంత్ర గాత్రముల రాల్గరఁగించు
విమల గాంధర్వంబు విద్యమాకు

ననవిల్తు శాస్త్రంబు మినుకు లావర్తించు
   పని వెన్నతోడఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
   సవనతంత్రంబు లుంకువలు మాకుఁ

గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర !"

ఈ యుపన్యాస మంతయుఁ దెరువెఱుంగక పరితపించుచున్న ప్రవరునకు వ్యర్థప్రలాపమువలెఁ దోఁచినది. కుందనమువంటి మేను మధ్యందినమార్తాండాహతి గందిపోయెనే యని వాపోవుచు నస్మద్గృహము పావనముచేసి బడలిక వాయఁగాఁ జను మనిన వరూథినికి భక్తియ చాలును నగర మార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్మని ప్రవరుఁడు సమాధాన మిచ్చినాఁడు.

"భూసుర కైతవ కుసుమశరాసన" యని వరూథిని చేసిన సంబోధనమునందలి భావము ప్రవరునకు రుచింపలేదు. నీవు చేసిన సపర్యలు మాకు వచ్చె నిందుండఁగరాదు పోవలయు నూరికి నిప్పుడేను రాకుండ నోకందు వచ్చి మఱియొందునె భక్తియ చాలు"నని మాయలేని మాటలుపల్కి కరుణింపు నాపయినని దీనుఁడై ప్రార్థించినాఁడు.

"ఏ నిఁక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము మీ మహత్త్వముల్
మానిని! దివ్యముల్ మదిఁదలంచిన నెందును మీ కసాధ్యముల్
గానము గాన తల్లి! ప్రజల న్నను గూర్పుమటన్న లేఁత న
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్"

ఈ పద్యమునందుఁ బ్రవరుని యమాయకత్వమును నాతుర తయుఁ బ్రస్ఫుటములై యున్నవి. "తల్లీ!" యన్న సంబుద్ధి వరూధినికి వజ్రపుఁబోటువలె నుండియుండును. ఈ యమాయకునితో నర్మోక్తు లాడుటవలనఁ బ్రయోజనములేదని తెలిసికొని

"నిక్కము దాఁపనేల ధరణీసురనందన ! యింక నీపయిం జిక్కె మనంబు నాకు"

అని స్పష్టముగాఁ దనకోర్కె నెఱింగించినది.

"  ..వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కామింప మది విచారము వలదే"

అని యా బ్రాహ్మణుఁ డామె కోర్కెను నిరసించి పల్కె నాఁడు. ఇఁక యుక్తులపై యుక్తులు ప్రబలినవి.

"...కుంభగత ప్రదీప కళికా శ్రీ దోఁప నెందెందుఁ బోకెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ "మానందో బ్రహ్మ" యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా !" యని యామె కుతర్కము గావింపఁగాఁ బ్రవరుఁడు సిగ్గును వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు నొక చిఱునవ్వు నవ్వినాఁడఁట. ఈ యొక్క మాటలోఁ బ్రవరుని యంతర్మూర్తిని బ్రత్యక్షము గావించి నాఁడు పెద్దన. "ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే" యని తిరస్కరించి 'యిఁక నేలా తర్కముల్' అని యుదా సీనుఁడైనాఁడు ప్రవరుఁడు. "చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాల పైఁ దేనియల్" అని తుదిమాట నిష్కర్షగా జెప్పినాఁడు. 'నాకర ణుల్ దర్భలు నగ్నులుర్ బ్రియములైన ట్లన్యముల్ గావు'అని తనమో హేచ్ఛావిముఖత్వమును బ్రవరుఁడు ప్రస్ఫుటము గావించినాఁడు.

ఇట్లు స్థిరనిశ్చయుఁడై యున్న బ్రాహ్మణునిపైఁ దనశృంగారా

స్త్రము లేమియుఁ బనిచేయలేదని వరూధిని గ్రహించినది. ఇంక నొక్క యస్త్రము మాత్రమే మిగిలియున్నది. "అనునయాలాపాతిదీనాస్యయై వెతలంబెట్టకు మింక నన్ననుచు నీ పీబంధ మూడఁ" గాఁగిలించినది. కాని యా యస్త్రము కూడ నిట నిష్ప్రయోజనమే యైనది. "హా శ్రీహరీ! యని బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయంబంటిపొమ్మంచుం" ద్రోచినాఁడు. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అని కవి యొక నిట్టూర్పు విడిచినాఁడు. అట్లు త్రోపువడి వరూధిని ఘనలజ్జాపరవశయైనది. వేదన నెపంబిడి కలస్వనంబున నేడ్చినది. పరాశరాదుల కామకేళీపరతంత్రత్వము నుదాహరించి వారికంటె నీమహత్త్వంబు ఘనమే యని వాదించినది. కాని యేమి ప్రయోజనము? ప్రవరుఁడిట్టి మాటలకుఁ బ్రత్యుత్తరము లిచ్చువాఁడుకాఁడు. మీఁదుమిక్కిలి యవ్వనజగంధి మేని జవ్వాదిపస గదంబించు నొడలు కడిగికొని వార్చి ప్రవరుఁడు పరిశుద్ధుఁడైనాఁడఁట. ఇట్టిదికదా నిగ్రహము!

మను చరిత్రమందలి పాత్రనిర్మాణకౌశల మంతయు నీ రెండు పాత్రల నాశ్రయించియేయున్నది. తృతీయాశ్వాసమునందలి వరూధిని చరిత్రము కడుంగడు విషాదపూరితము. ఆమె జవ్వన మడవిఁ గాచిన వెన్నెలయైనది. తన యమర్త్యభావమే తనకు రోఁతగాఁ దోఁచినది. హితుఁ డవజ్ఞ చేసినంతనే కాయము పాయఁగల మర్త్యభామిను లెంతతపముచేసి జనియించిరో యని యామె నిట్టూర్పులు నిగిడ్చినది. ఈ వలపు పిచ్చిలో మాయాప్రవరుని మాయలకు లోనైనది. స్వారోచిషమనుసంభవమున కాది కారణమైన యయ్యచ్చర పేరైనను దృతీయాశ్వాసానంతరము స్మరింపఁబడకుండుట మఱియు శోచనీయమైన విషయము. ఇంతకును వరూధిని వృత్తాంతము విషాదరేఖా శబలితము.

పెద్దన తన గ్రంథము నందంతటను బురుషుని యౌన్నత్యము నే చూపి యాఁడుదాని ననదగా నిరూపించి యామె పురుషునిఁ బ్రేమ భిక్ష వేఁడుచున్నట్లు చిత్రించినాఁడు. ఈ విషయమున నీతనికిఁ బ్రతి ద్వంద్వియై నిలిచినాఁడు ముక్కుతిమ్మన మహాకవి ఈతఁడు సృజించిన పాత్ర ఖండితనాయిక యగు సత్యభామ. ప్రవరుఁడు వలపుల కాణాచియగు వరూధినినిఁ బొమ్మంచు తిరస్కరించినాఁడు. సత్యభామ "లతాంతాయుధుఁ గన్నతండ్రి శిరమును వామపాదమునఁ దొలఁగఁ ద్రోచినది. మనుచరిత్రమునఁ బురుషునకు జయము సంభవించినది. ఇట స్త్రీలోకము విజయదుందుభి మ్రోగించినది. మహాకవి తిమ్మనార్యుఁడు మానక్రోధ వివశయైన సత్యభామనొక యాట బొమ్మవోలె నాడించినాఁడు

మనము తొలుదొల్త సత్యభామను నగరి పొంత నొకశృంగార వనములో దర్శింతుము. దిద్దితీర్చిన పూఁదేనియ సేఁటికాలువదరినిఁ జెంగల్వ పుష్పాళ్లు నించిన చంద్రోపలవేదిపై నాయమ తన చెలిమి కత్తియతో సరసగోష్ఠిం దేలుచు వనజాతాయతనేత్రుఁడైన శౌరి గుణములను వర్ణించుచుఁ గాలయాపనము చేయుచుండును. కాలయాపనము చేయుచున్నదే కాని సత్యభామ బుద్ధిమాత్రము సంశయగ్రస్తమైయున్నది. "అళికులారావములు"గాని, "కిసలయాకుల కోకిల కాకు కాకలీ కలకల నాదములు"గాని యాయమ మనంబున కింపు నింపలేదు. కమ్మని తమ్మి కొలంకులనుండి వీతెంచు తెమ్మెరలును నాహ్లాద జనకములు కాకుండెను. కారణమేమి ? అంతలోనే దక్షిణాంస చూచుక నయన ప్రకంపము సంభవించినది. అమ్మానవతి హృదయమును నీ యపశకునములచే సంశయాకులితమైనది. కాని తనకుఁ గలుగఁబోవు మహాపద యెట్టిదై యుండునో యామె నిర్ణయింపలేకుండెను ప్రాణనాథుఁ డొండొకచపలాక్షినిఁ గూడి తన్ను

నొల్లని చెయిదము లేమిసైనఁ జేసియుండునేమోయని యామెకు సంశయ ముదయించినది. ఇంతకంటె మహాపద యయ్యెందువదన కుండదు కదా !

ఇంతలోనే నెచ్చెలి వచ్చినది. కనుఁగవ నెఱసంజ వోడమఁగాఁ బారిజాతప్రసూనవృత్తాంత మంతయుఁ జెప్పినది. అమరేశ్వరయో గ్యము నతిసౌకర్యము ననితర సులభమునైన యా దివ్యకుసుమమును వెన్నుఁడు రుక్మిణి కొసఁగినాఁడనియు నామె యా కుసుమమును గొప్పులోఁ దాల్చుటయే తడవుగ సానఁబట్టిన మకరాంకుశస్త్రముగతిఁ దేజరిల్లినదనియు నా కుసుమధారణము వలన నామెకు మహామహిమ వచ్చుటచే గద్దియమీఁద నెక్కి ముల్లోకములుఁ దానె యేలుగతి నున్న దనియుఁ దోడి కామినీలోకము మచ్చరంబును మదిలోనఁ దొఱంగి యామెను భయభక్తులతో భజించుచున్నారనియు నా వాక్యముల సారాంశము. ఇంతయే కాక సత్యభామకుఁ గోప మతిశ యించుటకై యీ క్రింది రీతి నా చెలికత్తియ వచించినది.

'ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగా బలికెన్ బతిఁగూర్చుదాన నా
యంతటి వారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్
వంతునవచ్చు సత్యగరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ !'

'మానినీ' యను సంబోధన సాభిప్రాయము.

'ఆ రణభోజను మతకము
లా రుక్మిణినటన లాముురాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబురాదు? వారిజనేత్రా!'

అగ్నికి వాయువు తోడైనది. సత్యభామ కిది సైరింపరాని యపచారము. మొదల నద్దివ్య కుసుమంబు వెన్నుఁడు రుక్మిణి కిచ్చు

టయే యోర్వరానిపని. అంతఁగాఁబోక తమ్ముఁగూర్చి కలహాభోజనుఁ డాడు మాటలనుగూడ శౌరి సైరించుటయా? అదియు సపత్నిముం దఱ. మాన మప్రతిహత వేగమున విజృంభించినది. ఈర్ష్యాసూయ లాక్రోధాగ్నికి వీవనలు వీచినవి. ఇంకేమున్నది? ఇచ్చటి సత్యభామా స్వరూపమును గవి యెంత మనోహరముగాఁజిత్రించినాఁడో చూడుఁడు:

'అన విని వ్రేటువడ్డ యురగాంగనకైవడి నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణ హుతాశన కీలయనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు తనచెక్కులఁ గుంకుమ పత్రభంగ సం
జనిత నవీన కాంతి వెదఁజల్లఁగ గద్గద ఖిన్నకంఠియై'

అనూహ్యమగు నవమానము దుర్భరముగు నావేదనము సత్య భామ మనస్సును మొదలంటఁ గలంచివైచినవి. కాని కౌతుకము మాత్రము పనిచేయుచునే యున్నది తన్నుఁగూర్చి రుక్మిణీ సతి యేమైన ననెదేమో యన్న సందియ మామెను మిక్కుటముగ బాధించుచున్నది. 'రుక్మిణీసతి' యని సత్యభామనోటఁ బలికించిన కవి ప్రతిభ యనన్య సామాన్యము కదా! చెలికత్తె చెప్పిన వాక్యము నాలించినంతనే సత్యభామకుఁ బట్టరాని యాశ్చర్యము కల్గినది. నిజముగా నిట్టిది జరిగెనా యను సందేహము క్షణమాత్ర మామె మనస్సునఁ బొడసూపినది. అప్పటి యామె మనః పరివర్తనమును ముక్కుతిమ్మనార్యుఁడీ క్రిందివిధమున వ్యక్తము చేసియున్నాఁడు:

'ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?
యామాట ల్చెవియొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డే మేనూడెను రుక్మిణీసతియు? నీ వింకేటికిం దాఁచెదే!
నీ మోమాటలుమాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే'

'అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చుకంబొదవ నూడిదయిచ్చిన నిచ్చెఁగాక తా

సతేఁడు ప్రియంబుగల్గునెడ కర్పణ చేసినఁ జేసెఁ గాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగనేల యచ్చటన్'

ఈ పద్యములలోని ప్రతిపదము నన్వర్థమనియే చెప్పవలెను. 'ఒక' యనుపదము వలన సత్యభామ కవ్విరిపైఁగల యలక్ష్యభావము సూచింపఁబడినది. రుక్మిణియను పేరు చెప్పక ప్రియము గల్గునెడకని చెప్పుటచే సత్యభామకు సవతియగు రుక్మిణిపైఁగల యసూయ సూచింపఁబడినది. అప్పట్టున రుక్మిణి పేరుచ్చరించుటకూడ సత్యభామ కనిష్టమగు కార్యమే. ఇది నారీజన సహజమగు గుణము. మఱియు సత్యభామవంటి మానవతికి నెంతయుఁ దగియున్నది. నన్ననుటకు బదులు మమ్మని చెప్పియుండుటచే స్వాభిమానాతిశయము సూచింపఁబడినది. తరువాతఁ గవి సత్యభామకుఁగల కోపకారణ మంతయు నీ క్రిందిపద్యములలో వ్యక్తము చేసియున్నాఁడు:

'పలుదెఱగు ముళ్ళమాటలఁ
గలహామె కళ్యాణమని జగంబులవెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్'

'ముని యేమిసేయు రుక్మిణి
గొనఁ గారణమేమి ధూర్తగోపాలుఁడు సే
సిన చెయిద మేమి చెప్పుదు
మన మెరియదె ప్రాణమైన మగఁడిట్లయినన్'

కలహభోజనుఁడైన నారదుఁ డట్టి మాటలాడుటలో సత్యభామ కాశ్చర్యకరమగు నంశ మేమియును లేదు. కాని యాతడట్టిమాటలను సపత్నియెదుట నాడుచుండఁగా వల్లభుఁ డూరకుండుటయా? మగఁడే యిట్లైన నింక నాసతిని మన్నించువారెవరు? ఇంతకును మగవారందఱు నట్టివారే యని యామెసిద్ధాంతము. ధూర్తగోపాలుఁ డనుటచేఁ

బసుల మేపరికి నుత్తమ గుణములుండునా యని సత్యభామ యభి ప్రాయము. ఆమె తనభర్తను బ్రాణతుల్యముగఁ బ్రేమించినది. నిజ మాలోచింపఁగాఁ బ్రాణమైన మగఁ డిట్లగుట విచార కారణమే. ఒకని దుండగమందఱకు నుపద్రవకారణ మైనట్లు సత్యభామా క్రోధము మగజాతినందఱను విసరికొట్టినది.

'పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగ దంద్రు మదిక్
శరదంబుదచలచిత్తులు
పురుషులెపో వారి నమ్మఁబోలునె చెలియా !'

ఇంతలో నీర్ష్యాసూయలకుఁ జేదోడు వాఁదోడుగా నభిమా నము తలసూపినది. ఇట్టితిరస్కృతినందిన తానెట్లు సపత్నులయెదుటఁ దలయెత్తి తిరుగఁగలదు. మగఁడు తనగీచిన గీటుదాటఁడను గర్వము తనకీనాఁటి కడఁగిపోయినదని సపత్నులు మనసునందైన ననుకోనరా! ఇప్పటి సత్యభామాచిత్తవృత్తి నీక్రిందిపద్యములలోఁ గడుంగడు మనో హరముగాఁ జిత్రించియున్నాఁడు:

' ఇన్ని దినంబులు న్సవతు లిందఱలోఁ గడు గారవంబునన్
గన్నియ నన్ను వల్లభుఁడుఁ గన్నులఁ గప్పుకొనంగనుండి యా
వన్నెయు వాసియుం దఱిగి వారు ననుం దలయెత్తి చూడఁగా
నన్నల జాయలం బలుకనైతునె ప్రాణములెంత తీపొకో'
'నామొగమాటకై వలసి నాటకము ల్ఘటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబు దా
నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో
తామరసాక్షి! మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్'
'ఓచెలి! శౌరి కిచ్చెనఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్విరి యిట్టిమాటలా

హా ! చెవుల న్వినంబడియుఁ బ్రాణముదాల్చెద మేన నింతఁగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మొయి నున్నదాననో'

సత్యభామకు స్వాభిమానము మెండు. నారదు డొక్కలతాం తము శౌరి కీయఁగా నది యాతఁడు రుక్మిణి కొసఁగినాఁడు అను నీ వాక్యము వినియు జీవించియుండుట హేయమని యామెనిశ్చయము. ఇన్నిదినములు నీపైనధికాను రాగముగల కృష్ణుఁ డింతలో నిట్లు మాఱుటకుఁ గారణ మేమి? యనియందురా యదివట్టినటన మున్ను గూడ నారుక్మిణియే కృష్ణునకుఁ బ్రియతమ నాపైఁజూపిన ప్రేమయం తయు నా భర్తగోపాలుని కపటనాటకము ఇని యామెవాదము. కష్టసుఖములు కావడికుండలు కదా! ఇంతమాత్రమునకే రుక్మిణి యంత మురియనగునా?

'పూనుకొని మేలుఁ గీళ్ళకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడొ భోజకన్య తానెఱుఁగదొకో'

నరకాసుర దమనుఁడనుటచే నరకాసురవధయందలి సత్యభా మాసాహాయ్యము సూచితము కాని యిదియంతయు నొక్కపెట్టు. విరిధరించిన యాభోజకన్యను సపత్నులంద ఱుగారవము నుజ్జగించిభజిం చుట యొక్కపెట్టు. ఇంతలోఁ దనయెడఁ బతి మున్నుచూపిన ప్రేమ జ్ఞప్తికి వచ్చినది. ఇద్ది యాఁడువారికి సహజగుణము. వారేవిషయము నైనను దప్పిదా తలకెత్తక విడువరు. మేలుగీడులలో నెద్దివచ్చినను వాని పూర్వాపరములన్నియుఁ బూసగుచ్చినట్లు వారికి జ్ఞప్తికి వచ్చును. మానకోపిధ వివశయైయున్న సత్యభామకు మున్ను కృష్ణుఁ డును దానును సలిపినవిహారములు నడపిన యుత్సవములు ననుభవిం చిన కేళీవినోదములు జ్ఞప్తికివచ్చినవి. కలలోనైనను నవ్వులకైనను దన

మాట నాతఁడు జవదాఁటఁ వెఱచుననియు నెట్టిపదార్థంబు నామె యెదుటఁబెట్టక మున్న యెవ్వారికి నొసంగఁడనియుఁ జెలు లామెతో నేమి కొండెములు చెప్పిపోదురోయని వారికి లంచము లిచ్చుననియుఁ దోడిచేడియలు వంతులకా మెతో నిలువఁగా నయ్యది యాతఁడు సైరింపఁజాలఁడనియుఁ గపటమెఱుఁగని మమతలతోఁ గలసిమెలసి యిన్నినాళ్ళుంటిమనియు సత్యభామ తన చెలిమికత్తెకడ వచించినది.

ముక్కుతిమ్మనార్యుఁడు సత్యభామా స్వభావోన్మీలనముగావించుటలోఁ గడు జాగరూకత వహించినాఁడు. మానక్రోధవివశయయ్యు నీర్ష్యాసూయలచేఁ గలంచఁబడియు సత్యభామ మహాపతివ్రత. ఆమె పతిని ప్రాణతుల్యముగఁ బ్రేమించినది. తానెట్లు పతిని బ్రేమించుచున్నదో పతియుఁదన్నట్లే ప్రేమింపవలయుననియామెయాశయము. ఆమెకుఁగల ప్రేమప్రభావమే యామె యీర్ష్యాసూయలకుఁ గారణముగాని మఱెట్టి దురాలోచనములును గావు. ఆమెకుఁ బతియెడఁగల ప్రేమను గవి యీతీరున వ్యక్తము చేసియున్నాఁడు.

'పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేమగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడు మేరఁ దప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా !'
'ధన మిచ్చిపుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు మగఁ డింతులకుఁ
జన విచ్చిపుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటి మాటలు సెపుమా !'

ఇంతతో సత్యభామాస్వభావోన్మీలనమునందలి యొక ప్రకరణము సమాప్తమైనది. ఇందుఁ దిమ్మనార్యుఁడు చూపిన మనోవృత్తి వివరణ కౌశలమద్భుతము. సత్యభామ సుందర సుకుమారశరీర. పతి

వ్రతలలో నగ్రగణ్య ప్రేమస్వరూపిణి. కాని యాప్రేమ సాపేక్షము. అందు వలననే యీర్ష్యాసూయలకుఁ దావలమైనది. ప్రప్రథమమునఁ దన చెలికత్తె పారిజాత కుసుమ వృత్తాంతమును జెప్పఁగనే యామె హృదయమును గ్రోధాశ్చర్యములు రెండు నొక్కసారియే పెనగొన్నవి. తన్ను నిందించుటచేఁ గ్రోధము నిట్టిది జరిగెనా యనునాశ్చర్యము. అందులకే 'యేమేమీ కలహాశనుండచటికై యేతెంచి యిట్లాడెనా యామాటల్ చెవియొగ్గితా వినియెనా యాగోపికావల్లభుండు' అని యామె ప్రశ్నించినది. ఈ క్రోధాశ్చర్య సందేహములకుఁ దోడభిమాన మవతరించినది. ఎవరికో యేదో మగఁ డిచ్చినాఁడన్నంత మాత్రమున నింతగాఁ జిందులు త్రొక్కుటకుఁ దానేమి చులకన మానిసియా? అట్లుగాదు. అభిమానకారణము వేఱు. మతకరి వేలు పుందపసి తమ్ముదలంచుటయే యపచారము. దానిని జెవియొగ్గి తన ప్రాణవల్లభుఁడు వినుట మహాపచారము. ఇట్లనమానితమై హేయప్పుం బ్రతుకుబ్రతుకుటకంటె మరణించుటయే మేలుకదా! ఇట్లు వగలనిగులఁ బొగులుచుఁ గ్రోధాగారమున నామె ప్రవేశించినది. తొలుతఁ గ్రోధము-పిదప నాశ్చర్యసందేహములు. తుదకు దుఃఖము సత్యభామా మనోవృత్తి పరిణామమునందలి సోపానములు.

సత్యభామా స్వభావోన్మీలనమునందలి రెండవయంతరు వామె క్రోధాగార ప్రవేశముతో నారంభమగును.

'అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్'

క్రోధ వివశమైయున్న సత్యభామ నురగాంగనతోఁ బోల్చు టెంతయు నుచితమై మనోజ్ఞముగా నున్నది. ఇప్పట్టున నామెస్వరూపమును గవి యిట్లు వర్ణించినాఁడు.

'మాసినచీరఁ గట్టికొని మౌనముతోడ నిరస్త భూషయై
వాసెన కట్టుఁ గట్టి నిడువాలిక కస్తురి పట్టువెట్టి లో
గాసిలి చీఁకటింటికడ కంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజవిషాదవేదనన్'

'బిసరుహపత్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగ ల్వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నబాటొదవె నాటెఁ గడుం బరితాపవేదనల్
ససకపుఁ బాము కాటుగతి మచ్చర మన్విస మగ్గలింపఁగన్'

'వెడ వెడఁ గన్నుమూయుఁ గను విచ్చునగుందలయూచుఁ బాన్పుపైఁ
బడు నుసురంచు లేచుఁ దడబాటును దత్తరముం జలంబు లో
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తి హస్తగత పద్మినియుంబలె సొంపు పెంపఱన్'

పై పద్యములలో సత్యభామా బహిరంత రూప్యాకులు వర్ణింపఁబడినవి. ఈ పద్యములలో సత్యభామను కవి మూఁడింటితో నుపమించినాఁడు.

1. హరిచందన కోటరమున కేగు నాగతరుణి
2. జలదాంత చంద్రరేఖ
3. మదహస్తి హస్తగత పద్మిని

ఈ యుపమానముల వలన మన కప్పటి సత్యభామా స్వరూప స్వభావములు తేట తెల్లము కాఁగలవు. నాగతరుణితో నామెను సరిపోల్చుటచే నామె క్రోధవివశయై యున్నదనియు నామె సుందర సుకుమార దేహ యూ క్రోధతాపమును సహింపలేకున్నదనియు ధ్వనించును. మఱియు నాగతరుణి హరిచందనకోటరమునకుఁ దాపోపశమనార్థ మేగును. ఇట సత్యభామయుఁ దాపోపశమనార్థమే క్రోధాగారమున కేగినది. తాపశమనార్థమై క్రోధాగారమున కేగనేల? శైత్యోప

చారములు చేసికొనరాదా యనరాదు. ఇది క్రోధతాపము గాని విరహతాపము గాదు. విరహతాపమునకే శైత్యోపచారాదులు తగును. క్రోధతాపము పత్యనునయాదులచే మాత్రమే శమించును. తన్నిమిత్తము క్రోధాగార ప్రవేశమే కార్యము. జలదాంత చంద్ర రేఖా సాదృశ్యము వలన నామె దీనభావము ధ్వనించుచున్నది. మద హస్తి హస్తగతపద్మినియనుటచే నామె శరీరముతోపాటు హృదయ మును జందరవందరమై చీకాకు నొందియున్నదని ధ్వనించుచున్నది. ఇట్లు తిమ్మనార్యుఁడు సత్యభామా పాత్ర చిత్రణమునందుఁ గృత కృత్యుఁడైనాఁడు. సత్యభామామానక్రోధ వివశత్వమునకుఁ బరమావధి యామె తన పతి నెడమకాలఁదన్నుటతోఁగల్గుచున్నది. కేతన పటాం చల చంచలమైన తాల్మితోఁ గృష్ణుఁడు సత్యభామా గృహమున కేతెంచుట-తాళవృంతమును గొని తన ప్రియురాలికి వీచుట-తన్ను వడియు బుజ్జగించి ప్రతిమాలుకొనుట మొదలగు శ్రీకృష్ణుని చేష్ట లన్నియు నానాఁటి పురుషుల రసికత్వమున కుదాహరణములై యున్నవి.

'భరతశాస్త్రము ననుసరించి ఖండిత నాయికాపాత్రము నభిన యించు నటుఁ డీకావ్యపద్యములనే మాతృకలుగాఁ బెట్టుకొని తన యవయవవిన్యాసమును దిద్దుకొనవచ్చును. సత్యభామా కలాప ప్రదర్శనమునందుఁ గూచిపూడివారు చూపునదీ రహస్యమే. పెద్దన వలెఁ దిమ్మకవియుఁ బాత్రచిత్రణమునఁ గృతహస్తుఁడైన శిల్పి సూక్ష్మాతి సూక్ష్మ వివరములతోఁ బాత్రల మనోధర్మములను నిదా నించి చూచుటలో నొకవేళఁ బెద్దనయు నీయనకుఁ జాలకపోవచ్చును. పెద్దన కావ్యములో నాటకధర్మ ప్రాధాన్య మెక్కువ భావానుగుణ ముఁగాఁబదములఁ బ్రయోగించుటలో నీతఁడు మేటి యనవచ్చును'. ముక్కుతిమ్మనార్య ముద్దుపల్కులు తక్కినకవులకుఁ దక్కునవి కావు.

# ఆంధ్రకావ్యములు—హాస్యరసము

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.

"అపారమగు ఆంధ్రసారస్వతమున ఈ (హాస్య) రసము చాలఁ గొలఁది. మృగ్యమని చెప్పుటకూడ సాహసము కాదేమో !...... ముచ్చటకుఁగాని, మచ్చునకుఁగాని కన్నుపొడుచుకొని చూచెదమన్నను ఆంధ్రవాఙ్మయమున కేవల హాస్యరసప్రధానమైన గ్రంథమొక్కటియుఁ బ్రబంధయుగమందుఁ బొడసూపలేదు......ఈప్రబంధములందు హాస్యము 'కొత్తిమిరిప్రాయముగ' నైన లేదు" అని యొకరును, "హాస్యప్రధానములైన కావ్యాలు మన తెలుఁగులో తక్కువకావడానికి కారణము సంప్రదాయదాస్య" మని మఱియొకరును, "మనకు హాస్యగ్రంధాలు తక్కువ" యని యింకొకరును దమయభిప్రాయములను దెలిపిరి. ఇది యథార్థమగునా కాదా. అగుచో, కారణమేమని విచారింపవలసియున్నది.

హాస్యరసమునకుఁ బాత్రుఁడగుప్రతిపాత్రయుఁ బరిహాసపాత్రుఁడగునుగాన నతఁ డెప్పుడును గంభీరుఁడుగాని, యుదాత్తగుణోపేతుఁడుగాని యగుటకు వీలులేదు. ఉదాహరణమునకు శకారుఁడు, విదూషకుఁడు, మొక్కపాటి నరసింహశాస్త్రిగారి బారిష్టరు పార్వతీశము, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గణపతి, కాంతం మొదలైనవారు చక్కనిహాస్యరసమును ప్రతిపాదింపఁగలరేకాని, యుదాత్తలక్షణోపేతులు గాఁజాలరుకదా. అనఁగా నుదాత్తలక్షణములు లోపించి, వికారలక్షణోపేతులగుటచేతనే ముఖ్యముగా వారిమూలమున హాస్యరస ముద్భవించుచున్నది. నలమహారాజాదిధీరోదాత్తనాయకచరితమును వర్ణించుట కలిహరణ మని భావించిన మనప్రాచీనులు హాస్యరసపూర్ణములైన కావ్యములను విశేషముగ వ్రాయలేదు. వ్రాసిన యేకొలఁదికావ్యములవలననైన నుదాత్తకావ్యరచనవలనఁ గల్గినగౌరవము గలుగలేదు. మనప్రాచీనులు హాస్యరసమున కర్హమైన, పరిహాస

ముచేయఁదగినవారు విట,విదూషక, ధూర్త, ద్యూతకార, చేటికాదులనుగా పరిగణించిరి. వీరు చాల నీచమైన చౌకరకపు పాత్రలు. సౌశీల్యాదిసుగుణములు వీరియందు మృగ్యము మహానాటకములందుఁగూడ సామాన్యముగ హాస్యరసము వీరివలననే పోషింపఁబడినది. వీరిని ప్రధానముచేసికొని హాస్యరసప్రధానముగా రచింపఁబడినకావ్యములే ప్రహసనాదులు. ఇవి దశరూపకములలో, నుపరూపకములలోఁ గూడనున్నవి. దశరూపకములలోని భాణము, వీధి, ప్రహసనమును, నుపరూపకములలోని నాట్యరాసకము, ప్రస్థానకము నుల్లాప్యకము, రాసకము, విలాసకము మొదలైనవి యిట్టివి. మన పూర్వులు విశేషముగ శృంగారభూయిష్ఠమైన హాస్యమునే యాదరించిరి. అందుచేతనే శృంగారమునకును హాస్యమునకు మైత్రిని గల్పించిరా రాలంకారికులు. కాననే కాఁబోలు ప్రాచీనులచేతులలో నసభ్య శృంగారముగూడ హాస్యముగా పరిణమించినది ఈయవకాశమును చేసికొనియే కవిచౌడప్ప ఈక్రిందివిధముగా వ్రాయవలసివచ్చినది.

కం. నీతుల కేమి యొకించుక,
బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో,
నీతులు బూతులు లోక,
ఖ్యాతులురా కుందవరపుకవిచౌడప్పా.

కం. పదినీతులు పదిబూతులు,
పదిశృంగారములు గల్గుపద్యముల సభం
జదివెడివాఁడే యధికుఁడు,
గదరప్పా కుందవరపుకవిచౌడప్పా,

అది యాకాలపుసాంఘికాచారముగ పరిగణింపవచ్చును. ఈయసభ్యశృంగారము వాచికాంగికాహార్యము లని త్రివిధములుగా రూపొందినది. ఇందుచేతనే శ్రీనాథుఁడుగూడ నసభ్యశృంగారపద్యములు వ్రాసినవాఁడుగా నెంచఁబడినాఁడు

ఉదాత్తగాంభీర్యలోపభయకారణమున మనప్రాచీనులు విశేషముగ నాద్యంతహాస్యప్రధానకావ్యములను వ్రాయలేదు. అంతమాత్రముచే వారు హాస్యమెఱుఁగని మొరటులని భావింపరాదు. వారినిగూర్చియొకరు ఈకవులెవరూ నోరు విప్పి నవ్వడం ఎరుగరు, సరిగదా మనల్ని నవ్వనివ్వరు నవ్వవలసినచోటఁగూడ పెదవులు బిగించి కళ్ళెగరవేసి ఊరుకొంటారు. అని తలపోసినారు. ఇది సమంజసముగాఁ దోఁచదు. అవకాశముగల్గినపుడెల్ల యక్కడక్కడ మాత్రమౌచిత్యమును పాటించుచుఁ దమకావ్యములలోహాస్యరసమును పాలింపక వారు జారవిడువలేదు. ఆంధ్రమున విశేషముగా సంస్కృతమందలి పురాణకావ్యాదులే యనువదింపఁబడినవి కాన, మూలమున నున్న హాస్యమే యనువాదమందుఁగూడ నుండును కానిప్రబంధములలో స్వకపోలకల్పనలు, వర్ణనలు విశేషముగఁ గలవు. అట్టి స్వతంత్రరచనలలో నక్కడక్కడ చక్కని చిక్కని హాస్యరసపోషణమున కవకాశము గల్గును. ప్రథమాంధ్రకావ్యకర్తయగు నన్నయభట్టు భారతమునే యాంధ్రీకరింపవలసినవాఁడగుటచేతను, భారతము పంచమవేదమై, ధర్మప్రతిపాదకమైన యితిహాసమగుటచేత నందుదాత్తత విశేషమై హాస్యరసమున కల్పస్థానమే కల్గినది. మిగిలినభాగవతరామాయణాదిపురాణముల నాంధ్రీకరించుటలోఁగూడనంతేజరిగినది. పురాణాంతర్భాగములను గ్రహించి వ్రాసినప్రబంధములలో శృంగారరసమునకే ప్రాధాన్య మబ్బినమాట యథార్థము. పురాణాంతర్భాగములైనయుపాఖ్యానములుగూడ పురాణప్రధానవిషయమగు ధర్మప్రతిపాదకత్వమున కర్థవాదములుగా నుండునవేకాన నందలినలదుష్యంతాదినాయకులుగూడ ధీరులేకాని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గణపతి, మొక్కపాటి నరసింహశాస్త్రిగారి బారిష్టరుపార్వతీశం వంటియవివేకులు, మూర్ఖులును గారు. అగుచో శ్రీరామధర్మ

రాజాది యుదాత్తనాయకులను పరిహాసముచేసి హాస్యరసమును బోషించి, కావ్యోదాత్తతను గాపాడుట యెట్లు? కాన కావ్యోదాత్తతకును హాస్యరసప్రాధాన్యమునకు విరోధము చేకూరినది. ఉదాత్తకావ్యము హాస్యరసప్రధానముగా నుండవీలులేదు. హాస్యరసప్రధానమైన కావ్యమున ధీరుఁడు నాయకుఁడు గాఁ జాలఁడు. అందుచే నా కావ్య ముదాత్తము గాఁజాలదు ఇందుచేతనే మనప్రాచీనులు కావ్యమున నుదాత్తతాలోపమును జేయ నిచ్చగింపక, హాస్యరసప్రధానకావ్యములను వ్రాయఁ బూనుకొనలేదు. ధీరులైన శ్రీ రామ, నల, దుష్యంతాదినాయకులందు వికృతలక్షణముల నారోపించి, హాస్యరసపోషణము సేయఁజూచుట యనౌచిత్యభంగకరము గదా' ఇది ప్రాచీనకవుల దృష్టియు నాదర్శమును. నవీనులదృష్టి కేవలము వినోదముమాత్రమే. హాస్యరసమువినోదమును గూర్పఁగలదు కాని, వీరశృంగారరసములవలె విగళితవేద్యాంతరమైన నిర్భరగంభీరరసానందమును గూర్పలేదు. మానసికావస్థలలో వినోదముకంటె సంతోషమును, దానికంటె నానందము నుచ్చదశకు జెందినవి అందుచేత నేకదా విగళితవేద్యాంతరత్వరూపా బ్రహ్మానందసహోదరీ రసాభివ్యక్తిః అని తెలుపఁబడినది. అసలు రసానందానుభవము క్షణికముకదా! అందునాద్యంతము హాస్యరసప్రధానమైన కావ్యమువలన చిరకాలము హాస్యరసానందానుభవమును పొందఁగలముకనుకనే కావ్యము మిశ్రరసమయముగా నుండవలెనని పెద్దలుతలంచిరి. అందుచే మనవా రౌచిత్యమును బాటించి హాస్యరసము నక్కడక్కడమాత్రమే పోషించిరి కావ్యములలో.

పాశ్చాత్యవాఙ్మయములలోఁగూడ నుదాత్తవాఙ్మయము బయలుదేరిన తర్వాతనే వినోదకరమైన హాస్యరసప్రధానములైన గ్రంథములు వ్రాయఁబడినవికాని, ప్రారంభముననే యాద్యంతము హాస్య

రసప్రధానములైన కావ్యములు రచింపఁబడలేదు. ఎంతయుత్తమమైనను హాస్యరస ప్రధానమైనగ్రంథమును రెండుమూఁడుమాఱులకంటె నధికముగాఁ జదువ నిచ్ఛగింపము. అంతకంటె నధికముగఁ జదివిన నందలిపాత్రలఁగూర్చి సానుభూతి జాలి పొందుటకు మాఱుగ, వారి వెకిలిదనమునకు, నవివేకమునకు, మూర్ఖత్వమునకును మన కసహ్యమును, రోఁతయును, అందలిహాస్యముగూడ క్రమముగ నిగిరిపోవును. ఆంగ్ల భాషలో Cervantes వ్రాసిన Don Quixote, Swift రచించిన Gulliver's Travels, Dickens కృతOliver Twist మొదలైనగ్రంథములను తెలుగున చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గణపతి, మొక్కపాటినరసింహశాస్త్రిగారి బారిష్టరుపార్వతీశం, మొదలైనగ్రంథములను రెండుమూడు మాఱులవఱకు వినోదముతోఁ జదువఁగలము. ఇశ్లేకూచి మంచి జగ్గకవికృత చంద్రలేఖావిలాపముగూడ కాని యాగ్రంథములను విశేషముగఁ జదివినకొలఁది నాపాదమస్తకము వారిలోఁ గల యల్పత్వమునకు మనము రోఁతచెందక యుండలేము. కాని శృంగారరసప్రధానమైన యభిజ్ఞానశాకుంతలమునుగాని, వీరరసప్రధానమైన ముద్రారాక్షసాదులనుగాని యెన్నిమార్లు చదివినను తనివితీరదుకదా! హాస్యరసప్రధానములైనగ్రంథమునకు వీరశృంగారరసప్రధానములైనకావ్యములకుఁ గలభేద మిది. శృంగారరసప్రధానమైనకావ్యమున శృంగారరస మెంత పచ్చిగను, నసభ్యముగనుండినను నెవరికి వారు రహస్యముగ నెన్నిమాఱులైనను జదివి యానందింపఁగలరు. కామశాస్త్రము, తారాశశాంకవిజయము వంటిగ్రంథములుగూడ నాబాలగోపాలము నెవరికి వారు రహస్యముగా నెన్నిమాఱులైనను జదువుకొని యానందింపఁగలరు. వీనివలన నొకచేప్రమాదము. దుర్బలహృదయులుమాత్రము కుమార్గవర్తులగుటకుఁ గారణమగును. కాని రసానందానుభవము ముసలివారికైనను మందగించదు. ఇందు

చేతనే శృంగారరసము సహస్రములతో నగ్రస్థానము నహించినది. కాన ఆంధ్రకవితల్లజుల కెల్లరకు శృంగారరసప్రీతిలో మునగాటం తేలా నాటితో సరిపోయినది పుణ్యకాలముకాస్తయు. కేవలహాస్యరసప్రధానమైనగ్రంథ మొక్కటియుఁ బ్రబంధయుగమందుఁ బొడసూపలేద"ని కొందఱు వ్రాయుట సమంజసముగ లేదు. శృగారరసముతో సమానస్థానమును హాస్యరస మున్నదను పొందఁజాలదు. హాస్యరసపాత్రల వెకిలిచేష్టలు, రసానౌచిత్యవాక్కులు మొదలైనవి, లలిత సుకుమార భావయుతములగు శృంగారరసముతో సమానము గాఁగలవా? మృచ్ఛకటికనాటకమున శకారుని వెకిలిపనులు, రసానౌచిత్యపువాక్యములు మనకెంతవినోదమును గొల్పి, హాస్యరసప్రతిపాదకములైనను నానాటకమందలి వసంతసేనాచారుదత్తులశీలములకు మనము ముగ్ధులైనంతగ కాని, యభిజ్ఞానశాకుంతలనాటకమున శకుంతలాదుష్యంతుల ప్రణయభావములతో నెరపుసానుభూతినిగాని మనము శకారునియందు పొందము. పిచ్చివాని వేషభాషాదులవలన మనకు గలుగు హాసము వంటి హాసమే, శకారుఁడు, పార్వతీశం, గణపతిమొదలగు హాస్యరసపాత్రలవలనఁగూడఁ గలుగును గాని నిటువంటి హాస్యరసప్రధానమైన కావ్యములను వ్రాయనొల్లక, విశ్వజనీనమైన శృంగారరసప్రధానమైన ప్రబంధములను వ్రాసిన మన ప్రాచీనకవులు నిందార్హులా? పాశ్చాత్యవాఙ్మయమందుఁగూడ నితరకావ్యములతోఁబోల్చినపుడు హాస్యరసప్రధానములైన కృతులుమాత్ర మధికముగా నుండవు. షడ్రసోపేతముగ విందుభోజన ముండఁగ, నాద్యంతము గుంటూరు గోంగోరపచ్చడితోఁగాని, రాజమహేంద్రవర మావకాయతోఁగాని యున్నభోజనముతో సరిరాదని చెప్పఁగలమా? గుంటూరుగోంగోర పచ్చడికాని, రాజమహేంద్రవరమావకాయగాని రుచ్యముకాదని కాదు. అవి షడ్రసోపేతభోజనముతో సరిరావు. నంజుకొనుటకు

పనికివచ్చుపదార్థము లవి. అట్లే హాస్యరసవిషయముగూడ వీరసమైనను మితిమీఱి యాద్యంతముగ నదియొక్కటియే ప్రధానముగ వర్ణించుచో వికారముగనే యుండును. ఏకావ్యమునందైనను వీరశృంగారేతరరసములకు ప్రాధాన్య మొసంగుచో నెగటుగొల్పకమానదు.

హాస్యరసపోషణమున వైవిధ్య మెక్కువగలదు. ఆంధ్రవాఙ్మయమునఁ జెదరియున్న హాస్యరచనభాగము లన్నింటిని సంగ్రహించి 'యేర్చికూర్చి' వర్గీకరించినవా రెవరు నింతవఱకు లేరు. పురాణములనుండి, కావ్యములనుండి. ప్రబంధములనుండి, శతకములనుండి. యక్షగానములనుండి, చాటువులనుండి లోకోక్తులనుండి ప్రత్యేకముగ హాస్యరసఘట్టములను సేకరించి కూర్చిపెట్టినచో ననేకవిధములైన హాస్యరచనలు సంతృప్తికరముగనే యున్నట్లు తేటతెల్లమగును. కథాసందర్భములలో వివిధఘట్టములందును. పుష్పలావికావర్ణనము లందును, చంద్రదూషణాదులందును, గణేశ్వరస్తుతులలో, సవతుల పోరులలో, బావమఱదులసరసాలలో, నత్తాకోడళ్ళ యీసడింపులలో, దక్షిణనాయకఖండితనాయికలసంభాషణలలో, బాలక్రీడలలో స్త్రీలపాటలలో హాస్యవైవిధ్యము గోచరించును. ఇందలి హాస్య రస పోషణమును మనకవులు సంతృప్తికరముగఁ జేసిరా లేదా యనివిచారించుట యుచితముగాని, హాస్యరసప్రధానముగాఁగల ప్రబంధ మొక్కటియు వ్రాయనందుకు మనప్రాచీనులను నిందించుట సమంజసముగా నుండదు. కాన నాపనికిఁ గొంతప్రయత్నింతము.

సంస్కృతమున నాదికవియగు వాల్మీకి మహర్షియయ్యును రామాయణమున ఋష్యశృంగకథలో ,హాస్యరసము నెంత చక్కగ పోషించినాఁడో పరిశీలింపఁదగినది. అది భాస్కరరామాయణముగ నిట్లాధ్రీకరింపఁబడినది. దశరథునిచే పంపఁబడిన వారాంగనలు దమ

హావభావవిలాససౌందర్యములను ప్రదర్శించుచు ఋష్యశృంగునాశ్ర
మమును జేరఁగ,

ఉ. వరముని ఋష్యశృంగుఁ డట వచ్చినవారి విచిత్రమూర్తు ల
చ్చెరువడి చూచుచుం జెవులు చేరిచి గానము వించునుండె, స
త్వరగతులం జేరి రావమతాపస. రామునిపుత్రి యేల యి
క్కడఁ దమ్ముఁ జొచ్చి యనావిజనకాననభూమిఁ జరించె దీ వనన్.

కం. వినుఁ డే ఋగ్విజ్ఞాంగుం,
డనుపేరను ఋష్యశృంగుఁ డనియెడునామం
బున మహిలోఁ బరగుదు, మా,
జనకుండు విభండకాఖ్యసంయమి యొప్పున్.

చ. తెలియఁగ వచ్చినార లిట వింతతపస్వులు మీరు మానసీ
యులు మిముఁ బూజచేసి సుకృతోన్నతిఁ బొందెద నంచు నిష్ఠతోఁ
బలకొని యర్ఘ్యపాద్యములు దర్భలు నాదట నిచ్చి యొలిమై
ఫలములు కందమూలములు భక్తి నిడం గొని వారు నవ్వుచున్.

కం. అమృతమయములారఁ బాకము,
లమరించిన మోదకమ్ము లాదిగ బహు భ
క్ష్యము లొగి నిచ్చిన నానం,
దముతో నందుకొని నమలి తనిసినమదితోన్.

కం. ఈపగది ఫలము లెన్నఁడు,
నేపాలములఁ దరులఁ గాన మెందుల నివి యీ
తీపులు నిట్టివిచిత్రస్వ,
రూపులు నీఫలము లింత రుచ్యము లగునే.

వ. అని పలుకుచు నమ్మగువలు వీనులు సోగియింపం బాడ,
సద్గానంబు వినివిని యెలమిని.

కం. ఈమధుర ఫలవిశేషం,
బే మెన్నఁడు వినము కనము నేముని వెప్పెన్,
నేమఱు మీతోఁ బనిచెద
నో మునివరులార చెప్పఁ డొప్పుగ నాకున్.

కం. అని పలికి మఱియు నమ్ముని,
తనముందట నిలిచి యున్న తరుణుల వృత్త
స్తనములు హారంబులుఁ జం,
దనచర్చలుఁ బోలఁ జూచి తగ నిట్లనియెన్.

ఆ. నాకుఁ బోలెఁగావు మీ కురమున రెండు,
వలుఁదగుజ్జుఁగొమ్మ లలరుచున్న
వలతితులసిపూస లతిసితములు మేనఁ,
దనర నలఁదినారు తావిభూతి.

కం. ఈకట్టినవల్కలములు,
మీ కెంతయు లెస్స వింతమృదువులు గలవే
యేకుజములనారలో యివి,
మాకును నివి యొసఁగవలయు మానుగ మీరల్.

వ. అని యిట్లనేకప్రకారంబుల ముగ్ధాలాపంబు లాడుచుం దమలో గలసి యునికిఁ బరికించి.

ఇందు ఋష్యశృంగుని యమాయకభావములు, మాటలు, ప్రవర్తనమును నందఱకు మందహాసము గల్పింపకపోవు. ఇతఁడు దన జీవితమంతయుఁ దపోవనముననే కడపి, స్త్రీల నెన్నఁడుఁజూడకపోవుటచే వారు వింతఋషులుగాఁ దోఁచిరి. వారిగానము నూత్న వేదముగఁ బొడగట్టినది. వారు ధరించినమృదువస్త్రములు క్రొత్తవల్కలములుగఁ గనుపట్టినవి. వారిచ్చిన లడ్వాదిభక్ష్యములు క్రొత్తఫలములుగాఁ గనఁబడినవి ఈతని యమాయకత్వము వారవనితలకును, వారి నాగ

రికత మాతనికిఁ జోద్యమైనది. అతఁడు లోకమంతయు మృగముగ నాగరికులకుఁ దోఁచినవాఁట. మనకుఁగూడ నట్లే పొడఁగట్టును. ఇది యవ్యాజమనోహరమైన హాస్యమని యందఱు నంగీకరింపక తప్పదు. ఋషియైనవాల్మీకి తనకవికోటిఋష్యశృంగచరిత్రను చిత్రించినప్పు డందలిహాస్యమును గుర్తించియుండఁడా. ఋష్యశృంగుఁడు బారిష్టరు 'పార్వతీశము'వంటి వాఁడు లోకవిధమున. బారిష్టరుపార్వతీశము తీరా లండనునకు వెళ్ళలేదు. కాని, పోయియుండినచో నక్కడ నతఁడు ఋష్యశృంగునివలె ప్రవర్తించి, యక్కడవారిచే ఋష్యశృంగునివలెనే చూడఁబడియుండెడివాఁడు. ఇది విస్మయము లేక యద్భుతరసముతోఁ గూడిన హాస్యరసమని చెప్పనగును. కాని యందలివిస్మయము మనదికాదు ఋష్యశృంగునిది. హాస్యరసానుభవము మాత్రము మనది. కాని, భాస్కరునిలోఁగాని, రంగనాథునిలోఁగాని చెప్పుకోదగినంత హాస్యంలేదనే అనాలి" అని తెలుగు హాస్యకర్తయైన శ్రీ ముట్నూరి సంగమేశంగారి విమర్శ.

రామాయణమునందలి సుందరకాండలో వానరులు మధువనమును బ్రవేశించి యందలిమధుఫలములను స్వేచ్ఛగాననుభవించిన తర్వాత వారివికారచేష్టలను వాల్మీకి వర్ణించినాఁడు. ఇది కపులస్వభావమేయైనను మనకు హాస్యము గల్గింపక మానదు. కోఁతులచిలిపిపనులు సహజముగ నవ్వు పుట్టించును గదా. ఈఘట్టము భాస్కరరామాయణమున నిట్లాంధ్రీకరింపఁబడినది మల్లికార్జునభట్టుచే.

ఉ. పంపులు పొట్టనిండఁ దిని పండ్లవి మిక్కుటమైనఁ గ్రొవ్వునం
బంపుల వాటులాడుచును బైఁబయిఁ దేనియ లోలిఁ గుత్తుకల్
నిండఁగఁ గ్రోలి సోలుచును, నిద్దురవోవుచు లేచి కొందఱు
చ్చండతఁ గిట్టి తేనియ వసంతములాడుచుఁ బొంగి వెండియున్.

చ. కనుకనిఁ దోఁకఁ బట్టుకొని గంతులు వైచుచు వీఁక నార్చుచున్
గునియుచుఁ బాఱుచున్ నెగసి కొమ్మలవ్రేలుచు నేలఁ గూలుచున్
ఘనతరు లెక్కుచున్ దిగుచుఁ గ్రిమ్మఱఁ బాఱుచుఁ జెట్టుచెట్టుపై
కనువుగ దాఁటుచుం జెలఁగి చూచుచుఁ బాఱుచు నోలవెట్టుచున్
పండినభూజ మెక్కి పరిపక్వఫలంబులు దించు నొక్కరుం
డుండఁగ, వానిఁ దోఁచి మఱియొక్కఁడు చేకొన వాఁడు నోయి తా
నొండొరు పంటి నెత్తికొని యుద్ధతి పాఱఁగ వానిఁ దాఁకి యా
ం డొకఁడుంపు పుచ్చుకొనఁ బై వడి యొక్కఁడు వానినిఱ్ఱింగుచున్

ఉ. ఒక్కనివీపుపై కుఱికి యొక్కరుఁ డుండఁగ, వానివీపుపై
నొక్కరుఁ డెక్క, వానితల నొక్కరుఁ డెక్కఁగ నోలి దొంతులై
దిక్కుల నాడఁగా, నొకఁడు తీవ్రత వారలఁ గూలఁదన్నఁగా
నొక్కఁడు వాని మూపులు మహోన్నతి నెక్కుచుఁ జీరుచుం దగన్

చ. ఫలములు దించుఁ, దేనియలుపై పయిఁ ద్రావుచుఁ బుష్పగుచ్ఛముల్
దులుచుచుఁ గాయ మెల్ల వడి ద్రొల్లఁగ వ్రేయుచు, లేఁజిగుళ్ళ నా
కులు నెరఁజాడి త్రుంచుచును, గొమ్మలు దక్క సమస్తభూజముల్
బలువిడి గాసిచేసి బహుభంగుల నిట్టులు ద్రుళ్ళుచున్నెడన్.

వ. తర్వాత యుద్ధకాండప్రారంభమునఁ గూడ హుళక్కి-భాస్కరునిచే కపులచేష్ట లిట్లు వర్ణింపఁబడినవి.

చ. మదమున దూఱిపాఱి పెనుమ్రాఁకులఁ బ్రాఁకుదు రిట్టునట్టు దాఁ
టుదురు లతాంతగుచ్ఛములు దుల్తురు, ముందటి గండశైలముల్
పదములఁ బాఱఁజిమ్ముదురు, ప్రాంతమహీరుహశాఖలం బెనం
గుదురొగి నుప్పరం బెగసి కూలఁగఁ దాఁతురు శైలశృంగముల్.

కం. ఒక రొకరిమూఁపు లెక్కుదు,
రొకనిపయిం ద్రోతు రొకని నొక్కఁడు దినుపం
డొకఁ డొడిసికొనఁగ నడుమన,
రొకఁ డది పడనడువ, నదియు నొక్కఁడ మ్రింగున్.

ఉ. పండినభూజముల్ పెఱికిపట్టి ఫలంబులు దించు నన్యుఁ డ
ప్పండులు వేడినం దనదుపం డ్లిగిలించు, నొకం డొకండు చే
పం డటు చూప వాఁడు కరపల్లవ మల్లనఁ జాప, మ్రింగి బ్రి
హ్మాండముఁబోలె నున్నతనయంగిలిఁజూపుచుఁబోయెఁబొమ్మనుఙ.

వ. ఇత్తెఱంగునం దమజాతిచేష్టితంబుల దాశరథుల కింపొంద
వింప నెడ నెడ...ఇందు కోతులచిలిపిపనులు స్వభావోక్తితో వర్ణింపఁ
బడి హాస్యరసము పోషింపఁబడినది. వెనుకటి ఋష్యశృంగునికథలో
నతని యమాయకభావములు వాక్రిపమున వ్యక్తముకాఁగ, నిందు
కపులచిలిపిభావములు దమచేష్టలరూపమునే వ్యక్తీకరింపఁబడినవి.
వానికి భాష రాదుకాన. ఐనను నిట్టివి భాషమూలమునకంటె, చేష్టల
మూలముననే బాగుగవ్యక్తీకరింపబడి హాస్యరసము బోషింపఁగలవు
పొట్టనిండ ఫలములు తిని. తేనె త్రాగి స్వేచ్ఛగ, మదించి కపులు
కొన్నిపండ్లనొండరులుపై గిరటవైచుచు, మధువును చల్లుకొనుచు
వసంతములాడిరఁట తేరగ వచ్చినవస్తువుల ననుభవించినతర్వాతపొగ
రెక్కి చేయుతుంటరిపను లివి. ఒకచెట్టుపై నుండి మఱియొకచెట్టుపైకి
గంతులువేసి, చెట్లపూవులు నాకులు వృథగ రాల్చుటవానిసహజమైన
వెకిలిచేష్టలు. చెట్లపై ననేకఫలములుండఁగ నెవరికి వారు ఫలములను
గోసి యనుభవించుకొనవచ్చునుకదా కాని యట్లు చేయక యొకరు
కోసి తినఁబోవుచున్నపండ్లను, చేతిలోనుంచి మఱియొకకోఁతిలాగు
కొని పోయి తినబోఁగ, దానిచేతిలోనుండి మరియొకటి యెగరకొట్టు
కొనిపోయి తినును. ఇట్టిపనులను పోకిరిబాలురు సామాన్యముగచేయు
చుండుట మనము కనఁగలము ఇట్టికోతిపనులు నవ్వుపుట్టించునుకదా!
మఱియు నొకకోతి మూపుపై మఱియొకకోఁతియెక్కఁగ, దానిపై
మఱియొకకోతియెక్కి కోతులదొంతిగా నేర్పడి యాడుచుండగా,
నొకకోతి వారిని తన్ని వేసినదఁట ఒకకోఁతి యేపనిచేసిచేసిన దాని

ననుకరించి మఱియొకకోతి చేయుట యాజాతిస్వభావము. ఈజాతి మానవులనే యనుకరించి నవ్వును జనింపఁజేయునుమానవులకు. రామలక్ష్మణులు వారిచేష్టలకు వినోదము చెందిరఁట. ఇదియొకవిధమైన హాస్యరసపోషణము

ఈకోఁతులచిలిపిపనులను బోలినవేగొల్లపిల్లలు శ్రీకృష్ణునితోఁ గలిసి చల్దులారగించుచు చేసిన వికారచేష్టలు భాగవతమందును, హరివంశమునందును, విష్ణుపురాణమందునుగలవు. ఈపిల్లలుచేయు చిలిపి పనులు చూచువారికి హాస్యముగొల్పకమానవు. బమ్మెరపోతరాజు వారిచేష్టల నిట్లు వర్ణించి హాస్యరసమును బోషించినాఁడు, తనభాగవతమున.

సీ. మాటిమాటికి వ్రేలుమడచి యూరించుచు,
నూరగాయలు దినుచుండు నొక్కఁ
డొకనికంచములోని దొడిసి చయ్యన మ్రింగి,
చూడు లేదని నోరు చూపు నొక్కఁ
డేగు శార్గురచల్దు లెలమిఁ బన్నిదమాడి,
కూర్కొని కూర్కొని కుడుచునొక్కఁ
డిన్నియుండఁగఁ బంచి యిడుటనెచ్చెలితన,
మనుచు బంతెనగుండు లాడు నొకఁడు.

గీ. కృష్ణుఁజూడుమనుచు గికురించి పరుమ్రోల,
మేలిభక్ష్యరాసి మెక్కునొకఁడు,
నవ్వునొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు,
ముచ్చటాడు నొకఁడు మురియునొకఁడు.

గోపబాలురు మాట్లాడనేర్చిన మానవులైనను, వీరి చమత్కారము క్రియలలోఁజూపించిరి. మాటలురాని కోఁతులుగూడ నిట్టి క్రియా చమత్కారమును జూపినవి వెనుక. మాటలతోఁ జమత్కారము

చూపుట కెక్కువ బుద్ధిసూక్ష్మత కావలెను. అది కొంత వయసుగల వారికేఁగాని సాధ్యము గాదు.

భాగవతమున శ్రీకృష్ణుఁడు చిన్నతనమున గోపస్త్రీల గృహములలో నెఱపిన యల్లరిగూడ హాస్యరసపోషకముగనే యున్నది. అవి గోపస్త్రీలకుఁ గొంత బాధాకరముగ నుండినను నా యల్లరి నవ్వు పుట్టింపకమానదు. ఆ లీలలను పోతన యిట్లు చిత్రించినాఁడు. గోపికలు శ్రీకృష్ణుని యాగడమును దనతల్లితో నిట్లు చెప్పెదరు.

కం. పడతీ! నీబిడ్డఁడు మా,
కడవలలోనున్న మంచి కాగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కిన,
కడవలఁ బో నడఁచె నాజ్ఞకలదో లేదో.

కం. ఆడం జని వీరలపెరు,
గోడక నీసుతుఁడు ద్రావి యొకయించుక నా
కోడలి మూతిం దుడిచిన,
గోడలు ముచ్చనుచు నత్త కొట్టె లతాంగీ!

కం. వారిల్లుసొచ్చి కడవల,
దోరంబగు నెయ్యి ద్రావి తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడ,
వారికి వీరికిని దొడ్డవాదయ్యె సతీ.

గీ. నమ్మి నిదురవోవ నాపట్టెజట్టుమా,
లేగతోఁక తోడ లీలఁగట్టి
వీథులందుఁ ద్రోలెవెలఁది నీకొమరుండు,
రాచబిడ్డఁడైన రవ్వ మేలె?

కం. వేలుపులకు నాకంబెను,
వేలుపు మఱి యెవ్వరనుచు వికవిక నగి మా

వేలుపుల గోడపైనో,
హేలావతి సీతనూజుఁ డెంగిలిచేసెన్.

శ్రీకృష్ణుని యీ చిన్నతపుచేష్టలు గొంత ముచ్చటగొల్పు హాస్యమును ప్రతిపాదించినవి. ఇది మఱియొకవిధమగు హాస్యము. ఇందలి హాస్యము "పిల్లికి చెలగాట యెలుకకు ప్రాణసంకటము" వంటిది దీనివలన భగవంతుఁడుగూడ హాస్యరసప్రియుఁడని వ్యక్తమగును.

శ్రీకృష్ణుఁడు గోపకులతో చల్దులు దిన వనమునకుఁ బోవునపుడు చల్దికావిడి వారితో హాస్యకరముగ గోపకులు వర్తించిరని యిట్లు వర్ణింపఁబడినది.

కం. ఒకఁడొకని చల్దికావిడి;
నొకఁడొకఁ డడకించి దాఁచు నొకఁడొకఁ డది వే
ఱొకఁడొకని మొఱఁగికొని చన,
నొకఁడొకఁ డది దెచ్చియిచ్చు నొగి నుర్వీశా.

కం. ఒక్కఁడు మున్నె మఱి చన,
నొక్కఁడు బలుబొబ్బవెట్టి నులికివడన్ వే
ఱొక్కఁడు మిట్టి తటాలున
నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.

కం. తీపుగల కజ్జ మన్యుఁడు,
గోపింపఁగ నొడిసిపుచ్చుకొని త్రోపాడం
బై పడి యదిగొని యొక్కఁడు,
కేళిపులలో నిట్టునట్టు గికురించు నృపా.

కం. వనజాక్షుఁడు మున్నరిగిన,
మునుపడఁగా నతని నేనె ముట్టెద ననుచుం

గని మునుముట్టనివానిఁ,
మునుముట్టినవాఁడు నవ్వుమొనసి నరేంద్రా.

ఇట్టిపనులు సామాన్యముగా బాలురు వేడుకకై చేసి నవ్వు గొల్పుట సర్వసాధారణముగ గోచరించు విషయములె.

ఇంతవఱకును సూచించిన సందర్భములందుఁ గొంత వికారము ను విశేషమును గూడ లేకపోలేదు. అట్టివికృతి యేదియు లేకయె నవ్వుపుట్టించు సన్నివేశములుగూడ నుండఁ గలవు. దారిలోఁ బోవుచు నకస్మాత్తుగా నెవరైనఁగాలుజారి గ్రిందపడిపోయినచో జాలితోపాటు నవ్వుగూడఁ బ్రేక్షకులకుఁ గలుగును. అంతియేకాదు రాచబాటలోఁ గొన్నిగుంటలు త్రవ్వుటకాని, పల్లేరుకాయలు వేయుటకాని చేసి, వానివలన బాధపడువారినిఁ జూచినపుడుగూడ నవ్వుపుట్టును. అటువంటిది సన్నివేశమొకటి భారతమున సభాపర్వమునఁగలదు. పాండవులరాజసూయయాగానంతరము దుర్యోధనుఁడు మయసభారామణీయకమును దర్శించువాఁడై యందుఁ గుమ్మరుచు.

వివృతంబైన ద్వారదేశంబుసంవృతంబుగా వగచి చొరనొల్లక, సంవృతంబైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాటఘట్టిత గృహద్వారుండై, సమప్రదేశం బున్నతంబుగా వగచి యెక్కసమకట్టి, నీలాశ్మరశ్మిస్థగితంబైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొని, స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియఁజొచ్చి క్రమ్మఱినవానిం జూచి పాంచాలియుఁబాండవ కుమారులును నగిరంత.

ధీరోదాత్తుఁడైన దుర్యోధనునకే యట్టి శృంగభంగము గల్గించి, నవ్వుపుట్టించుట యిది చక్కనిసన్నివేశము. ఇందు ధీరుఁడైన రాజరాజుగూడ దిగ్భ్రమచెంది బారిష్టరు పార్వతీశమువలె తన యవివేకమును వెలిబుచ్చవలసినవాఁడైనాఁడు మయకృతచమత్కార

నిర్మాణమువలన. ఈతనిశృంగభంగమునకు పాంచాలీపాండవులకే కాక మనకుఁగూడ నవ్వుగల్గింపక మానదు. ఇందలి హాస్యసంఘటన మనుద్దిష్టము నాకస్మికమునుగూడ.

ఉద్దేశపూర్వకముగా శృంగభంగముచేసి యెఱుఁగనివానివలె నటించి హాస్యరసమును ప్రతిపాదించుట మఱియొకవిధము. ఇటు వంటి సంఘటనము భీముని సౌగంధికాపహరణమునందున్నది భీముఁడు గర్వముతో గంధమాదనవనమునకుఁబోయి తన శంఖముతో గొప్ప ధ్వనిని చేసినాఁడఁట. అప్పు డావ మందున్న హనుమంతుఁడారవమును విని, యది భీమునిదిగా గుర్తించి, సంతోషించుచు లోన, పైకి నమా యికుఁడువోలె నటించి తనతమ్ముని యాథార్థ్యమును మందలింపఁదలఁ చినాఁడు.

కం. దాని విని బెదిరి లేచి మ
హానాదం బిది మనఃప్రియంబయ్యె మదీ
యానుజు శంఖధ్వానము,
దానగు నని యెఱిఁగి హృష్టతనుఁగుహుఁడగుచున్.

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురలంద్రోచి యేకాయనపథంబున నడ్డంబుగా శయనించి లాంగూలలీలాచాల నంబుఁజేసిన.

కం. గోలాంగూలోత్తము లాం
గూలస్ఫోటనరవంబు ఘోరంబై వా
చాలతఁజేసె నశేషమ్ము
గాలి భయంబంది గిరుగుహలకుం బాఱెన్.

వ. అయ్యపూర్వధ్వని విని భీముండు విస్మితుండయి చని కదళీషండమధ్యంబున నొక్కవిశాల శిలాతలంబునశయనించినవాని"

ఇందు భీముఁడు తనశంఖముతోఁ జేసిన పెద్దధ్వనిని పరిహసించువాఁడై హనుమంతుఁడు దానిని మించునట్లుగ తనలాంగూల లీలాచాలనంబు న ఘోరమైన రవమునుగల్పించి భీమునకు విస్మయము గల్పించి నాఁడు. తనపరిహాసమును లాంగూలధ్వనితోఁ దెల్పినాఁడు.

ఇదియే హనుమంతుఁడు సేసినకొంటెపని. ఇంతకంటె కొంటె తన మేమనఁగాఁ, దానేమియు నెఱుఁగనివానివలె నిద్రనటించుట. ఇందుచే భీముఁడు గర్వోన్నత్యముతో నిర్లక్ష్యముగా పెద్దధ్వనిచేసి వాని నమాయికముగ లేపఁబోవును.

సీ.

ఊర్ధ్వలాంగూలమత్యున్నత ధ్వజలీలఁ
గ్రాలుచునుండ నేకాంత యోగ

గీ. నిద్రనున్న ధర్మ నిర్మలు హనుమంతుఁ
జూచి పాండురాజసుతుడు వాని
నిద్రఁ జెఱుపఁగడఁగి నిజసత్త్వమేర్పడ,
సింహనాద మొప్పఁ జేసె డాసి.

వ. హనుమంతుఁడును మెల్లమెల్లన మేల్కని, జృంభసంభృత జలార్ద్రసంచల విలోచనుండగుచు ననాదరంబున నాతనింజూచి యిట్లనియె,

తే. అతిజరారోగభయమున నలసియొలసి
యొదిగి సుఖనిద్రమై నిట్టు లున్నవానిఁ
గడుమదంబున నేమియుఁ గరుణలేక,
యేలబోధించితయ్య నీవెఱిఁగి యెఱిఁగి.

వ. ఈసన్నివేశమందలి హాస్యరసము హనుమంతుని నటన యందును, మహాబలశాలియని గర్వించు భీమునిఁగూర్చియాతఁడు సూపిన యనాదరంబునందును గలదు. ఈసన్నివేశమును గాంచినచో

మనకు భీమునిగర్వాటోపమును గూర్చి చిరునవ్వుగల్గింపక యుండదు గదా ! నీవెవ్వఁడవనియడిగిన హనుమంతునకు గర్వముతో దాను క్షత్రియవీరుఁడనని తనవిషయమును కోతిగదాయని నిర్లక్ష్యముగా చెప్పినాఁడు భీముఁడు. హనుమంతుని యనాదరణను భీముఁడాతనినశక్తునిగా భావించి యధిక గర్వోన్నతుఁడై.

వ. ఏనిక్కడఁ గార్యార్థినై పోయెద, నాకుం దెరువీయని నాఁడు దొల్లిశతయోజన విస్తారంబయిన సముద్రంబు లంఘించిపోయిన హనుమంతునట్లు నిన్ను నీ పర్వతంబు లంఘించిపోదునననిన, హనుమంతుఁ డేమి కారణంబున సముద్రలంఘనంబుఁ జేసె;నీ వెఱుంగు దేనిం జెప్పుమని, తానేమియు నెఱుంగనివానివలె నడిగినాఁడు. భీముఁడాతఁడే హనుమంతుఁడని యెఱుఁగఁడుగదా. ఈవిధముగా మాటలలోఁ గూడ భీమునియజ్ఞానమునకు హనుమంతుఁడు విశేకినిఁగాపరిగణించి, యాతనిగర్వోన్నతికిఁ లోన చిరునవ్వు ననుభవించి బైటికిమాత్ర మాకథ తెల్పుమని భీము నడిగినాఁడు. ఈమాటలను ప్రక్కనుండి వినినచో మనకుఁగూడ చిరునవ్వు పుట్టునుగదా.భీముఁడు రామాయణ కథను క్లుప్తముగాఁ దెల్పిమఱియు

వ. ఏను హనుమంతునంతియు బలపరాక్రమములు గలవాఁడ నాపౌరుషం బుఁజూపుదునే యనిన నవ్యక్తహాస ముఖుండగుచు నన్నా యేను ముదిసినవాఁడ, లేవ నోపంబోయెదవేని నాతోఁకంబాయం ద్రోచి పొమ్మనిన, మెచ్చక తన వామకరంబున నెత్తంబోయి శక్యంబుగాక.

ఉ. ఏపునరెండు చేతులను నిమ్ముగఁబట్టి యమర్చి యెత్తఁగా
నోపక మ్రొగ్గితిల్లఁబడి యుద్గతఘర్మజలార్ద్రదేహుఁడై
కాపురుషుండుఁబోలె నిజగర్వము దక్కి యడంగియుండెఁ జిం
తాపరుఁడై వృకోదరుడుఁ దద్దయు లజ్జ నధోముఖంబుతోన్.

ఇందు హనుమంతుని వ్యాజనిందాపూర్వకచేష్టలు వాక్కులు గూడ దర్పోద్ధతుఁడైన భీముని చిన్నపఱుచుటకు చమత్కారముగ నుపయోగించి మృదువైన మందహాసమును గల్పించుచున్నవి. ఇది చక్కని సున్నితమైనహాస్యరసప్రయోగ విధానము హనుమంతుని యెదుటనా కుప్పిగంతులను సానుడిని సార్థపరచిన దీనన్ని వేశము. ఇట్టివి యాంధ్రవాఙ్మయమునఁ జాలయరుదు.

ఒకప్పుడు పరిహాసము చేయువారికి సంతోషదాయకమైనను పరిహాసింపఁ బడువారికి ప్రాణసంకటముగనుండును. ఇదిక్రియాపూర్వకమైనచో బాధయత్యధికము. కొందఱు పసిపిల్లలను గిల్లి వారేడ్చుచుండ తా మానందింతురు. కొందఱుబలవంతులు, బలహీనులనట్లే యేడిపించి తాముసంతోషింతురు. ఇది మోటుహాస్యము. ఇట్టివిభీముఁడు బాల్యక్రీడలలో ధార్తరాష్ట్రులపై ప్రయోగించి వేడుక ననుభవించెను—

కం. వదలక పెనఁగి పదుండ్రం
బదియేవుర నొక్కపెట్ట పట్టి ధరిత్రిం
జెదరఁ బడవైచి పవనజుఁ
డదయుండయి పీపులొలియ నందఱ నీడ్చున్.

సీ. కూడి జలక్రీడ లాడుచోఁ గడఁగి
యాధృతరాష్ట్రతనయుల నతులశక్తి
లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్క భుజమున
నెక్కించుకొని వారియుక్కడంగ
గ్రించఱ నీరిలో ముంచుచు నెత్తుచుఁ
గారించి తీరంబుచేరఁ బెట్టుఁ
గోరిఫలార్థులై వారల యెక్కిన
మ్రాఁకుల మొదళ్ళుల వీకఁబట్టి

గీ. వడిఁగదల్చుఁ బండ్లు దడఁబడ వారల
తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ
నిట్టిపాట గాడ్పు పట్టిచే దుశ్శాస,
నాదులెల్ల బాధితాత్ములైరి.

భీముఁడిట్టిచేష్టలన్నియు వారిబలముకంటెఁ దనబలమధికమని ప్రదర్శించుటకై మాత్రమే చిన్నతనములోఁ జేసెను. కాని యివి వారికి భీమునిపై ద్వేషమును గల్గించినవి. భీముఁడీపనులను పరిహాసము నకే యొనర్చెనుగాని ద్వేషముతోఁ జేయలేదు. కాని వాని పరిహాస పూర్వకచేష్టలకు వారు తట్టుకొనలేకపోయిరి. బలవంతుఁడు బలహీను లపై చేయు పరిహాసమిట్టిదేకదా ! ఇది క్రియాపూర్వకమైన మోటు పరిహాసము.

వాచాపూర్వకమైన మోటుపరిహాసము ననఁగా దెప్పుట. ద్రోణుఁడు ద్రుపదునిపైఁజూపిన విధమునందు గోచరించును. మాట లతో ద్రోణుఁడు ద్రుపదునిపై కసిదీసికొనును. సహాధ్యాయకుఁడైన ద్రుపదుఁడు రాజ్యగర్వమున ద్రోణుని తిరస్కరించినందులకు ప్రతీ కారముగా, తనశిష్యుఁడైన యర్జునునితో నతని జయింపఁజేసి,బంధించి తన యొద్దకు తీసికొని రాఁగ, ద్రోణుఁడు ద్రుపదునితో నిట్లనును.

కం. వీరెవ్వరయ్యా? ద్రుపద మ
హారాజులె? యిట్లు కృపణులయి పట్టుపడఁగ
వీరికి వలసెనె ? యహహా! మ
మహారాజ్యమదాంధకార మది వాసెనొకో ?

పురాణములందలి హాస్యరసపోషణ మీతీరుగ నడచినది. ఇఁక కావ్యప్రబంధములందలి హాస్యరసప్రతిపాదన మెట్లు జరిగినదో విచారింతము.

“కూచిమంచి తిమ్మకవిగారి కృతులలో మనకంతగా హాస్యము

దొరకదు. సరికదా వీరుహాస్యానికై చేసినప్రయత్నముగూడ చాలా చోట్ల విఫలప్రయత్నముగా కనిపిస్తుంద”ని ‘తెలుఁగుహాస్యరచనమున తెలుఁగుభాషా సమితివారి పారితోషిక గ్రహీతలగు శ్రీముట్నూరి సంగమేశంగారు వ్రాసిరి. కాని, కూచిమంచి తిమ్మనకవి వ్రాసిన శివలీలావిలాసమను కావ్యమున ద్వితీయాశ్వాసములో, గంగను వివాహమాడినందులకై కినిసి పార్వతి, కైలాసమునకుఁ దిరిగివచ్చిన శివుని నిష్ఠురోక్తులాడిన ఘట్టమును నావీరశైవాంధ్రవాఙ్మయమున నిరూపించినాను. ఈయాశ్వాసమునందలి పార్వతీపరమేశ్వరుల సంభాషణమును, గంగాగౌరుల సపత్నీకలహమును బహురమణీయముగను చమత్కారముగనున్నవి. ఇట్టిహృదయరంజకమైన కవిత్వమును కూచిమంచి తిమ్మనార్యుఁడు దనకావ్యములం దెక్కడను వ్రాయకపోవుటయే కాక, మిగిలిన యాంధ్రవాఙ్మయమునఁగూడ నిట్టిచమత్కారము బహుకాచిత్కముగనే యున్నది. ఈక్రిందిపద్యములు పార్వతీపరమేశ్వరుల సంభాషణమందలివి.

కం. పర్వేందువదన వినునే-
సర్వజ్ఞుఁడ, నహహ మేలు, సర్వజ్ఞునిపై
నుర్విని జను లెవ్వారు న
ఖర్వమతిం దలఁగి పోరుకద పరికింపన్.

గీ. నీలకంఠుఁడనే హరినీలవేణి
నీచెలిమి గోరుకొనివచ్చి నిలిచినాఁడ
నౌర! మే ల్నీలకంఠుఁడ వైతివేని,
కేక లిడుకొంచు వేగంబె గిరికిఁజనుము.

కం. క్రీడాకిరాతుఁడను నే
చేడియ యట్లైన నీవు జింకలు పులులున్

క్రోడంబులుగల యడవికిఁ
బోఁడిమితో వేఁటలాడఁబొమ్మా నెమ్మిన్.

సీ. అబలనే పశుపతి, నహహానీ వ్వైన,
నాలమందకు అంకెలడరఁ జనుము
స్థానుడణుఁ నేను కంజాక్షిరో యబ్బబ్బ
మోడు మాటాడుట చూడమెందుఁ.
బురహరుఁడనేను పొలఁతి నీవ్వైన
మావీట నుండక మరలిపొమ్మ
పన్నగధరుఁడను బడతినే నైనఁ
బడిగె లెత్తుచు నూళ్ళఁబడి తిరుగుము

గీ. భూతనాథుఁడ నేను పూఁబోడియట్టు
లేని నలపేత్రభూముల కేగుమిపుడె,
కుటిలకుంతల నేను మహానటుఁడ నట్టు
లైన ప్రభువులకడ కేగి యాడు మెలమి.

కం. చిగురాకుఁబోడి విను నే
నగవాసుఁడనట్టు లాదవినన్ జెక్కలతో
గగనమున కెగసి చెట్లకు.
జగతస్థితి నిలువఁబోక చనుమా వేగన్.

గీ. విను విరూపాక్షుఁడను నేను వనజవదన
అహహా బుధులు విరూపాక్షుఁడైనవానిఁ
జూడరాదని తలుచుగ నాడుచంద్ర,-
తొలఁగి వేంచేయుమిఁకఁ బెక్కుపలుకులేల?

సీ. ననబోఁడి నామాట నమ్మకుండితి వేనిఁ
జెనకి బెబ్బులివాతఁ జెయ్యినిడుద
గట్టిగాఁ బెనుపాముపట్టి యాడించెద
విషమైన మ్రింగెద వెరపులేక

కొరుగకవడి పెద్దగుడిసొచ్చి నిలిచెద
నవలీలగోపదం బంటుకొనెద
నంకిలిలేకుండ నగ్గి ధరించెదఁ
బట్టుగా ద్విజరాజుముట్టుకొనెద.

గీ. మఱియు నే బాసయైన నేమముగఁ జేతుఁ
గాన నిఁక నీతలఁపు లోనమాని మాని
నీశిరోమణి, నన్ను మన్నింపుమిప్పు,
డెలమి తోడుతఁగదియించి యేలుకొనుము.

ఈశ్వరుఁడు లోనికివచ్చినతర్వాత పార్వతి
వైవాహిక చిహ్నములఁజూచినపుడు వారిసంభాషణ మిది.

కం. పసుపును, కుంకుమ గంధము
నసమాంబక నీదుమేన నట్టివదలి యే
బిసరుహాముఖి యంటించెనొ
కసరక నాతోడనిపుడు గట్టిగ చెప్పుమా.

కం. వినుమానిని జనులందఱు
వెనకయ్యను బూజసేయ వెస నాతఁడు నన్
బెనఁగి కవుంగిట బొదవిన-
తనువున నివి యంటుకొనియెఁ దప్పే నాకున్.

కం. హాటకగిరి నీమొయి నీ
కాటుక యంటిన దదేమి కారణమబలా
కాటుక కాదిఁక లత్తుక
గాటపుగరళ ప్రభా వికాసము సుమ్మా.

గీ. కాలకంధర, నీమోవిగంటు లేమి,
కారణంబునఁ బొదవె నా గౌరి వినుము

మరునితోడ నెదిర్చి సంగర మొనర్చు,
తఱిని గోపించి కీరంబు కఱచెఁ జుమ్మి.

కం. పన్నగ రాజాంగద, నీ
కన్నులకెఱు పేలగలిగె గౌరీభక్తుల్
నన్నర్ధరాత్రివఱకున్,
నన్నన జాగరణ మునిచినం బొసగె నిటుల్.

పై రచనలోఁ జక్కని సున్నితమైన హాస్యము ప్రతిపాదింపఁ బడి, విద్యావంతులైన సున్నితహాస్య ప్రియులకు మాత్రము మంద హాసము జనింపఁజేయును. కాని పామరుల కది యంతనవ్వు పుట్టిం పదు ఏలన నిందలి హాస్యము శివుని వివిధనామములకు శ్లేషార్థము నవయవార్థమునుగల్పించి వానిప్రయోజనమును వివరించుచు ఖండిత నాయిక యైనపార్వతి, దక్షిణనాయకుఁడైనశివుని చమత్కారముగ నధిక్షేపించును. ఉత్తరభాగమున పార్వతిప్రశ్నించినవానికి శివుఁడన్య తోక్తులతో సమర్థించుకొనుట కూడ రమణీయముగనున్నవి శివుఁడు చేసిన బాసలు స్వభావసిద్ధములనే విశేషములుగా ప్రతిపాదింపఁబడి నవి. ఈసంభాషణమెంతయు హృదయరంజకమై యాంధ్రసారస్వ తమునకు వన్నెపెట్టుచున్నదని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. ఇట్లు చిత్రించుట కవిప్రతిభనుచాటును. ఇది చక్కని చమత్కృతితోఁ గూడి యుత్తమహాస్యమునకు హేతువగుచున్నది.

శివుఁడు మూఁడునేత్రములుగల్గియుండుట, పాము లాభరణ ముగ ధరించుట, పుర్రెలు హారముగా వేసికొనుట, పులితోలు ధరిం చుట,శరీరమునిండ భస్మముపూసికొనుట, శ్మశానమున నుండుట నాది భిక్షుకుఁడగుట నాట్యము చేయుట, జటాజూటముధరించుట, గంగనువ హించుట గరళముదినుట మొదలైన లక్షణములన్నియు వికృతాకార గుణాదులుగనుండి కవులకు హాస్యరసోత్పాదనము గల్గించుటకు హేతు

వ్రులైనవి. దేవతలలోనే కాదు మానవులలోఁ గూడ నిట్టివికృతలక్షణములు గలవారెవ్వరు లేకపోవుటచే హాస్యరసమున కాలంబనమైనాఁడి తఁడు. ఇందుచేతనే హిమవంతుఁడు పార్వతికోఁ దనభర్తయగు శివుని వికృతపరిస్థితిని దెల్పినట్లు శ్రీనాథుఁడిట్లు చిత్రించినాఁడు.

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁ దినఁజేరు
కొంగలు చెలఁగి కొంగొంగురనఁగ,
మెడనున్న పునుకల నిడుపేరు లొండొంటిఁ
బోరి బోరిఁదాకి బొణ్బొణుగురనఁగఁ
గట్టినపులితోలు కడకొంగుసోకి యా
బోతుతత్తడి చిట్టుబుట్టుమనఁగఁ
గడియింపుఃబాములు కకపాలలోనున్న
భూతి మైఁజలికిన బుస్సురనఁగఁ
తే. దమ్మపూఁజూలి పునుకకంచమ్ముసాచి,
దిట్టతనమున బిచ్చము దేహియనుచు
వాడవాడల భిక్షించు కూడుగాని
యిట్టిదివ్యాన్నములు మెచ్చునే శివుండు.

అని వేళాకోళము చేసినాఁడు హిమవంతుఁడు. ఇదియొక చమత్కారకల్పనము. ఈవిధముగనే దక్షుఁడుగూడ శివునిపరిహాసము చేసినట్లు నన్నెచోడుఁడు దనకుమారసంభవమున వర్ణించినాఁడు. ఇతరులు పరిహసించుట యెందులకు, మాయాబ్రహ్మచారిరూపమున తపస్సు చేయుచున్న పార్వతిని పరీక్షించుటకై తన్ను తానే పరిహసించుకొనినాఁడుశివుఁడు. ఈసన్నివేశమును నన్నెచోడకవి యిట్లు చిత్రించినాఁడు. పార్వతి శివుని కోరినదని వినఁగనే మాయావటుఁడు.

శా. ఎక్కెట్టా శివుఁగల్చెనంటినికమా, యాతన్వి దక్ష గల్వఁగా
నట్టుల్ మెచ్చక యున్నవేతపము సేయంజొచ్చెను న్నాతఁడే

ముట్టుంబోలినవానిఁగాఁ దలఁచియే మోహించె, దేశంబులోఁ
బుట్టుంబట్టలు మాలెనే నగజ యాభూతేశ్వరుంగల్వఁగా

చ వగవగ నద్రిరాజు హిమవంతుఁడు దండ్రి, సురాంగనాలికిన్
మిగిలిన పేర్మిమైఁదనరుమేనక దల్లి సురూపసంపదన్
జగములలోన మేలనఁగఁ జాలిన పార్వతి నీవు భిక్షుకుం
దగిలి తపంబుసేసెదఁటె దైన్యముసేసెదు దీన నింతకున్.

చ. జనులు విరుద్ధవేషియగు శంకరునేలకొ యిందుఁ డొందెఁ బా
వనతరుఁడంచుఁజిత్తముల వందఁగ దానిపయిం దిరిలోన శో
భనవగు నీవునాతపసిపాల్పడి మిక్కిలి వంతచేసెదో
యని,యనిశంబుఁ దద్దయుభయంపడుచున్నది లోకమెంతయున్

సీ. పుడమియై కదలక పడియుండు నెల్లచో
నెఱలేక నీరయి నెఱసి యుండు
ననలుఁడై డాసినఁ గొనికాలుచుండువా
తూలుఁడై కనుకనిఁదూలుచుండు
నాకాశమై చూడలేకుండుఁబ్రాలేయ
ధాముఁడై పెరుగుచుఁ దఱుగుచుండు,
భానుఁడై మిన్నులపైఁ బాఱుచుండ మ
హాత్ముఁడయ్యును బొడవడఁగియుండు.

గీ. నిన్నిరూపులందు నేరూపు నిజముగా
నెఱుఁగవచ్చు వీనికెల్లనొక్క
రూపుసేయ నెవ్వ రోపుదు రట్టి మూ
యావి నీకుఁదగులనగునె చేల.

శివుని యష్టవిధశరీరములను చమత్కరించి తన్నుతానే పరిహాసించు కొనినట్లుగా చోడకవి వర్ణించినాఁడు. శ్రీనాథుని వర్ణనవలె నిదియు

హృదయరంజకముగ నున్నది. ఈపరిహాసము చిరునవ్వు పుట్టింపక మానదు.

మఱియొకచోట నన్నెచోడకవి హాస్యరసమును చక్కగ ప్రతిపాదించినాఁడు. సామాన్యముగ హాస్యము శృంగారమునకును, భయానకము వీరమునకును సంబంధించిన రసములుగా ప్రతిపాదింపఁబడును. వీరశృంగారములు వైరిరసములుగా గూడ పరిగణింపఁబడుటచే,వానికి సంబంధించినహాస్య భయానకరసములుగూడ వైరి రసములని భావించుటలో దోషములేదు. అట్లయ్యు నన్నెచోడకవి యీ రెండురసములకుఁ జక్కని పొత్తును గూర్చి చమత్కారముగా వర్ణించినాఁడు, దక్షాధ్వరధ్వంసమున గణాధీశ్వరులు దిక్పాలురను,బ్రహ్మ విష్ణులను గూడ దండింపఁబూనఁగ వారు భయభ్రాంతులై తొట్రుపాటుతోఁ దమవాహనములను గూడ సరిగా పరిగ్రహింపక విపరీతముగ పలాయితులైన విధానము హాస్యము గల్గించును.

ఆ. వాహనమ్మునెక్కవచ్చియు భయమున
వడకి నేలఁబడ్డ వనజఁగర్భుఁ
గమిచికొని మరాళకము వాఱెఁ జెందమ్మి
గఱచికొని రయమునఁ బఱచినట్లు.

ఆ. గరుడి నడుము మెడయుఁగాలును గేలును
నిఱికికొనుచు జక్రి వెఱచి పఱచె
ఘర్మజలము లొడల గ్రమ్మంగ వర్షేంద్ర
చాపజలదభాతిఁ జదలఁ బొదల.

ఆ. వ్రేఁటకాఱుముట్టి వెనుకొనఁగా శ్వేత
నగము చరికిఁ దారునమిలివోలె
నభ్రగజము మీఁది కాసహస్రాక్షుండు
వ్రాకి పాఱెఁ బ్రమథరాజి యార్వ.

ఆ. ఇక్కుముట్టి చక్కనెక్కఁగ మఱచి సం
భ్రమముఁబొంది పిఱుఁదఁ బ్రమథగణము
లార్వఁ బోతుమీఁద నడ్డంబువడి యుప్పుఁ
బెటికవోలె వెఱచిఁపఱచె జముఁడు.

తే. ఉరుతరాబ్ధీశుఁడయ్యును నోడిపాఱె
వరుణుఁ డలుకుచు నోడిక వాగువోలె
గలుము లెడ్రైసనేమియు నిలువ వనుటఁ
దగుభయాతురుఁడై నోర తడియులేక.

క. తనయెక్కువమానిసిఁదా
ననయము నెక్కంగ మఱచి యాతనిఁ దనమూఁ
పున నిడికొనిపఱచె భయం
బున ధనపతి తన్నుఁబిఱుఁద భూతము లార్వన్.

బ్రహ్మ విష్ణుదిక్పాలకులే యిట్లు భయమంది పాఱిపోయిరనుటయద్భుతము. భయాతురుల తొట్రుపాటు, వడకు, చెమటలు పట్టుట, తొందర, పిరికితనము మొదలైన వింద వ్యక్తీకరింపఁబడినవి. అబ్ధీశుఁడయ్యును వరణుఁడు భయముచే నోటతడికూడ లేక పాఱిపోయెననుట చమత్కారము. భయవేగమునఁ దానెక్కవలసిన వాహనము నేతన మీఁదవేసికొని పాఱిపోయెననుట హాస్యకరము. గొప్ప పరాక్రమవంతులే భయముతో కింకర్తవ్యతామూఢులై కాందిశీకులైరని వర్ణించుటలో భయానకరసమును, వారి భయాతురతలో విపరీతముగ వర్తించిరని తెలుపుటలో హాస్యరసమును చక్కగ మిళితముచేయఁబడినవి. భయావేశమున నొకటి చేయఁబోయి వేఱొకటిచేయుట సహజము. అది ప్రేక్షకులకు నవ్వుగల్గించునుకదా దానితోపాటు వారిస్థితికి జాలి గూడ మనకుఁ గల్గును.

ఇంకొకవిధమైన హాస్యము శంకరకవిరచితహరిశ్చంద్రోపాఖ్యానమునఁ గాంచనగును ఇంద్రసభలో నిందుఁడు త్రిలోకసంచారులైన మహర్షులుండఁగా, ప్రాణాపాయకరమైన పరిస్థితిలోఁ గూడ సత్యమును దప్పని వాఁడెవఁడని ప్రశ్నింపఁగా నందఱు సందేహించి మాటాడ వెఱచిరట. ఆసందర్భమున మహర్షుల ప్రవర్తన యిట్లు వర్ణింపఁబడినది.

ఉ. ఊరక మూఁగలోయనఁగనుండె నగస్త్య పులస్త్యగౌతముల్
ధారుణి వ్రాయుచుండె జమదగ్ని, పరాశరమౌని యేమియున్
నోరుమెదల్పఁడయ్యె ఋష్యవనుండు విచారము సిగ్గుఁబర్వఁగా
నేరకయుండె మార్కలుక నింగిఁగనుంగొనుచుండె నత్రియున్

సీ. కశ్యపువదనంబుఁ గన్గొనె జాబాలి.
యతఁడు నారదునిదేహంబు గోఁకె
నతఁడు శాండిల్యుని నమరేంద్రు మాటకు
నుత్తరం బిమ్మని యొత్తిపలికె
నతఁడు భరద్వాజు నల్లన యంగుళీ
సంజ్ఞను బలుమాఱు సన్నఁజేసె
నతఁడు మాండవ్యమహాముని ప్రవరుని
గనుగీటె నీవెఱుంగవె యటంచు.

గీ. నివ్విధంబున సకల ఋషీశ్వరులను
నీవు నీవని ప్రతివాక్య నిర్ణయంబు
గాన కన్యోన్యవదన పంకజసమీక్ష
ణములు సేయుచునుండిరి భ్రమసినట్లు.

ఇందు ఋషులు దమ యజ్ఞానమును బయటఁబెట్టుటకు వెఱచి యొకరి నొకరు నీవుచెప్పు నీవుచెప్పుమని పసిపిల్లలవలె సంజ్ఞలతో ప్రవర్తించి చూచువారలకు హాస్యమును గల్గించిరి. సర్వజ్ఞులై త్రిలోకసంచారులయి త్రికాలజ్ఞులై యిట్లు పామరులవలె రహస్యముగా

ప్రవర్తించుటలో హాస్యరసము ప్రతిపాదింపఁబడినది.

ఈకావ్యముననే చంద్రమతి తనభర్తయగు హరిశ్చంద్రునిచే నమ్మఁబడి కాలకౌశికునివెంట నతని మూటను మోయుచు పోవుచుండఁగా పౌరభామినులు లాబ్రాహ్మణుని నిందించిరి. అంతనా తఁడుదన దండంబున నావనితలను గొట్టెను. అప్పుడాస్త్రీలచే ప్రేరేపింపఁబడిన బ్రహ్మచారులు గూడి యాకాలకౌశికుని,

స. కరయష్టిదండ మొక్కఁడు దీసి పోవైచె
నంజ కొక్కఁడు సిగగుంజి యడిచె
నొడసి గడ్డముపట్టి యొక్కఁ డుయ్యాలలూఁగెఁ
జెదరక దోవతిఁ జించె నొకఁడు
తవిలి యొక్కఁడు జన్నిదంబులన్నియుఁ దుంచె
వెస నాతపత్రంబు విఱిచె నొకఁడు
కినిసి యొక్కఁడు పుచ్చుకొనియెఁ బంచాంగంబు
వెలికలఁ బడఁదోఁచె నలుక నొకఁడు
గీ. ఓలిఁ గుక్కల నుసికొల్పె నొక్కరుండు
పెనఁగి యొక్కఁడు పట్టెవర్ధనము నొకె
నుమిసెఁ దుప్పున మొగముపై నొక్కరుండు
బెట్టు నవ్వుచు దాడులఁ గొట్టె నొకఁడు.

ఇట్టిప్రాయశ్చిత్తము చేయుట తుంటరిపనియే యైనను, శతమర్కటః బ్రహ్మచారీ యనఁబడువారలు చేయుట సహజమే. ఇది వారలకు వినోదము గూర్చునది. వారిచేష్టలకు మితి లేదు. ఇట్టివి చూచువారలకు నవ్వు పుట్టింపకమానవు కదా. ఇదియొకవిధమైన హాస్యప్రతిపాదనము. ఈహాస్యము భీమసేనుఁడు బాల్యములో ధార్తరాష్ట్రులను పీడించిన విధముతోఁ బోల్పఁదగినదే. మఱియొకవైపు గోపబాలకులు చల్దులు భుజించు చేష్టలతోడను. రామాయణమందలి కోతుల కొంటెపనుల

తోడను బోల్పఁదగినది. అల్లరిలో హాస్య మెంత యుండునో వీనివలన ద్యోతకమగును.

ఇఁక కళాపూర్ణోదయమందలి సుగాత్రీశాలీనుల కథాఘట్ట మున మఱియొకవిధమైన హాస్యము పోషింపఁబడినది ఇది చాలసున్నిత మైనది. ఎవరికి వారు చదువుకొని యానందింపఁదగినది. స్త్రీపురుషు లందఱుగూడ దీనిని చదివి ముసి ముసి నవ్వు లనుభవింపక యుండ లేరు. సుగాత్రీశాలీనుల గర్భాదానపుగదిలో జరిగిన యనన్యసామాన్య విషయము, ఇది 'నభూతో నభవిష్యతి' కూడ నేమొ? ఆముచ్చటయిది:

సీ. ఆతండు దనకడ కాకన్యప్రథమసం
గమవేళఁ గడు నలంకారకలితఁ

గీ. జేసి యనిపి దానిచెలు లింతనంతటఁ
బొంచి యుండఁ దద్విభూషణాది
మహిమఁ దలఁకి పట్ట మదిని సంకోచించెఁ
దరుణి యుండి యుండి తిరిగిపోయె.

ఉ పోయినఁ దద్విధం బపుడు బోంట్లు తదంబకుఁ జెప్పి భూమిలో
నేయెడ లేనిచంద మిది యేమి నిమిత్తమొ యంచు, మంచిలేఁ
బ్రాయపువాఁడు గల్గె, భళిరా యితఁ డంచు నెపైన నేఁటికిన్
బోయెనొ కాక, యెల్లి తమపోకలు చూడమ యంచు నవ్వినన్.

కం. ఆయన వినఁ బ్రెదరు సుఁ
డీ! యిట్లు గయాళులార, డిగవిడుతురు లా
జ్జాయుతులు సర్వమును దము
నేయెడ హాస్యాస్పదం బొకింత వొరసినన్.

తే. అని పలికి రెండుమూఁడునా ళ్ళట్లు యనిపె
నల్లునొద్దకుఁ బుత్రిక నపు డతండు

నాఁడె నేభావమునఁ జూచె నట్లే చూచె
పట్టిరాకపోక లానర్చె వానిసతియు.

ఈసన్ని వేశమందలి సంభాషణము లన్ని భావగర్భితముగ నడచినవి. భూమిలో నేయెడ లేని చందమిదిʼఁట. ఏమినిమిత్తమొʼఁట. నిమిత్త మూహింపలేకున్నారు. ముసలివాఁడు గాఁడు మంచి లేఁబ్రాయపు వాఁడు గద్దె భళిరా యితఁడంచు,చేసిన మెచ్చు వక్రోక్తి లోనున్నది. నపుంసకుఁడేమోయని వా రనుమానపడి నవ్వసాగిరి. అంత సుగాత్రి 'ఆయనఁ బిన బ్రేలెదరు సుఁడీ యిట్లు గమాళులారా' యని చెలికత్తెల వోరుమూఁయ జూచినది. ఈసంఘటనలోని యాథార్థ్యమును 'రండా గర్భమువలె' బైటఁబెట్టుకొనలేరు. దాఁచుకొనలేరు. బైటఁబెట్టితే నామోషి, లజ్జ దాచుతే ఎంతకాలం. ముదిరిపోతుంది. కాన రహస్యములు, గుసగుస సాగినవి.

వ. అంత లజ్జావతికిఁ దజ్జననియనుమతిఁబ్రియవయస్య లేకాంతబున నిట్లనిరి.

ఆ. పొలఁతి యాలిమగలి పోఁడుము లేమియు
గలిగినట్టి చొప్పుగానరాదు
మీ తెలుంగు చూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్ప.

క. కాంతుఁడు చితజ్ఞుఁడైనను
గాంతకు సితివడఁ జెల్లుఁగాక కటకటా!
కాంతుఁడు సితిబ్బికాఁడై
కాంతయు నష్టైన నెట్లు కాపుర మింకన్.

ఇట్లని మొదట శాలీనుని మాత్రముఁగూర్చి పరిహాసించిన చెలు లిప్పుడు సుగాత్రిఁగూడ గలిపి, మేల్మేలు దంపతులిరువురు వివేకులేమి చెప్ప మని మేలమాడఁదొడఁగిరి, ఇంతటిపచ్చిశృంగారవిషయమైనను,

పరిహాసమైనను సశ్లీలముమాత్రముచొరఁబడలేదు. ఇందులో గొప్పవిష యమిది. తర్వాత చెలికత్తెలు సుగాత్రికి చెప్పి భర్తను శయ్యాగార ములో వశ్యముచేసికొను నుపాయ మిట్లుచెప్పిరి.

ఆ. నలినవదన యెన్నినాళ్లైనఁ జిన్నికూఁ
తురవు గావు నీవు తొడఁగి పతికిఁ
దగినసేవసేయ కగునె యూరకయుండ
నాతఁ డేమియు ననఁ డమచు నిట్లు.

క. మగవాఁడు భాగ్యవంతుఁడు
మగువకు నొప్పగునె యిట్లు మానపుబిగి గ
ట్టిగఁ దాల్పఁ దనంతన యూ
డిగ మిటునటు సేయ నతని డెందము గరగున్.

క. గారామునఁదోడ్తో డన, రారమ్మనఁ డనుచు మగిడి రా నేటికిఁ గ న్నారమ్మతోడి బాగా, లీరాదో యూఁకుమడచి యీరాదో చెలీ.

ఈవిధముగ నెన్నో యుపాయములు చెప్పి బోధించినారు చెలులు. ఊడిగ మిటునటు సేయ నతని డెందముకరగునట. ఇక్కడ ఇటునటు నన గా నేమొ? కాంతుఁడుచితజ్ఞుడైనను గాంతకు సిగ్గువడఁజెల్లఁగాక యని మొదట చెలులు ప్రారంభించినవారు, చివరకు సుగాత్రినే సిగ్గు విడచి భర్తకుపచారము నటునిటు సేయుచో నతని డెందము గరుగున్ అని బోధించిరి. బంగారువంటిపాయము సంగతియే యకట! రిత్తశయ్యకు నొసఁగక అని వారియుపదేశము. అంత

క. అన విని యాపెడమాటల, నను నేటికిఁ జంపెదరు వినక సైపవు నా కనిసిగ్గునఁబలుకుచు నేఁ, డొనరిచిచూచెనుదదీయయుక్తుల తెఱఁగున్.

వ. చూచి యెందును ఫలంబుగానక, పోయెను. ఇదంతయునెఱింగి యత్త "ఇతనిపోడిమి గంటిమ వట్టిగొడ్డుతాకట్టితఁడెంతయున్న నినుగాఱి యపెట్టుట" యని నిందించినది. మధురమైన హాస్యమయ శృంగార

సన్నివేశ మిది. ఈసున్నితహాస్యము పైనఁజూపిన సౌగంధికాపహరణ మందలి హాస్యముతో సమానమైనది. అది వీరరసప్రధానమైనది. ఇది శృంగారరసము ప్రధానమైనది. ఇదియే భేదము. కాని ముట్నూరి సంగమేశంగారు పింగళి సూరనదృష్టిలో హాస్యం లేదఁట, అనివ్రాసినారు ప్రభావతీ ప్రద్యుమ్నమున ముచ్చులఘట్టములోఁ గాంచఁగల్గినంత హాస్యముగూడ నీసుగాత్రీశాలీనుల ఘట్టములో నేలచూడలేక పోయిరో యూహింప నలవికాకున్నది. సున్నితహాస్యము స్థూలహాస్యమువలె స్పష్టముగను తేలికగను ద్యోతకముగాదు ఇది శ్రేష్ఠమైనది. అనుభవింప నేర్చినవారికే యిట్టిది గోచరమగును. లేనివారికి లేదు. హాస్యలక్షణము నిర్వచించు టంత తేలిక గాదు హాస్యలక్ష్యముతో సమన్వయించుట. హాస్యానుభవముదృష్టిభేదమును బట్టిగూడ నుండును.

పురాణములందలి హాస్యమప్రయత్నపూర్వకమై స్వభావసిద్ధమై యుండును. ఇందు ధీరులైనపాత్రలుగూడ హాస్యమునకు పాత్రులగుదురు. ఉ. భీమదుర్యోధనాదులనుగూర్చి వెనుక పరిశీలింపఁబడినది. దేవతలు ఋషులును సామాన్యముగ నిందు హాస్యభాజనులు గాలేదు. ఇంక కావ్యప్రబంధములలో దేవతలు ఋషులుగూడ హాస్యపాత్రలైరి. ఇందలిహాస్యము కొంత ప్రయత్నపూర్వకమై కృత్రిమముగా గూడఁ గనఁబడును. నవీనయుగమున వచనగ్రంథములందలి హాస్యము కేవలము కల్పితమై, ప్రయత్నపూర్వకముగ నుండి, హాస్యపాత్రలవివేకులు, మూర్ఖులుగా మాత్రమే యుందురు. ఇట్టి హాస్యము కేవలము లఘువైనది. ఉ. బారిష్టరుపార్వతీశము గణపతి, కాంతం మొదలైనవారు. పురాణములందలి హాస్యములు గంభీరోదాత్తములైన. వానిలో వైవిధ్యముగూడ విశేషమే. నవ్వులహాస్యములో నొకటేవిధమైన తేలికహాస్యముండును ఆద్యంతము గ్రంథము హాస్యప్రధానముగా నుండవలె ననిన యట్లుండకతప్పదు ఇందుచేతనే మన ప్రాచీను లట్టిహాస్యరసప్రధాన గ్రంథరచనకై ప్రయత్నింపకపోవుట.

# రవీంద్రుఁడు : భారతీయసంస్కృతి

శ్రీ తణికెళ్ల వీరభద్రుఁడు, ఎమ్. ఏ.

**గురుదేవుఁడని** భారత దేశమంతటను గౌరవింపఁబడు రవీంద్రనాథుఁడు ఈశతాబ్దమందలి కవులలో నుత్తముఁడు; భగవద్భక్తుఁడు; దేశాభిమాని; విశాలహృదయుఁడు; పూర్వసంస్కృతియందభిరుచికలవాఁడు. అతనికి మనయార్షవిజ్ఞానమందును గాఢమగుభక్తి. 'సాధనా' అనుపుస్తకమును ప్రచురించుచు పీఠికలో వ్రాసినమాట లివి.

ఈగ్రంథకర్త ఉపనిషద్వాక్యములను నిత్యారాధనయందు పఠించుచుండు కుటుంబములలోఁ బెరిగినవాఁడు. అది కాక లౌకిక వ్యవహారముల నశ్రద్ధచేయకపోయినను సదా భగవత్సన్నిధిని కాలక్షేపము చేయుచుండిన తన తండ్రియొక్క జీవితమును ఎల్ల వేళలయందును కన్నులయెదుట నుంచికొనినవాఁడు. కావున మన ప్రాచీనార్ష సారస్వతమందును మన నేఁటినిత్య జీవితమందును, ఏసంస్కృతి దృశ్యమగుచున్నదో దానిని పాశ్చాత్యులు ఈవ్యాసములవలన గ్రహించుట కవకాశము కలుగఁగలదని తలఁచుచున్నాను.

చిన్నతనమందు 'వాల్మీకిప్రతిభా' అను నాటకమును రచించినట్లును, ఖేలనసమయమున తాను వాల్మీకి పాత్రను ధరించినట్లును, స్వీయ చరిత్రమందు వ్రాసియున్నాఁడు. మన రామాయణమును మహాభారతమును భవభూతి కాళిదాసుల రూపకములును, ఎట్టిమహాకావ్యములో అనేకప్రదేశములందుఁ జెప్పియున్నాఁడు. అతనిచే వంగభాషలో తొలుత వ్రాయఁబడి, పిమ్మట యదునాథసర్కారుచే ఆంగ్లములోని కనువదింపఁబడిన శకుంతలనుగూర్చినవ్యాసము అతిసుందరమైయున్నది. అతనికి గీతగోవిందమును రచించిన జయదేవునియెడల అభిమానము మిక్కుటము. తాను 12 సంవత్సరముల ప్రాయము కలవాఁడై యుండినపుడు జయదేవుని అష్టపదులు ఆనందపరవశుని జేసినవఁట.

By Curticy of All India Radio, Hyderabad.

నేనెన్నిసార్లు గీతగోవిందమును జదివితినో చెప్పఁజాలను. ఒక చరణ మిప్పటికిని చక్కగా జ్ఞాపకమున్నది.

నిభృతనికుంజగృహంగతయా నిశి రహసి నిలీయ వసంతం
చకిత విలోకిత సకలదిశారతిరభస భరేణ హసంతం.

ఆపిన్నవయసున ఈకీర్తనలోని అర్థమును గ్రహింపలేదు కాని ఆపదముల మాధుర్యమును వానిగమనికలోని స్వారస్యమును అత్యంతానందమును గలిగించినవఁట గురుదేవునికి గీర్వాణభాషయం దెట్టి భక్తికలదో చూపుటకు మఱియొక ఉదాహరణము క్రీ 1940 సంవత్సరమున రవీంద్రుని గౌరవార్థమై శాంతినికేతనమునఆక్సుఫర్డువిశ్వవిద్యాలయమువారిపక్షమునఒకప్రత్యేకస్నాతకసభ Special Convocation జరుపఁబడెను. దానికి పండితరాధాకృష్ణను బాబు రామానందచటర్జీ మొదలగు ప్రముఖులు విచ్చేసియుండిరి. కలాప్రపూర్ణ (Doctor of Literature) అనుబిరుదమును రవీద్రనాథకవికీయుమనికోరుచు గౌ॥ హెండర్సను (The Horible A. G. R. Henderson) తన దేశచారము ననుసరించి యూరపుఖండమందలి విద్వద్భాషయగు ల్యాటిన్ (Latiu) లో భాషణమును సాగించెను. దీనికి ప్రత్యుత్తరముగా గురుదేవుఁడు మనప్రాచీన భాషయగు సంస్కృతములో తనయంగీకారమును తెలియఁజేసెను. అప్పుడు అధ్యక్షత వహించిన భారత దేశ ప్రధానన్యాయమూర్తి (Sir Maurice Gwyer) సంతసించి, సంస్కృత మెట్టి యుత్కృష్టభాషయయియున్నదో ఈవిధమున సూచించెను.

ఏభాషయందు విశ్వకళాపరిషత్తు వారీనాఁడు భాషణము చేసిరో నే నేభాషనిప్పుడు మాటలాడుచున్నానో, ఈభాషలన్నింటికిని తల్లియగు సనాతనవాణిలో నీవిచ్చినట్టిదియు సరసమగు పదములతోఁ గూడినట్టిదియునగు అంగీకారమును (ఆక్సుఫర్డు) విశ్వవిద్యాలయమువారికి తప్పక అందఁజేయఁగలను.

మాతృభాషయగు బంగాళీయెడలను గురుదేవునకిట్టి పట్టు దలయే కలదు. ఒక్కటితప్ప అతనిరచన లన్నియు ముందు స్వభాషలో వ్రాయబడినవి. క్రీ.1937 సంవత్సరమున కలకత్తా విశ్వవిద్యాలయమువారు స్నాతకోపన్యాము నీయుమని కోరినపుడు గురుదేవుఁడు ఆంగ్లములో గొప్పపండితుడయ్యు. వంగభాషలో నుపన్యసించెను. ఆవిద్యాలయము స్థాపితమై నాటికి ఎనుబది సంవత్సరములైనది. కాని యాంగ్లేతరభాషలో స్నాతకోపన్యాస మీయఁబడుట కిదియే మొదటిసారి.

రవీంద్రనాథుని కావ్యములలో నుత్తమమైనదని యెంచఁబడు గీతాంజలి పూర్వసంస్కృతికిఁ జెందినదే. ఇదికాక హిందీ బంగాళీ భాషలో రచింపఁబడిన వైష్ణవగీతములను పెక్కులను ఆతఁడాంగ్లీకరించియున్నాఁడు. కబీరుదాసు పాడిన కీర్తనలలో నూరింటిని ఆంగ్ల భాషలోనికి మార్చి, One Hundred Poems of Kabir అను పేరిట ప్రచురించెను. మనపురాణగాథల నాధారముగాఁ జేసికొని, "ఊర్వసి" "కచదేవయానులు," మొదలగు కీర్తనలను రచించెను శ్రీమద్భాగవతమందలి బాలకృష్ణునిగూర్చి గీతములు వ్రాసి, అతనియెడ తన భక్త్యుత్సాహముల నీవిధముగా వర్ణించియున్నాఁడు

> బృందావనమందు గోపబాలకుఁడనై ముందెన్నఁడైనను పుట్టుటకు నా కవకాశ ముండెనా ఉచ్చదశయం దుంటిమను గర్వముతోనుండిన మాకుటుంబములోని విద్యాధనమంతయు నశించి పోయినను విచారింపను.
>
> ఆ పసులకాపరి, వటవృక్షమునీడ, గోవులను మేపుట, పువ్వులను దండలుగా గుచ్చుట, యమునానదిలో నీఁతకొట్టుట తెల్లవాఱఁగనే గొల్లభామలు పాలుపితుకువేళ తోడిబాలురను నిదురనుండి లేపుట. సోదరులారా! నమ్ముఁడు. ఈనవవంగదేశమున, ఈనూతన యుగమున నాయకుఁడనై యుండవలెనను తలంపెంతమాత్రమును నాకు లేదు,

ఎక్కడ గోపకాంతలు పాలుపెరుగులను కవ్వముతోఁ జిలికి వెన్న తీయు చుందురో, అట్టిగ్రామమందు అశోకవృక్షపునీడను పుట్టఁ గలిగితినా నా కదియే చాలును!

గురుదేవునికి సంగీతమందు మిక్కుటమగు ప్రీతి. ముఖ్యముగా వీణపై ప్రత్యేకాభిమానము. హార్మోనియము మనగానకళకు శనివంటి దని చెప్పియున్నాఁడు. (The harmonium is the bane of Indian music) ప్రకృతి సౌందర్యముకల మన హిమాలయము, గంగానది మొదలగు వానియందుఁ జెప్పనలవికానియుత్సాహము. వనభూము లలో నివసించు మనఋషు లేర్పాటు చేసికొనిన ఆశ్రమము లన, మిక్కిలి ప్రీతి. అవి మనశ్శాంతి నిచ్చుటయేకాక మనుష్యునకును ప్రకృతికిని గల యవినాభావసంబంధమును జూపుచు, ఏకత్వమును (unity) బోధించునని పదేపదే సూచించియున్నాఁడు. విగ్రహారాధనమును గూర్చి అతఁడేమి అభిప్రాయముకలవాఁడో, "గోరా" లోని సుచరిత గోరాలకు జరిగిన సంభాషణము వెల్లడిచేయఁగలదు. రవీంద్రుఁడు సంఘసంస్కర్త. మతాచారముల విషయములో బ్రాహ్మ సామాజికుఁడు. అయినను మనప్రాచీనసంప్రదాయమునుగూర్చి యెక్కడ నెట్టి సాను భూతిని ప్రదర్శించినాఁడో చూడుఁడు.

ప్రశ్న:—అనఁగా దేశకాలపరిమితులకు లోఁబడు ఆకారము గల విగ్రహమందు నీకు విశ్వాస మున్నదన్నమాట.

ఉత్తరము:—ఎవ్వఁడైనను దురూహ్యమగు దానిరహస్యమును తెలిసికొనినాఁడా?

ప్రశ్న :—అయితే, ఆకారముగల పదార్థము పరిమితికలదై దేశకాలములకు లొంగియుండును కదా ?

ఉత్తరము:—ప్రాణికోటి సహాయ్యార్థమై పరిమితిలేనిది పరిమితి కలదైనది. .........(కవి) భావము పదరూపమును దాల్చినపుడే పరిపూర్ణత్వమును బొందినట్లు నిరాకారమగునది ఆకారమును స్వీకరించినపుడే పరిపూర్ణతనుబొందును. (The formless is fulfilled in forms just as thought is perfected in words.)

రెండవమాట:—

కవిత్వము, కళ, భౌతికశాస్త్రము, దేశచరిత్ర మొదలగు వానియందు, ఊహా కల్పనాశక్తి (Imagination): దీని కవకాశమున్నట్లే, భగవదారాధనయందును ఉన్నదని నమ్మెను.మనకృష్ణుఁడును రాధయు మనశివుఁడును దుర్గయు ఎవ్వరని తలఁచితివి'మనజాతికి మనపెద్దలు ప్రాచీనకాలమునుండియేభక్తిని ఏధర్మమునుఏతత్త్వమును బోధించియున్నారో వానిస్వరూపమే ఈదంపతులని విశ్వసింపుము.

ఈభావమునే ఈమహాకవి గీతాంజలి యందుఁగూడ సూక్ష్మముగాఁ దెలిపియున్నాఁడు.

నిరాకారమగు దివ్యపదార్థ మేదికలదో, దానిని సంపాదించుటకే ఆకారములతోఁగూడిన ప్రపంచమును నేను వెదకుచుంటుట. దివ్యమగు ముత్యము దొరకునేమో యను ఆశచేతనే. అగాధమగు జలనిధిలో దిగి లోతునకుఁబోవుట.(I dive down into the depth of the Ocean of forms, hoping to pain the per'e:t pearl of the formless)

స్త్రీలు, సంఘమందు వారిస్థానము, దీనినిగూర్చి గురుదేవుని అభిప్రాయ మెటులున్నదో చూతుఁడు. తాను చదువునిమిత్తమై ఇంగ్లాండులో నుండినదినములలో తల్లివలె కొంతకాలము తనకు సంరక్షణచేసిన నారీమణి (Mrs. Scott) నుగూర్చి వ్రాయుచు ఆమె సుగుణములను వర్ణించుచు ఆమె చేయుకార్యములన్నింటిలోను పతిసేవయే ముఖ్యముగానుండెననియు స్త్రీయొక్క ప్రేమానురాగము ల

పరిపక్వమై పరిపూర్ణత్వమును బొందుటకు నిదర్శన మేదియన భర్త యెడల భక్తిగలిగియుండుటయేయని నొక్కి వక్కాణించియున్నాడు. కానినాగరికత హెచ్చిన యీదినములలో స్త్రీలుకొందఱు తాముస్త్రీలమైతిమే యని విచారించుటయు స్త్రీకి సహజమగు గుణములను జూచి లజ్జపడుటయు సంభవించుచున్నది. (Women are feeling ashamed of their own womanliness.) ఒకకథయందు (The Wreck) ఇట్లు వర్ణింపఁబడినది నలినాక్షుని సతీమణియగు కమల ఒకనాఁడు భర్త బీరువా తీయఁగా పాత్రేశ్వరునిపాదుకలను జూచెనఁట. ఆమె వానిని పైటచెఱఁగున తీసిఒకసారిశిరముపై నుంచికొనెనఁట. అంతట వానినిముద్దాడి తనచీరకొంగుతో తుడిచి శుభ్రముచేసినదఁట! ఈవిధముగ నీయఁబడిన గీతములలోని భావములనుబట్టి భారతవనితల ప్రత్యేకత యెట్టిదో విశదమగును.

ఓసుందరాంగీ నీనేత్రములనుండి ఒక్కచూపును విసరితివా ప్రపంచమండలి కవులగీతములలోని సారమును వానిధనమంతయును నీ వపహరింపఁగలవు.

ప్రపంచమంతటిలోను ఘనులమని గర్వించి ఉన్మత్తులై యున్న వారందఱును తమతమ శిరములను వంచి నీపాదములకడ నుంచునట్లు చేయఁగలవు !

నీబాహువు లెట్టివనఁ తాకినంతమాత్రమున రాజశేఖరికి మెఱుఁగు పెట్టఁగలవు !

కాని వానిని ఇంటిలోనిబూడిదదులుపుటకును(చీపురుకట్టతో) నీకుటీరమును ఊడ్చి పరిశుభ్రముచేయుటకును నీవుపయోగించు సమయమున వానిని నేను జూచితినా భక్తిభీత్యాశ్చర్యములలో మునిఁగి పోవుదునుసుమీ !

With a glance of your eyes you could plunder all th wealth of songs struck from poets' harps, fair woman!

... ... ... ... ... ... ... ... ...

You could humble at your feet the proudest heads in th world

... ... ... ... ... ... ...

The perfection of your arms would add glory to kingly splendour with their speech.

But you use them to sweep away the dust, and to make clean your humble home, therefore I am filled with awe.

# మార్గదేశీ కవిత్వములు;

డాక్టరు-దివాకర్ల వెంకటావధాని.

సంగీతశాస్త్రమందు సంగీతము మార్గము దేశి యని యిరు తెఱఁగులుగా విభజింపఁబడియున్నది. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమున బ్రహ్మాదులచే మార్గితమై యీశ్వరసమక్షమున భరతాదులచేఁ బ్రయోగింపఁబడినది మార్గ మనియు, నాయా దేశములందు జనులకు హృదయరంజక మగునది దేశి యనియుఁ జెప్పఁబడినది. అందే శార్ఙ్గదేవుఁడు-

యేషాం శ్రుతిస్వరగ్రామ జాత్యాది నియమో నహి
నానా దేశగతి చ్ఛాయా దేశీరాగాస్తు తే మతాః
కామచార ప్రవర్తిత్వం దేశీరాగస్యలక్షణం
నియమేతు సతి తత్రి మార్గత్వ మనులక్షితమ్.

అని మార్గ దేశీరాగముల భేదమును వివరించియున్నాఁడు. దీనినిబట్టి నియమరహితమైన కామచార ప్రవర్తిత్వమును దేశానుగుణ ప్రవృత్తియు దేశీరాగములకును, నియమసాహిత్యమును సర్వదేశ సమాన రూపశాలిత్వమును మార్గరాగములకును లక్షణ మని తెలియుచున్నది. సంగీత సుధాకరము, సంగీత దర్పణము స్వరమేళ కళానిధి మున్నగు నితర సంగీత శాస్త్రగ్రంథములుకూడ లోకజన రంజనమును దేశికిఁ బ్రధానలక్షణముగా నిరూపించియున్నవి. పండితులైనవారు దేశీసంగీతమునువలె నియమ సహితమును శాస్త్రబద్ధమునైన మార్గసంగీతమునుగూఁడ నాస్వాదించి యానందింపఁ జాలుటయు, సామాన్యజను లట్లుకాక హృదయరంజకమైన దేశీ సంగీతమునువలె బుద్ధిరంజకమైన మార్గసంగీతము నాస్వాదింపఁజాల మియు నవియిట్లు చెప్పుటకుఁ గారణము.

శార్ఙ్గదేవుఁడు సంగీత రత్నాకరమందలి ప్రబంధాధ్యాయమున మార్గమునకు గాంధర్వమనియు దేశికి గానమనియు నామాంత

రములు సూచించెను. గాంధర్వము (మార్గము) లక్షణానురోధముగాఁ బ్రయోగింపఁబడును. దేశి లక్ష్య ప్రధానమైనది. దేశీపద్ధతిలో లక్ష్య లక్షణములకు వైరుద్ధ్యము సంభవించుచో ల మును బట్టియే లక్షణమును సవరించుకొనవలెను. స్వరయుక్తముగా వేదములను గానము చేయువిధానము మార్గపద్ధతికిఁ జెందినది. భారత రామాయణములు వేదప్రాయములగుటచే వానిని జదువునప్పుడును మార్గ విధానమే యనుసరింపఁబడినట్లు తోఁచుచున్నది. వాల్మీకి యుత్తర కాండమున కుశలవులు రామవచః ప్రేరితులై రామాయణమును మార్గవిధానమునఁ బాడి రని వ్రాసియుండెను.

దశరూపక కర్త ప్రశంగవశమున నృత్యనృత్తములను గూడ నిర్వచించుచు నృత్యము భావాశ్రయమైనదనియు నృత్తము తాళ లయాశ్రయమైన దనియు నుడివి యందాద్యము (నృత్యము) పదార్థాభినయమై మార్గమనఁబడుననియు, రెండవది దేశియనఁబడు ననియు వివరించెను.

Prof. హాస్ మార్గమును Higher Style అనియు, దేశిని Lower Style అనియుఁ బరివర్తనము చేసియున్నాఁడు. దీనినిబట్టి మార్గదేశి లక్షణములకు సంగీతమునఁ గల వ్యత్యాసమే నృత్యవిషయమునఁ గూడఁ గన్పట్టుచున్నదని చెప్పవచ్చును. ఈభేదమును బురస్కరించు కొనియే కవితావాఙ్మయములందుఁ గూడ మార్గదేశీవిధానములకుఁ గల భేదము పరిశీలింపవలయును.

సంగీతమున మార్గ దేశీవిధానములకుఁగల విభేదమును భాషా విషయమున సమన్వయించి చూడ సంస్కృతము మార్గవిధానమున కును ఆంధ్రతమిళకర్ణాటాదులు దేశీవిధానమునకును జెందునని స్ఫురించును. సంస్కృతము దేవభాష. దానికి స్థిరమైన నియమములు కలవు. అది వేదకాలమునుండియు ననాదిసంప్రదాయమై వచ్చుచున్నది.

అది పండితజనైకవేద్యము. ఆంధ్ర కర్ణాటాదిభాషలందు క్రీస్తు శకారంభమునకుఁ దరువాతనే జెప్పఁదగిన వాఙ్మయముప్పతిల్లినది. వానికిని వ్యాకరణాది నియమములున్నను అవి జీవద్భాషలగుటచే నా నియమములు స్థిరములైనట్టివి కావు. సామాన్యజనులుకూడ వానిని జదివి యర్థము చేసికొనఁ జాలుదురు.

భాషయొక్కటే కవిత్వము కాదు. దానికి భాష, భావములు, రసము, ఛందస్సు, రీతి, వస్తువు మున్నగునవి ప్రధానములైన యంశములు. పండితులయిన వారు వీని లక్షణములన్నియు నెఱింగి తల్లక్షణానుగుణముగనే కవిత్వము వెలయించుచుందురు. పాండిత్యము లేనివారు కూడ వివిధ సన్నివేశములందు భావోద్రేకము కలిగినప్పుడు కవితాసృష్టికిఁ గడంగుచుందురు. వారు లక్షణపరిజ్ఞానము లేనివారగుటచే వారి కవిత్వమునఁ గవిత్వాంగములకు సంబంధించిన నియమములు పూర్తిగాఁ గానఁబడకపోవుటయు, నది సంప్రదాయభిన్నములైన నవ్యతా లక్షణములతో భాసిల్లుచుండుటయు సంభవించును. ఈ రెండురకములైన కవిత్వములలోఁ బండితులచే లక్షణానుగుణముగా వెలయింపఁబడినదానిని మార్గకవిత్వమనియు లక్షణములతో సంబంధము లేకుండఁ దమహృదయరుచి ననుసరించి సామాన్యజనులచే వెలయింపఁబడుదానిని దేశి కవిత్వమనియుఁ జెప్పవచ్చును. సలక్షణమైన భాష, ఉదాత్తములైన వస్తు భావములు, సంప్రదాయ సిద్ధమైన ఛందస్సు, లక్షణానుగుణమైన రసపోషణము మార్గకవిత్వమునకు లక్షణములు దేశి భాషాభావరసచ్ఛందో వస్తువుల విషయమున స్థిరమైన నియమములులేక కవుల యభిరుచులను బట్టియు, దేశకాలములను బట్టియు భిన్నభిన్న విధములుగా గోచరించును. కవిత్వమునందలి మార్గదేశీవిధానముల నిర్ణ

యించుట, కొక్క భాషనే కాక యితర కవిత్వాంగములను గూడ దృష్టియం దిడుకొనవలయును.

తెలుఁగున మార్గదేశీపదములను గవిత్వ పరముగా వాడిన మొదటికవి నన్నెచోడుఁడు. అతఁడు కావ్యారంభమునఁ దొలుత నిష్టదేవతాస్తుతియుఁ బిమ్మట గురుప్రశంసయుఁ గావించి తరువాత వాల్మీకి వేదవ్యాస కాళిదాస భారవ్యుద్భట బాణులను స్తుతించెను. వీరందఱును సంస్కృతమునఁ గవిత్వము చెప్పినవారే. తరువాత నాతఁడు.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుఁ
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్.

అను మార్గదేశకవితాప్రసక్తితోఁగూడిన పద్యమును వ్రాసెను. తదనంతర మతఁడు "సురవరులం గ్రమంబున" అను పద్యమునఁ దాను గావ్యారంభమునఁగావించిన స్తుతిక్రమమును సింహావలోకనము చేసియున్నాఁడు. వాల్మీకి వ్యాసులను బురాణకవులుగను, గాళిదాసాదులను మార్గకవులుగను బరిగణించి వీరేశలింగంపంతులు గారు దేశికవులం బేర్కొని నన్నెచోడుఁడు స్తుతించియుండు పద్యమొకటి పైపద్యముతరువాత లేఖక ప్రమాదమున విడిచివేయఁబడి యుండునని భావించిరి. ఈ యూహ యెంతవఱకు నిజమో మనము చెప్పఁజాలము ఉన్నపద్యములనుబట్టియే మనమొక నిర్ణయమునకు రావలయును. స్తుతిసింహావలోకన మొనరించినపిదప నన్నెచోడుఁ డొకపద్యములో విబుధవర్గమును దలపోసి యనంతరము కుకవివరాకులఁ బరిహరించుచు

మార్గకుమార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తులనఁ దగు
మార్గవులం దలఁప నలఁతి మహిఁ సుకవులకున్.

అనుపద్యము వ్రాసెను.

నన్నెచోడుని మును 'మార్గకవిత' యనుపద్యమున కర్థము చెప్పినవారు మొదటఁ గేవలము భాషను మాత్రమే దృష్టియం దిడుకొని మార్గదేశీకవిత్వములను నిర్ణయము చేసినట్లు కానఁబడును. దానిప్రకారము సంస్కృతకవిత్వము మార్గకవిత్వముగను దేశభాషా కవిత్వము - సంస్కృతపదభూయిష్ఠమైనను గాకపోయినను - దేశి కవిత్వముగను బరిగణింపఁబడినది. అప్పుడు పురాణకవులనఁగా వాల్మీకివ్యాసులనియు, మార్గకవులనఁగాఁ గాళిదాసాదులనియు, దేశి కవులనఁగా దెలుఁగునఁ గవిత్వము చెప్పినవారనియు వారిని నన్నె చోడుఁడు స్తుతించె ననియుఁ జెప్పవలయును. అతఁడు కుకవివరాకు లను బరిహరించుచు మార్గవులను గుకవులుగాఁ బరిగణించి యుం డెను. ఈ మార్గవులను మార్గకవులని భావించుట యుచితముగాదు. అట్లుభావించినచో నన్నెచోడుఁ డిందు మార్గకవులను దుర్మార్గపదవర్తు లని నిందించుటకును గవిస్తుతిలో వాల్మీకి వ్యాసకాళిదాసాదులను, మార్గకవులను స్తుతించుటకును బొత్తు కుదురనేరదు. అదిగాక నన్నె చోడుఁడుకాని మఱియెవ్వరుకాని సంస్కృతకవులను నిందింతు రనుట భావ్యముకాదు.

సంస్కృతకవిత్వమే మార్గకవిత్వమని భావించినచో నన్నె చోడుని కవిస్తుతియందుఁ గొంత వైరుద్ధ్యము గోచరించుచున్నది. అతఁడందుఁ బురాణకవులను మార్గకవులను వేఱువేఱుగాఁ బేర్కొని యున్నాఁడు. అతని దృష్టిలో వాల్మీకివ్యాసులు పురాణకవులు. కాళి

దాసాదులు మార్గకవులు. రచించిన కావ్యముల స్వరూపములో భేదమున్నను నిజమునకు వా రందఱును మార్గకవులే. కాళిదాసాదులే మార్గకవులై వ్యాసాదు లట్టివారు కారనుట కవకాశము లేదు. సురవరులను పద్యమున వాల్మీకివ్యాసు లిరువురికిని పురాణకవిసంఘ మని సంఘశబ్దము నుపయోగింపవలసిన యక్కఱ లేదు సంస్కృతకవిత్వ మే మార్గకవిత్వమని యాతఁడు దలంచినప్పు డాసంస్కృతకవులనే పురాణకవులని మార్గకవులని వేఱువేఱుగాఁ జెప్పుటకుఁ గారణము కనఁబడదు. అందుచే నాతఁడు పురాణకవిసంఘమను పదముచే సంస్కృతకవులందఱిని బేర్కొని మార్గసత్కవీశ్వరు లనుపదముచేఁ దద్భిన్నులైన కవులను సూచించె నని తలంచుట యుక్తముగా నుండును.

నన్నెచోడుఁడు మార్గకవిత్వ మని పేర్కొన్న కవిత్వమేది? అది యేదైనను మున్ను లోకమున వెలసె నని యాతఁడు చెప్పుచున్నాఁడు. లోకము, దేశవిషయములకంటె విస్తృతతరమైనది. ఈ శబ్దమును వాడుటలో మార్గకవిత్వ మొక్క యాంధ్రవిషయముననే కాక ఇతరదేశములందుఁ గూడ వ్యాపించియుండెనని యూహించినట్లు తోఁచుచున్నది. ఈ యితరదేశములలో నాంధ్రదేశమునకుఁ బరిసరములనున్న తమిళకర్ణాటదేశములు ముఖ్యములైనవి. నన్నెచోడునకుఁ దమిళకర్ణాటములతోడను దద్దేశాచారములతోడనుగూడఁ బరిచయ మున్నట్లు కుమారసంభవము సాక్ష్యమిచ్చుచున్నది. అతఁడు కన్నడమునఁ బంపాదులు రచించిన కావ్యముల నాదరముతోఁ జదివి యుండును. మార్గదేశికవితాసంప్రదాయముల నాతఁడు కన్నడము నుండి గ్రహించినట్టివే పంపాదులకుఁ బూర్వముకూడఁ గన్నడమున గద్యపద్యాత్మకములైన కావ్యములు పెక్కురచింపఁబడినట్లు నృపతుంగుని కవిరాజమార్గమువలనఁ దెలియుచున్నది. భాషాచ్ఛందములను బురస్కరించుకొని యందలి రచన మార్గపద్ధతికిఁ జెందినదని

చెప్పనగును. దీనినిబట్టి క్రీ. శ. 700 కుఁ బూర్వమునుండియుఁ గన్నడమున మార్గకవిత ప్రచారమునం దుండెనని తలంపవచ్చును.

క్రీ. శ. 10 వ శతాబ్దికిఁబూర్వము దేశమున దేశభాషల కంత గౌరవములేదు. సంస్కృతపాండిత్యమే పాండిత్యముగాఁ బరిగణింపఁబడుచుండెను. పండితులు శాస్త్రవాదము లొనరించునప్పుడును దమలోఁ దాము మాటాడుకొనునప్పుడును సంస్కృతభాషనే యుపయోగించుచుండినను సంస్కృతభాషానభిజ్ఞులైన సామాన్య జనులతో మాటాడవలసివచ్చినప్పుడు దేశభాషలోనే మాటాడవలసియుండును. వారట్లు మాటాడునప్పు డందుఁ బెక్కు సంస్కృతపదములుకూడఁ బ్రవేశించుచుండుట కవకాశమున్నది కొందఱు సంస్కృతపదములకు దేశభాషా విభక్తులను జేర్చి తత్సమశబ్దములను వాడుచుండిరి. సంస్కృతభాషయం దత్యాదరముగల పండితుల కీతత్సమీకరణము రుచింపకపోవుటలో వింత లేదు. సంస్కృతపదములకు దేశభాషావిభక్తులను జేర్చు పద్ధతి వారి కంగీకార్యము కాకపోవుటచే వారు సంస్కృతపదములను సంస్కృతవిభక్త్యంతములుగాను దేశభాషాపదములను దేశీయవిభక్త్యంతములుగాను బ్రయోగించుటయే యుక్తమని తలంచియుందురు. ఈ పద్ధతికే మణిప్రవాళమని పేరు. అప్పటి పండితులలోఁ గొంద ఱిట్టి భాషలోఁగూడఁ గవిత చెప్పియుందురు. ఆపద్ధతియుండుటచేతనే పాల్కురికి సోమనాథుఁడు తన వృషాధిపశతకమునఁ బలుభాషలలోఁ బద్యములు వ్రాయుచు మణిప్రవాళమునఁగూడ నొక పద్యము వ్రాసియుండెను. ఈ మణిప్రవాళసంప్రదాయ మాంధ్రకర్ణాటకములలోఁ గ్రమముగా నంతరించిపోయినను మళయాళమునమాత్రము నిల్చియున్నది. నృపతంగుఁడు కవిరాజమార్గమున సమసంస్కృతమునే దేశభాషలలోఁ గలుపవలెనుగాని కేవలసంస్కృతపదములను గలుపరాదని నియమము గావించియుండెను. నన్నయ కేతనలు కూడ నట్లే

యభిప్రాయపడియుండి రనుట కాధారములున్నవి. తిక్కన నిర్వచనోత్తర రామాయణపీఠికలో "జాత్యముగాని నొప్పయిన సంస్కృతమెప్పుడుఁ జొన్ప"నని చెప్పుటకూడఁ గేవలసంస్కృతపదములను దెలుఁగునఁ బ్రయోగింపరాదను నిషేధమును సూచించుటకే.

నన్నెచోడుఁడు తనకుఁ బూర్వము కన్నడమున రచింపఁబడియుండిన వాఙ్మయముతోఁ బరిచయము కలిగియుండినకతమునను, వానిలోఁ బెక్కుమార్గ కవితాపద్ధతిని రచింపఁబడినవే యగుటచేతను మును "మార్గకవితలోకంబున వెలసె"నని వాక్రుచ్చియుండెను. చాళుక్య రాజాదులు తెలుఁగున నట్టిమార్గకవిత్వమునుగాక దేశికవిత్వమును బుట్టించి తెనుఁగును నిల్పుటకు యత్నించియుండిరి. ఈ చాళుక్య రాజు రాజరాజనరేంద్రుఁడు కాఁడనియు నాతని పూర్వులలో నొకఁడై యుండుననియుఁ దోఁచుచున్నది. అతఁడే యాచాళుక్య రాజైనచోఁ బుట్టించి యనుపదమున కర్థము కుదురదు. ఏలయన నాతనికిఁ బూర్వముకూడ దేశికవిత్వ మున్నదనుటకు శాసనాధారము లున్నవి. అందలి పద్యములు సీసము, తరువోజ, మధ్యాక్కర మొదలగు దేశిచ్ఛందములకు మాత్రమే చెందియున్నవి. రాజరాజే దేశికవితను బుట్టించినవాఁడన్నచో నన్నయ భారతమే యా దేశికవితయని చెప్పవలసివచ్చును. కాని భాషాచ్ఛందోవస్తువర్ణనాదులను బురస్కరించుకొని చూచినచో నది మార్గకవితాపద్ధతియేకాని దేశికవిత్వము కాదు.

నన్నెచోడుఁడు "సురవరు"లను పద్యమున స్తుతించినయుత్తమ మార్గకవులు తెలుఁగునకు సంబంధించినవారే. వారిలో నన్నయకూడ నొక్కఁడై యుండును. నన్నయకును దనకును మతవిషయమున భేద ముండుటచేతను అప్పటికింకను నన్నయ భారత మధికప్రచుర్యమంది యుండకపోవుటచేతను అతఁడు ప్రత్యేకముగా నతనిఁ బేర్కొనక

సాముదాయికముగా నుత్తమమార్గకవులను మాత్రమే స్తుతించియుం డును. అందుచే నన్నెచోడుఁ డిచ్చటఁ బేర్కొన్న యుత్తమమార్గ కవులు, దేశిసత్కవులు అనుపదములు "దేశభాషలోఁ జేయఁబడిన రచనను లక్ష్యముగాఁ జేసికొని చెప్పిన వని తలంపవలసినదే కాని సం స్కృతభాషారచితకవిత్వమున కిందుఁ బ్రసక్తి యేమున్నది."?

ఇంక నన్నెచోడుఁడు కవివరాకులను బరిహరించిన పద్య మును పై యభిప్రాయముతో నన్వయింపవలసియున్నది. ఆతని కుత్తమ మార్గకవులన్నను దేశి సత్కవులన్నను గౌరవమే యనుటకు వారి నాతఁడు కొల్చియుండుటయే తార్కాణము. "మార్గకుమార్గము, దేశియమార్గము" అనునది నన్నెచోడుని యభిప్రాయమే యైనచో నాతఁ డా రెండుమార్గములకుఁ జెందిన కవులను గొల్చియే యుండఁడు. అందుచే నా యభిప్రాయ మతనిది కాదనియు నాతనిచేఁ బరిహరిం పఁబడిన మార్గవుల దనియుఁ దోఁచుచున్నది. ఈమార్గవులు మణి ప్రవాళపద్ధతి నవలంబించినవారే. వీరికి సంస్కృతపదములను దత్స మములుగాఁ జేసి దేశభాషాపదములతోఁ గలిపి చెప్పుమార్గకవిత్వము నెడఁగాని దేశికవిత్వము నెడఁగాని. ప్రీతిలేదు. వీరిది "తృతీయః పంథాః" వీరికి మార్గము కుమార్గము. దేశి యమార్గము. రెండుపద్ధతులును నచ్చవు కావునమాటాడకూరకుండుటకు వారికి మనసొప్పదు. అందుచే వారొక క్రొత్తమార్గమును-సంస్కృతపదములను సంస్కృతపదములు గానే యుంచి దేశిపదములతోఁగలిపి చెప్పుమార్గమును - అవలంబిం చిరి. నన్నెచోడుని కిది దుర్మార్గము. ఉత్తమమార్గ మార్గనికిఁ బ్రీతి కరమే. అందుచే నాతఁడు, తమకు (మార్గవులకు) వగవంగ (ఆలోచిం పఁగా) మార్గ (సంస్కృతపదములను దత్సమీకరించి చెప్పుమార్గము) కుమార్గము (కుత్సితమార్గము) దేశి(కేవల దేశికవిత్వము) అమార్గము (మార్గమే కాదు) అయినకవిత్వమును బూర్తిగా విడిచివేయుటకు

మది (మనస్సు) వదలక (విడువక) దుర్మార్గపదవర్తులు (మణిప్రవాళ మను పదమున వర్తించువారు) అగు మార్గవులను సుకవులు తలంప నక్కఱలేదని హేళన పూర్వకముగాఁ జెప్పినాఁడు. నన్నెచోడునకుఁ గవిరాజమార్గ నిర్దిష్టమైన మార్గ ముత్తమమార్గము. అతిసంస్కృతాభిమానులైన మార్గవు లవలంబించు మణిప్రవాళము 'దుర్మార్గము'. అందుచేతనే యతఁ డుత్తమమార్గ సత్కవీశ్వరులను బొగడి దుర్మార్గపదవర్తులైన మార్గవులను (మాఱు+కవులు) దెగడినాఁడు.

మార్గవులయభిప్రాయములో మార్గకుమార్గము దేశిఅమార్గము ఇచ్చటి కుమార్గ -అమార్గ పదముల కర్థమున వ్యత్యాస మున్నది. కుమార్గమనఁగా గుత్సితమైనమార్గము. అదియు నొకమార్గమే కాని చెడ్డమార్గము. అమార్గ మసలు మార్గమే కాదు. అందుచే ననుసరింపఁ దగినదే కాదు.

మార్గదేశికవితాపద్ధతు లసలెట్టి సంబంధమును లేని పృథగ్మార్గములు కావు. ఏదైన నొకపద్ధతిని దేశియో మార్గమో యని చెప్పుట బాహుళ్య దృష్టితోడనే. మార్గకవిత్వమున దేశికవితాచ్ఛాయలును దేశకవిత్వమున మార్గకవితాచ్ఛాయలును గొన్ని కానవచ్చుచునే యుండును. ఉదాహరణమునకు నన్నయ భారతమే తీసికొందము. అందు మార్గకవితాంశ మధిక మనుమాట సత్యమేయైనను దేశికవితారేఖ లసలు లేకపోలేదు. అందలికవిత్వములోఁ దరువోజ లున్నవి. మధ్యాక్కర లున్నవి. అచ్చటచ్చట దేశ్యపదప్రచురమైన రచనయు నున్నది. కాని సమాసతత్సమ భూయిష్ఠము, శార్దూల, మత్తేభ చంపకోత్పలమాలాలంకృతము నగు మిగిలిన రచనతోఁ బోల్చి చూచినచో దేశికవిత చాలఁ దక్కువ అందుచే మొత్తముమీఁద నాతని రచన మార్గకవిత్వమని చెప్పఁబడుచున్నది. నన్నెచోడుని కుమారసంభవరచనకూడ మార్గపద్ధతికిఁ జెందనదే. కాని యిందు

నన్నయ భారతము కంటె దేశిమార్గచ్ఛాయ లధికముగా గోచరించును. శార్ఙ్గదేవుఁడు సంగీతరత్నాకరమున గాన గాంధర్వములను గూర్చి వివరించుచు గానము నిబద్ధము, అనిబద్ధము అని రెండు తెఱంగులనియు, గాంధర్వగానములు మార్గదేశీభేదముల కపరరూపకములనియుఁ దెల్పియుండెను కవిత్వవిషయమున మార్గపద్ధతులు రెండిటఁగూడ నీ రెండు తెఱఁగులు గోచరించునని చెప్పవచ్చును. నన్నయరచన నిబద్ధమార్గము. అనఁగా నించుక స్వతంత్రిచ్ఛాయలతోఁగూడిన మార్గపద్ధతి. పాల్కురికి సోమనాథుఁడు పేర్కొన్న తుమ్మెద, వెన్నెల పదాదులు శుద్ధదేశిమార్గమునకుఁ జెందినవి. అవి యనిబద్ధములు. సోమనాథుని రచనలు నిబద్ధదేశిమార్గమునకుఁ జెందినవి. అనఁగా వానియందును సంస్కృతప్రభావము కొలఁదిగా నైనను లేకపోలేదు. ఇది ప్రాధాన్య దృష్టితోఁ జేయఁబడిన వ్యవదేశము.

నన్నెచోడుఁడు కుమారసంభవమునఁ గావ్యప్రశస్తిలో "దేశిమార్గంబులు దేశీయములుగా నలంకారములు దా నలంకరింపఁ" గవిత రచింపవలెనని సూచించెను. మార్గమును దేశీయముగా నొనరించుట యనఁగా నేమో యర్థము చేసికొనవచ్చును. గాని దేశిని దేశీయముగా నొనరించుట యనఁగా నేమి? దేశికవితను బోషించి యధికతరదేశీయతాముద్రతో దాని నలంకరింపవలయుననుటయే యాతని యభిప్రాయమై యుండును. దేశికవితారీతి నితోధిక దేశీయముగను మార్గకవితను దేశికవితకు సన్నిహితముగను జేయవలెనని యాతని ధ్యేయమైనట్లు తోఁచును. అతనికావ్యమున నీ రెండుప్రక్రియలును గోచరించును, దేశిమార్గములను గలుపుట యనుపద్ధతి నతఁడు కన్నడకవులనుండియే గ్రహించెను. "దేసియొళ్ పుగువుదు పొక్కుమార్గదొళెతళ్ళుదు" అని పంపకవియు, "నెగళ్దరసం మ్నం గొళిసె

మార్గ మొడంబడె, దేసికబ్బమంబగె గొళ్ళిలంత పేళ్గుదు" అని రన్న కవియు భారత గదాయుద్ధములలోఁ జెప్పియుండిరి. మార్గ దేశీవిధానములను గలిపి చెప్పుటయే వారి కభిమతమైన పద్ధతి.

తెలుఁగున నీమార్గ దేశీపద్ధతుల ప్రవృత్తి తెచ్చినవాఁ డింకొకఁడు గలఁడు. అతఁడు నన్నెచోడుని కించుక తరువాతివాఁడని చెప్పఁదగు నృపధూర్జటి భీమయ పండఁడు,

"తలంపునదర్థ భావమునం దద్గతసూక్తులఁగూడ" వనక్ నల్
గొలుసుగొనంగ వ్రేవడులు గోరిన భంగ్గికవచ్చిముట్టఁగో
మలగతి దేశిమార్గములు మట్టుపడం గ్గటనంబులొప్ప నా
ద్యులకిృయం జెప్పనేర్చెర్ నృపధూర్జటిభీమయపండ్డడి మ్మహిని"
అను పద్యమున దేశి మార్గములు మట్టువడునట్లుగా

నాద్యుల కిృయఁ జెప్పఁగల నేర్పును బ్రశంసించుచు ని యున్నాఁడు. ఈ పద్యము భాషాభావగమకములందు నన్నెచోడుని సరళముగాఁగ భావము" అను పద్యమును బోలియున్నది.

నన్నెచోడుని తరువాత పాల్కురికి సోమనాథుఁడు దేశిమార్గమున కధికప్రాధాన్య మొసంగెను. తిక్కనకూడ భాషావిషయమున దేశికవితాభిమానమునే ప్రదర్శించెను. గాని యితర కవితా లక్షణములలో మార్గపద్ధతినే యవలంబించెను. నన్నెచోడుఁడు నిట్లే యొనరించినను భాషాసమాసాది ప్రయోగమున నించుక విశృంఖలముగా వర్తించుటచేఁ బండితాదరము పడయలేకపోయెను. నన్నయ కవిత్వమునందు మార్గకవితాభాగ మెక్కువ. తిక్కనకవిత రెండింటి శ్లక్ష్ణమైన సమరసమైన కూడిక. తిక్కనతరువాత మరల దేశి కవితా మార్గమునకు దుర్దినములు పట్టినవి. పండితులును గవులును దేశిమార్గమునం దాదరము చూపక నన్నయ యవలంబించిన మార్గ కవితా సంప్రదాయమునే యాదరించి పెంపొందింపఁ దొడంగిరి.

సోమన శ్రీనాథాదులును, పెద్దనాది ప్రబంధకవులును ఆ మార్గముల బరాకాష్ఠనొందించిరి. అప్పుడు తాళ్ళపాకవారి కృతులలో నది సజీవమై యుండినను ఉరవడితో నుద్వేలమై ప్రవహించిన ప్రబంధ వాహిని ముందు దాని నంతగా నాదరించినవారు లేకపోయిరి. తరువాత నాయకరాజుల కాలమున యక్షగానాదులలో నది కొంత విజృంభణము గాంచెను. మరల నాధునిక కాలమున పండితులకును, గవులకును బ్రజలకును గూడ దేశికవితావాఙ్మయముపై నధిక మైన యాదరాభిమానము లుదయించినవి. కవులు పూర్వపుపాట లను బదములను బీజబంతులుగా గ్రహించి సర్వసుబోధములైన గేయరచనలు కావించుచున్నారు. అభ్యుదయ కవిత్వమునఁ జాల భాగము దేశిమార్గముననే నడచుచున్నదనుటలో నత్యుక్తి యుం డదు. కాని పండితులకును శిష్టులకును బూర్వమువలె నేఁడును దీని యెడ సహజమైన యాదరాభిమానము లంతగా గోచరించుటలేదు. దీని భవిష్యత్తు వృత్తి యెట్లుండునో యిప్పుడు నిర్ణయించుట కష్టము.

# శ్రీ జయంతి రామయ్యపంతులుగారి

## శతవార్షికజన్మదినోత్సవ

### స్మారకసంచిక

## చరిత్రవిభాగము

# అన్నదేవచోడుని త్రిపురాంతక శాసనము

కె. హెచ్. వి. శర్మ.

కీర్తిశేషులైన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి శతవర్షజన్మ దినోత్సవమును వారిచే స్థాపింపఁబడిన ఆంధ్రసాహిత్య పరిషత్తువారు జరిపించుట తదనుబంధముగ నొక ప్రత్యేక సంపుటమును బ్రకటించి మరల ఆ మహాపురుషుని ఆంధ్రదేశమంతయు నొక్కమాఱు స్మరించునట్లు జేయుట మిక్కిలి ముదావహము. వారి జీవితములో శాసన పరిశోధన మొక ప్రధానమైన సాధన. స్వయముగ సేకరించి ఇతరత్ర ప్రకటించిన శాశనములు గాక భారతప్రభుత్వనియోగమున దక్షిణ హిందూదేశ తెలుఁగు శాశనసంపుటమును సుమారు ఎనిమిదివందల శాసనములు గలదానిని తెఁలుగు దేశమున కర్పించిన మహానుభావుడు. ఆంధ్రదేశమున కిన్నివందల శాసనములను సమర్పించిన వ్యక్తి మఱియొక ఱింతవఱకు లేరనిన నతిశయోక్తి కాఁజాలదు. శాసన పరిశోధనశాఖవారి తరుపున నీ చిన్న వ్యాసమును తెలుఁగులో వారి స్మృత్యర్థము ప్రకటించిన సంచిక కందఁజేయుట నా యదృష్టము.

ఈశాసనము [1] కర్నూలుజిల్లా, మార్కాపురము తాలూకా త్రిపురాంతకములోని శ్రీ త్రిపురాంతకేశ్వరుని ఆలయపు చీకటి మిద్దె తూర్పుగోడకు తెలుఁగులిపిలో ఇరువది పంక్తులలో చెక్కఁబడియున్నది. శాసనమంతయు మూఁడు సంస్కృతశ్లోకములలోఁ గలదు. చివరి మూడుపంక్తులు కొంచెము చెరిగిపోవుటచే ఆఖరిశ్లోకము మాత్రము పూర్తిగ చదువ వీలులేకుండెను.

శకాబ్దములు 1310 విభవ సంవత్సర మార్గశిర సోమగ్రహణమునాఁడు భక్తిరాజు సూనుఁడగు అన్నదేవేశ్వరుఁడు శ్రీ త్రిపురాంతకునకు సోమవారోత్సవము లాకల్పాంతము జరిపించుటకుగాను

1. శాసనపరిశోధన శాఖవారి 1905 సంవత్సరాంత నివేదిక. నంబరు 254

కంచనపల్లిగ్రామమును దానమిచ్చెను. జీవనమయము, భంగాంకితము, బడబాగ్నితోఁగూడినట్టి. పంకమయము, జడమైనజలనిధియందు జన్మించుటచే పూర్వము సిగ్గును బొందిన లక్ష్మి రాజన్యచూడామణియు, గుణనిధియైన అన్నదేవచోడనృపతియం దుదయించినదియై మిక్కిలి ప్రమోదము నొందుచున్నది. జగన్నాథకవిచే రచింపఁబడిన ఈకంచనపల్లి దానశాసనము చంద్రార్క, భూ, మరుత్ద్రుమ, సముద్రములు గలంతకాలము ప్రకాశించుఁగాక. తదుపరి మంగళమహా శ్రీ శ్రీ శ్రీ యని శాసన మంతమయినది.

దీనిలిపి మధ్యాంధ్రదేశమున శ్రీనాథునిచే విరచింపఁబడిన ఫిరంగిపుర, అమీనాబాదు మున్నగు రెడ్డిరాజుల శిలాశాసనముల లిపినే పోలియున్నది.

శాసనపు పైభాగమున సూర్యచంద్రులు క్రొంచెము దిగువున కుడివైపున పానవట్టముతోఁ గూడిన శివలింగము. ఎడమవైపున గండభేరుండ శిల్పము, ఈ రెండింటికిని నడుమ నందియును జెక్కఁబడియున్నవి. సూర్యచంద్రులీశాసనోద్దిష్ట దానపు ఆచంద్రార్కస్థాయిత్వమును, శివలింగము, నందియు శాసనదాతశైవమతావలంబనమును, గండభేరుండ మాభూపతి లాంఛనమును దెల్పుటకై వరుసగా గండరింపఁబడినవి. ప్రాయికముగ రాజులు వారి శాసనములయందు తమతమ లాంఛనములను గూడఁజిత్రించెదరు అట్లే ఈ శాశన దాతయగు అన్నదేవచోడనృపతి తమ లాంఛనమగు గండభేరుండ శిల్పము నిందుఁజెక్కించెను. ఈ శిల్పమొక మానిసివలె చిత్రింపఁబడి రెండుపక్షితలలు రెండుబాహువులు గల్గి రెండు హస్తములను రెండు గజములను గ్రహించినట్లు గండరింపఁబడియుండెను ఇదియే శిల్పము అన్నదేవచోడుని తండ్రియగు భక్తి

రాజు పెంటపాడు[2], మద్రాసు మ్యూజియముల తామ్రశాసనములందు[3], కోటకేతరాజు ఎడవల్లి తామ్రశాసనమున[4], సాగిగన్నమనాయకుని కాలమునాటి గుంటూరుజిల్లా వినుకొండలోని యొక శాసనమున[5], శ్రీరంగమునందలి నాల్గు నల్లరాతికంబములపైన చెక్కcబడియున్నది. ద్వారసముద్రము రాజధానిగc బాలించిన హొయసళ వంశపు రాజుల లాంఛనముగూడ నీగండభేరుండమే యని తెలియుచున్నది[6]. పెంటపాడు, మద్రాసు మ్యూజియముల తామ్రశాసనములనుబట్టి చోడభక్తి రాజునకు, పాలకొల్లు క్షీరారామేశ్వరాలయపుశాసనముc[7]బట్టి అన్నదేవచోడ నృపతికిc గూడ గండభేరుండ బిరుద ముండినట్లు స్పష్టమగుచున్నది.

గండభేరుండబిరుద
మాహవే ష్వభివీక్ష్య యం
వైరిసింహాః పలాయన్తే
విహాయస్వామహం

ఆంధ్రదేశ చరిత్రములో అన్నదేవచోడుని దొక ప్రధాన పాత్రము. ఏఱువనాటిని పాలించిన తెలుగుచోళరాజు లందఱిలో నీతcడగ్రగణ్యుcడు. తండ్రిభక్తిరాజ నామాంతరుcడగు కామరాజు. తల్లి అన్నమాంబ. కమ్మనాటికి పశ్చిమమున, పాకనాటికి పశ్చిత్తరమున, పల్నాటికి వాయవ్యమున, అనcగా నిప్పటి నెల్లూరి జిల్లాలోని పొదిలి, దర్శి డివిజనులలో కొంతభాగము, కడపజిల్లా

2. 1946-47 తామ్రశాసనముల పట్టికము నం. 3
3. చూ. భారతి సం. 8. సం. 2. పుటలు 120-133
4. శాసనపరిశోధకశాఖవారి 1915-16. సంవత్సరాంత నివేదిక నం 5
5. డిటో 1913 సం॥ నం 528
6. డిటో 1936-37 పుట. 77 పేరా 42
7. దక్షిణ హిందూదేశశాసన సంపుటము. 5, పుట 55, నం. 145.

బద్వేలు, సిద్ధవటము తాలూకాలలో కొంతభాగము, కర్నూలుజిల్లా మార్కాపుర, కంబము తాలూకాలలోని కొంతభాగమునకుఁ బూర్వము ఏఱువనాఁడని వ్యవహారము. కర్నూలుజిల్లా కంబము తాలుకా తురిమెళ్ళగ్రామమున కొకమైలు దూరమున గుండ్లకమ్మ నదీతీరమునఁగల అతి ప్రాచీనమైన సురభేశ్వరాలయమున చక్కని చలువరాతిపై నొకశాసనముఁ[8] జెక్కఁబడియున్నది. అందు సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజాధిరాజ విక్రమాదిత్య పరమేశ్వర భట్టారకుల ద్వితీయ రాజ్యవర్షమున గొగ్గిభట్టారకుల దక్షిణ భుజాదండుండు అలకుమరప్రియతనయుండైన ఉజేని పిశాచ నామధేయుఁడు తుఱుఱెటూకఁ తురిమెళ్ల రాజధానిగ ఏఱువ విషయమును బాలించుచున్నట్లు గలదు. సమీపముననే గల తురిమెళ్ళగ్రామములో సప్తమాతృకల శిల్పపు అధోభాగమున చెక్కఁబడిన వేఱొక చిన్నశాసనములలో[9] ఏఱువ మహాదేవి యొక్కతె పేర్కొనఁబడెను. ఈమె పైనఁ జెప్పిన అలకుమరుని రాణియు బహుశః ఉజేనిపిశాచి తల్లి కావచ్చును వీనినిబట్టి క్రీస్తుశకము ఎనిమిదవ శతాబ్దపు పూర్వమునుండియే ఆంధ్రదేశమున ఏఱువనాఁడు మిక్కిలి ప్రసిద్ధమైనట్లు తెలియుచున్నది.

ఏఱువనాఁటిని బాలించిన తెలుగుచోళవంశజుల శాసనములింతవఱకు మనకు కొద్దిమాత్రమే లభ్యమైనవి. అందు తామ్రశాసనములు మొత్తము మూఁడు గలవు. అన్నదేవచోడునిదే రాజమహేంద్రవర మ్యూజియపు అసంపూర్ణ తామ్రశాసన మొకటి[10],

8. శాసన పరిశోధనశాఖవారి 1949-50 సంవత్సరాంత నివేదిక నెం. 257. మరియు ఎపిగ్రాఫియా ఇండికా సం. 29. పు. 160-64.

9. డిటో 1949 - 50 సంవత్సరపు నెం. 273.

10. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 26 పుటలు 44—48.

ఆతనితండ్రి భక్తిరాజు పెంటపాడు, మద్రాసుమ్యూజియముల తామ్రశాసనములు రెండు. ఈ తామ్రశాసనముల నన్నింటిని సమన్వయముచేసినవారి వంశవృక్షము క్రిందివిధముగ నుండును[11].

సూర్యవంశము

నల్ల (లేక ఏఱువ)భీమ=భార్య-కామాంబ
దామ=భార్య-సోమాంబ
పోత=భార్య-అన్యమాంబ
ఏఱువభీమ=భార్య-పోతాంబ
దామ=భార్య-లక్ష్మి
సోమ=భార్య-సూరాంబ
గంగాధర=భార్య ఇరుగాంబ
కామరాజు (లేక భక్తిరాజు)= { అన్యమాంబ, అన్యమాంబ, లక్ష్మి }

భీమయలింగ — అన్నదేవచోడుఁడు=ఇరుగాంబ
|
వీరభద్రుఁడు.

పై వంశవృక్షమును పరికించినచో భక్తిరాజపుత్రుఁడగు భీమయలింగయగాక నల్ల లేక ఏఱువభీముఁడు, ఆతనితండ్రి భక్తిరాజు మద్రాసు మ్యూజియము శాసనములో వారి మూలపురుషుఁడుగా చెప్పఁబడిన నల్లభీముఁడు యొక్క రేయని నిర్ణయించిరి. కాని

11. ఇందు పేర్కొనఁబడినవారు గాక ఏఱువకొండయరాజు, ఏఱువమల్లిదేవరాజు, కూనపరాజు మున్నగు మఱికొందఱు గూడ శాసనములలో గాన్పించుచున్నారు. ఈ వంశ వృక్షములలోఁ గలవారికిని వీరికిని గల పరస్పర సంబంధములుమాత్రము తెలియుటలేదు.

అది సరికాదు. భక్తిరాజు పెంటపాడు తామ్రశాసనమును బట్టి ఆ వంశములో నిరువురు భీమనామాంకితులు గలరని తెలియుచున్నది. మద్రాసు మ్యూజియము శాసనములో పేర్కొనఁబడిన నల్లభీముఁడు, పెంటపాడు శాసనములో వారి మూలపురుషుఁడుగఁ జెప్పబడిన నల్ల భీము లిరువురు నొక్కరే. మద్రాసు మ్యూజియము శాసనములో నల్లభీమాదులగు అనేక రాజుల యనంతరము దోహత్త నారాయణ బిరుదాంచితుఁడగు దామనృపాలుఁడు జన్మించినట్లు గలదు.

కరికాలాన్వయోద్భూతై
ర్నల్ల భీమ పురోగమైః
సురాజభిశ్చిరం కాలం
మహీయ మమహీయత
దోహత్తనారాయణ దామభూపా
లక్ష్మీప తే స్సోమ నృపాలకోభూత్.

ఇందు పై వంశవృక్షములోని మొదటి దామ, పోత, ఏఱువ భీములు వరుసగా విడిచిపెట్టఁబడిరి. ఇఁక అన్నదేవచోడుని రాజ మహేంద్రవర మ్యూజియము శాసనములో ఏఱువభీముని తండ్రి, తాత, ముత్తాతల నామములు గల రేకులు పోయినవి.

ఇందొక ఏఱువభీముని పరాక్రమాదుల నుగ్గడించుచు కొన్ని శాసనపద్యములు, చాటువులు గలవు.

పన్నితురంగమంబునకుంబక్కెరవెట్టిన వార్తవేఁరిచే
విన్నభయంబునం గలంగె వీసఱవాండునుం జక్రకోట్టమును
మన్నియవడ్లతెక్కలియు మంథ్యన వేంగి కళింగ లాదిగా
నన్నియు నొక్కనాండడిసె నేఱువభీమనృపాలుధాటికిన్.

(తాళ్ళపొద్దుటూరు శాసనము)

ఏఱువభీమ! నీపగతు తెక్కలినికొండలు చంచలాత్ములై
దూఱనియట్టి ఘోరవనదుర్గములున్ వనితావియోగులై
పాఱనిఱోవలుం దినని పంక్తులు నాఁకటఁగూరలుప్పుగా
నేఱనికట్టలుం గలవె యీలవణాంబుధివేష్టితావనిన్.

(చాటుపద్యమణిమంజరి. పుట. 76)

జాతస్తయోరఝవదేఱువభీమభూప
స్త్రైలోక్యగీత విమలాత్మయశః ప్రతాపః.

(అన్నదేవచోడుని తామ్రశాసనము)

ఈ పద్యములలో పేర్కొనబడిన ఏఱువభీముడు పై వంశవృక్షములోని రెండవ ఏఱువభీముఁడనియు, వానిచే జయింపఁబడినవిగా చెప్పఁబడిన వేంగి, కళింగము, మన్నియ, వడ్డెతెక్కలి, వీసఱనాఁడు, చక్రిగొట్టము, మంథ్యన మున్నగునవి ఆకేఁడు కాకతి గణపతిదేవుని పక్షమున జయించి యుండవలె నని చరిత్రకారులు నిర్ణయించిరి. కంబముతోలూకా ఎఱ్ఱబాలెములోని ధనంతిప్ప యను గుట్టపై ఏఱువభీముని శాసనమొకటి గలదు[12]. దీనికాలము శకాబ్దము 999 పింగళసంవత్సర మనఁగా క్రీస్తుశకము 1077 నాఁటిది. శ్రీ మన్మహామండలేశ్వర ఏఱువభీమరాజు రాజేంద్రచోడసెట్టి చెఱువుకట్టపై గల గుడిదేవరకు కొంతభూమిని దానమిచ్చెనని యున్నది. ఈతఁడు పై వంశవృక్షములోఁ జూపినవారి మూలపురుషుఁడగు నల్లభీమనామాంకితుఁడని నా యభిప్రాయము. ఆంధ్రదేశమున చాళుక్యచోళుల పరిపాలనారంభమున తదితరమండలేశ్వరులవలెనే యీతడు కూడ ఏఱువనాటిని స్వాధీనము జేకొని చిన్న స్వతంత్రరాజ్యమును స్థాపించియుండును. పై పద్యములలో ప్రశంసింపబడిన ఇమ్మడి ఏఱువభీముఁడీతనిమునిమనుమఁడని నిశ్చయింపవచ్చును

12 శాసనపంశోధన శాఖవారి 1949 – 50 సంవత్సరాంత నివేదిక నం. 228

ద్రాక్షారామ భీమేశ్వరాలయమున శకాబ్దములు 1043 నాటి శ్రీమన్మహా మండలేశ్వర ఏఱువకొండయరాజుల శాసన మొకటి గలదు[13]. ఈతఁడు పశ్చిమ చాళుక్యచక్రవర్తియగు త్రిభువన మల్లుని సామంతుఁడనిగూడ తెలియుచున్నది. శాసనమునందీతఁడు సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరమాహేశ్వర కోడూరు పురవరేశ్వర సూర్యవంశోద్భవకులతిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాదిప్రశస్తి సహితుఁడుగఁ బేర్కొనఁ బడెను. పై వంశవృక్షము లోనివారికి నీతనికి నెట్టి సంబంధము కలదో తెలియదు.

ఏఱువభీముని యనంతరము మరల భక్తిరాజువఱకు గలవారి చరిత్ర మేమంత తెలియుటలేదు[14] బహుశః వారు చేసిన ఘన కార్యము లేవియులేవేమో! అరిగండరగండబిరుదాంచితుఁడగు గంగాధరునకు కామభూపతి పుత్రికయు వేంగ, తమ్మరాజుల సోదరియగు ఇరుగాంబికయందు కామరాజు జన్మించెను. శైశవమునుండి చంద్రచూడునిపై నాతనికిఁ గల యత్యంత భక్తిమూలమున భక్తిరాజను నామము గూఢ మయ్యెనట.

యశ్చంద్రచూడ చరణాంబురుహైకభక్త్యా
భక్తీశ్వరా హ్వయ మగా ద్భువనేషు పశ్చాత్
(రాజమహేంద్రవర మ్యూజియపు శాసనము

13. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 4. నం. 1216.

14. మార్కాపురము తాలూకా త్రిపురాంతకములోని శకవర్షములు 1185 ప్రభవసంవత్సరమునాటి రెండు శాసనములను (ద. హిం. శా సం 10 నం. 417, 418) బట్టి మహా మండలేశ్వర కాశ్యపగోత్ర, గండభేరుండాది బిరుదాంచితుఁడగు ఏఱువమల్లిదేవరాజా ప్రాంతమును పాలించుచున్నట్లు తెలియుచున్నది తదుపరి శకాబ్దములు 1212 వికృతి సంవత్సరమున గల గండపెండార అంబాదేవుని శాసనములో (నం. 465, 466) అంబాదేవుఁడు 'ఏఱువమల్లిదేవుని తలగొండుగండ' యని వర్ణింపఁబడుటచే నాతనిచేతిలో నీ మల్లిదేవుఁడు మృతినొందె ననుట స్పష్టము. ఇంతకంటె నీతనిచరిత్ర మేమియు తెలియదు.

శైశవేఽపిశివేభక్త్యా భక్త· ఇత్యపరేణచ.

(పెంటపాడు శాసనము)

అన్నదేవచోడుని రాజమహేంద్రవర మ్యూజియము శాసనమున భక్తిరాజొనరించిన దిగ్విజయములన్నియు చక్కగా వివరింపఁబడినవి. యౌవనముననే ఆతడు గులపూండి నగరప్రాంతమున శూరవరులైనబొగ్గరాదియవనాధిపతులను జయించెను. ప్రాగ్దిశను పంచధారాంగణమున గజపతినోడించి కొప్పులపతిని సింహాసన మధిష్ఠింపఁజేసెను, భరణిపాటిపురి సమీపమున జరిగిన యుద్ధములో సింగభూతలపతిని విసర్జించెను; పెదకొండపురి సమీపమున డబురుఖానుప్రముఖులైన రక్షోబలములను జయించెను. సూరవర పట్టణ సన్నిధానమున అన్నవోత నృపతిని లీలగా నోడించెను.

ప్రాంతేయుద్ధైవ గులంపూండి పురస్య శూరాన్
యో బొగ్గరాది యవనాధిపతీనజైషీత్.
ప్రాచ్యాం చ కొప్పులపతి ర్దిశి యేనపంచ
ధారాంగణే గజపతిం జయతాభ్యషేచి.
శూరాగ్రణీ ర్భరణిపాటిపురీసమీపే
యః సింగభూతల పతిం కదనే వ్యనైషీత్.
యస్తేజసాచ పెదకొండపురీ సమీపే
రక్షోబలాన్ డబురుఖాను ముఖానజైషీత్.
యేనైవ సూరవర పట్టన సన్నిధానే
వీరాన్నవోత నృపతి ర్విజితో వినోదాత్.

పెంటపాడు తామ్రశాసనమునుబట్టి ఈ భక్తిరాజు కాకతి ప్రతాపరుద్రుని మరణానంతరము ఆంధ్రదేశమంతయు యవనాక్రాంతమైనపుడు తన మేనమామలగు వేంగ. తిమ్మ భూపతులతోఁ గూడ ముసునూరి ప్రోలయనాయకునకు బాలుఁడుగ నుండినను మిక్కి-

లిగ తోడ్పడినట్లు గన్పట్టుచున్నది. పటుతర భుజబలశాలియగు భక్తిక్షితీశుఁడు బాలుఁడయ్యును సంగ్రామరంగమున యవనాధిప సుభట ఘోటకాటోపము నరికట్టెనఁట. రణరంగమున వానితోడి సంఘర్షణమును సహింపఁజాలక మరణింపఁగా మిగిలిన యవనులు పోయిన భవనములు గలవారై వడివడిగ నెచ్చటికో పలాయనమైరి.

పటుతర భుజబలశాలీ
భక్తిక్షితిపాలకోఽథ బాలోఽపి
సంగ్రామరంగ సంహృత
యవనాధిప సుభటఘోటకాటోపః,
తేన సమరేషుసార్ధం సంఘర్షం
సోఢు మక్షమాః క్వాపి
హతశిష్టా హృత భవనా
జవనా యవనాః పలాయంత.

ఈతనిమామ లిఖువురును స్వాతంత్ర్య సమరములో మరణించుటచే ప్రోలయనాయకుఁడీతని ధైర్యసాహసములకు మెచ్చి వారి వేంగి సింహాసనమున నీతని కుమారస్వామివలె అధిష్ఠింపఁజేసెను.

వేంగక్షితి తల నాథో
విహతాఖిలయవన వాహినీ నాథః
సాహాయ్యక మివ కర్తుం
సమరేషు శచీపతే రగాత్త్రిదివం.
తదాగ్రజ్యే తద్భగినీ
తనయంభక్తిక్షితీశమపి బాలం
అస్థాపయ దరిజయినః
కుమారమివ ప్రోచినాయకస్స్యసుతః,

ఇట్లే ఏఱువ తెలుఁగు చోళవంశజులకు ముసునూరి ప్రోలయ

నాయకుని మూలమున మొట్టమొదటిసారి చోడభక్తిరాజు కాలమున వేంగిసింహాసనము లభించెను. ప్రత్యేకమైన యువరాజ్యముకూడ ఈతని యధీనమున నుండెనేమో తెలియదు. కాని మద్రాసు మ్యూజియము శాసనములో నాతఁడు దిగ్విజయార్థము సంచరించువాఁడై శ్రీ పర్వతమునకు వచ్చి యచ్చట నైష్ఠిక బ్రహ్మచారియు, జితేంద్రియుఁడునైన విశ్వేశ్వరునకు కంద్వకొల్లు అను గ్రామము అష్టైశ్వర్య భోగసహితముగ దానమిచ్చినట్లుగలదు.

దిశో జిగీషు ర్విచరం దదర్శ
శ్రీ పర్వతైకాయతనం స రాజా.

దీనినిబట్టి ప్రత్యేకమైన యువరాజ్యముకూడ ఈతని అధీనమునఁగలదని కొంత వఱకూహింప వచ్చును. నూతనముగ తనకు లభించిన వేంగి రాజ్యమున తనపేర కామపురమను భవ్యమైన పురమును నిర్మించి రాజధానిగఁ జేసికొనెను.

భక్తీశ్వరోయ మథ నిర్మితవాను దారా
మ్ముజ్జృంభమాణవిభవాం పుర మాత్మనామ్నా
యా పుణ్యశీలమనుజాశ్రియణే జగత్యాం
కల్యాణ నామక మనీయతరా పరాభూత్.

ఈ కామపురము ఇప్పటి పశ్చిమగోదావరిజిల్లా చింతలపూడి తాలూకాలోని కామవరము లేక కామవరపుకోట యని స్పష్టము.

ఈ సందర్భమున ముసునూరి కాపయనాయకుని గూర్చి కొంత తెలుపవలసియున్నది. ఉపలబ్ధమైన శాసనవాఙ్మయాధారములను బురస్కరించుకొని సుప్రసిద్ధ పరిశోధకులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "ప్రోలానేనికి సంతానము లేకపోవుటచేతను, ఆతనితమ్ముఁడు ఎరపోతానేడుకూడ ప్రాయికముగ మహమ్మదీయుల తోడి సంగ్రామమున గతించుటచేతను కాఁబోలును అతనితరువాత

అతని పినతండ్రి దేవానాయకుని కుమారుఁడు కాపయనాయకుఁడు రాజ్యమునకు వచ్చెన''[15]ని వ్రాసిరి. వా రట్లు వ్రాయుటకు అనితల్లి కలువచేఱు శాసనములోని [16] ఈ క్రింది శ్లోకమే కారణము.

స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే
విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా
అపాలయ త్కాపయనాయకేంద్ర
స్తదీయ్య రాజ్యం తరణి ప్రతాపః.

కాని పెంటపాడు తామ్రశాసనమునుబట్టి ముసునూరి ప్రోలయనాయకునకు తాతపేరింటివాఁడు పోచినాయకుఁడనుకుమారుఁ డొకఁడు గలఁడనియు, ప్రోలయనాయకుని అనంతరము ఆబాలునే పినతండ్రియగు కాపయనాయకుఁడు ఆత్మీయ ప్రధానపురుషులతోఁ గూడ సింహాసనమునం దుంచి పాలింపఁజేసినట్లు, చోడభక్తిరాజు ఆ బాలుని యనుమతిని గైకొని దానము చేసినట్లు స్పష్టముగఁ దెలియు చున్నది.

కాలేన త్రిదివం యాతే తతః ప్రోలయనాయకే
తత్పితృవ్య సుత స్తస్య రాజ్యే కాపయనాయకః.
తదాత్మజం వీరపోచి నాయకం నయకోవిదః
అభ్యషే చయ దాత్మీయ ప్రధానపురుషై ర్యుతః.
అథాఽనుమతి మాసాద్య తస్య భక్తిమహీపతిః.

దీనినిబట్టి భక్తిరాజాదులు స్వాతంత్ర్య సమరానంతరము ప్రోలయనాయకుని పుత్రుఁడగు వీర పోచినాయకుని సామంతత్వము నంగీకరించిరనుట స్పష్టము. అనితల్లి కలువచేఱుశాసనమునఁగూడ

15. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూఁడవ సంపుటము, పుట 284.
16. భారతి, ఏకవింశతి తమ సంపుటము. రెండవభాగము-పుట 545.

డెబ్బది యేఁడురునాయకులు పైనఁజెప్పిన ప్రధానపురుషులు వీరిలోని వారే కావచ్చును. కాపావనీశ్వరుని పాదపద్మములను సేవించువా రని గలదు.

అథపంచోత్తర సప్తతి
నాయక సంసేవ్యమానపదపద్మః
కాపావనీశ్వరః శ్రీ
విశ్వేశ్వర కరుణయాఽక్షితిమరక్షత్.

చోడభక్తిరాజు, ప్రోలయవేమారెడ్డి మున్నగు ఆంధ్రనాయకులందఱు మొదట నీ బాలుఁడగు పోచినాయకుని ఆధిపత్యము నంగీకరించినవారే. తదుపరి ఈ బాలుఁ డేమైనది తెలియదు. బహుశః చిన్నతనముననే మరణించియుండును. కనుకనే కాపయ నాయకుఁడు రాజ్యభారము నిర్వహించి ఆంధ్రభూమండలాధ్యక్షుఁడని బిరుదు ధరించెను. అనంతరము భక్తిరాజు, వేమారెడ్డి మున్నగు నాయకులు తమతమ నగరములకుఁ బోయి యెవ్వరిదేశమును వారు సంరక్షింపఁ దొడగిరఁట.

విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం
యాతే విభౌ దివిచ తత్పదసేవనాయ
తై ర్నాయకై స్స్వనగరా ణ్యధిగమ్య సర్వై
స్సంరక్షితా గ తవిరోధకవైః స్వదేశాః.

తదుపరి కొలదికాలముననే వీరిలోని సంఘీభావము, ఐకమత్యము నశించి యెవరికి వారు స్వతంత్రులైరి.

భక్తిరా జెంతవఱకు రాజ్యమును బాలించె ననునదికూడ స్పష్టముగఁ దెలియుటలేదు. మెకంజి దొరగారి మాన్యుస్క్రిప్టులలోఁ గల నొక శిలాశాసనమునుబట్టి [17] ఆతని పుత్రుఁడగు అన్నదేవచోఁడుడు

17. నంబరు 15-4-4 పుట 231; వ. జిల్దు 15-5-36. పుట 176.

శకాబ్దములు 1259 పరాభవసంవత్సర శ్వయుజ శుద్ధ దశమినాడు కామవరమున పట్టాభిషిక్తుఁడైనట్లు తెలియుచున్నది. ఈ శాసనము రాజమహేంద్రవరకోట దిడ్డిగుమ్మమునకుఁ గలదట. ప్రస్తుతము దీని యునికిగాని నకలుగాని యెవ్వరికిఁ దెలియదు. శకవర్షములు 1259 పరాభవసంవత్సరము కాదు. మఱియు భక్తిరాజుచే దానము చేయఁబడిన పెంటపాడు, కంద్వకొలను తామ్రశాసనములు వరుసగా శకాబ్దములు 1265, 1277 నాఁటి వగుటచే ఆతని పుత్రుఁడగు అన్నదేవచోడుఁడు శకవర్షములు 1259 లో పట్టాభిషిక్తుఁడగుట యసంభవము. కావున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు[18] పరాభవ సంవత్సరమును మాత్రము సరియగుదానినిగా తీసికొని శకవర్షములు 1289 అనఁగా క్రీస్తుశకము 1366 లో అన్నదేవచోడుండు సింహాసన మధిష్ఠించినట్లును, అంతవఱకు భక్తిరాజు పాలించినట్లు నిర్ణయించవచ్చునని దెల్పిరి, కాని పై నుదహరించిన పెంటపాడు తామ్రశాసనము తోఁగూడి వేఱొక చిన్న రేకునఁగల శాసనమునుబట్టి ఆనంద సంవత్సర పౌష, కృష్ణద్వాదశి మకర సంక్రమణమునాఁడు భక్తిరాజు వెనుక తానుద్విజోత్తములకై యిచ్చిన గంగాధర పురములోని రెండు భాగములను భారతియను విద్వాంసున కిచ్చినట్లు గలదు.

18. రెడ్డి రాజ్యాంగ చరిత్ర, పుట 109 – "ప్రభవ సంవత్సరము (పరాభవకి తప్పుగా పడియుండును.) శకాబ్దములు 1288 నకు గాని 1259 కి సరిపోకపోవుటచేతను, మొదటి రెండు ఆఖరి అంకెలు స్పష్టముగ 1, 2, 9 అగుటచే శకాబ్దము 1289 వర్తమానాబ్దముగ దీసికొని అన్నదేవచోడుడు క్రీ. శ. 1366 లో పట్టాభిషిక్తుడైనట్లు అంతవరకు భక్తిరాజు జీవించెనని చెప్పవచ్చును. – కాని భక్తిరాజు ఆనంద సంవత్సరము వఱకు జీవించినట్లు స్పష్టమగుటచే తదుపరి ప్రభవ సంవత్సరము సరిగా శకాబ్దములు 1309కి సరిపోవుటచే అన్నదేవచోడుడు శకవర్షములు 1309 ప్రభవ అనగా ప్రస్తుత త్రిపురాంతక శాసనముకంటె నొక్క సంవత్సరము ముందుగా పట్టాభిషిక్తుడయ్యెనని నాయుద్దేశము.

ఆనందాబ్దే పౌష కృష్ణ
　　ద్వాదశ్యాం మకరాయనే
గంగాధరపురే పూర్వం
　　దాపయిత్వా ద్విజోత్తమైః.
ద్వాభాగా భారతీనామ్నె
　　విదుషే భక్తి భూపతిః.

తన తండ్రిపేర భక్తిరాజు గంగాధరపురమును శకాబ్దములు 1265 లో దానముచేయుటచే తర్వాత వచ్చు ఆనందసంవత్సరము శకాబ్దము 1296 అనఁగా క్రీ. శ. 1374 నకు సరిపోవును. ఆనంద సంవత్సరములోఁగూడ భక్తిరాజే భారతియను వానికి స్వయముగ దానమిచ్చుటచే క్రీ. శ. 1374 నాఁటి కింకను ఆతఁడు జీవించియుండె ననియే తలంపవలెను. మఱియు నాతని పుత్త్రుఁడగు అన్నదేవచోడుని శాసనములన్నింటిలో పై సంశయాస్పదమైన మెకంజిదొరగారి మాన్యుస్క్రిప్టులలోని శాసనము దప్ప మొట్టమొదటిది ప్రస్తుత త్రిపురాంతక శాసనమే యగుటచే భక్తిరాజు సుమారు శకాబ్దము 1300 అనఁగా క్రీ. శ. 1378 వఱకు రాజ్యముచేసినట్లే యూహింప వలయును.

పెంటపాడు తామ్రశాసనమునుబట్టి భక్తిరాజునకు అన్న మాంబానామధేయ లిరువురు లక్ష్మియను నామె యొక్క తె మొత్తము ముగ్గురు భార్యలుండినట్లు తెలియుచున్నది. అందు అన్న మాంబయందు అన్నదేవచోడుఁడు జన్మించినట్లు ఆతని రాజమహేం ద్రవర మ్యూజియపు శాసనమునుబట్టి స్పష్టము. నిశ్శంకకొమ్మనా మాత్యుని శివలీలా విలాసమునుబట్టి ఈతనికి భీమ లేక భీమలింగ మని వేఱొక పుత్త్రుఁడుండినట్లు తెలియుచున్నది.

భరిత శ్రీనిధి యమ్మహీరమణుఁడొప్పెంజోలభక్తిక్షితీ
శ్వరసూనుండగు భీమలింగమనుజేశ శ్రేష్ఠు సత్పుత్రి భా
స్వర కారుణ్య దశాజనావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెన్ బతిభక్తి గౌరవదృఢ వ్యాపార సత్యాంబికన్.

కోరుమిల్లి శాసనమునుబట్టి గూడ ఈవిషయము స్పష్టముగు చున్నది.[19]

శచీవ శక్రస్య శివేవ శంభోః
పద్మేవ సా పద్మవిలోచనస్య
వేమాంబికా చోడకులేందు భీమ
భూపాత్మజా భూన్మహితాస్య జాయా.

ఈ భీమయ అన్నదేవచోడుని సనతి అన్నకావచ్చును.[20] తండ్రి భక్తిరాజు మరణానంతరము భీమలింగ,అన్నదేవచోడు లిరువురకు సింహాసనమునకై పోరాటము సంభవించియుండును. ప్రస్తుత శాసనమునుబట్టి బలపరాక్రమ సంపన్నుఁడు, ఉత్సాహపూరితుఁడగు అన్నదేవచోడుఁడే విజయమునొందినట్లు స్పష్టము అన్నయగు భీమలింగయగతి ఏమైనది తెలియుటలేదు. కాని అతఁడు కొండవీటిరెడ్డిరాజుల ఇంటి ఆడుబిడ్డను జేపట్టుటచే తమ బంధుత్వమును బురస్కరించుకొని అనవేమారెడ్డి పూర్వదేశ దిగ్విజయయాత్రలో అన్నదేవచోడుని తరుమఁగొట్టి భీమలింగచోడుని మరల పిత్ర్యమైన రాజ్యమున స్థాపించె నని చరిత్రకారులు దెల్పియున్నారు[21]. రాజ్యబహిష్కృ

19 ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 13. పుట 241.

20. సింహాచల నృసింహస్వామి ఆలయములో శకవర్షములు 1325 నాటి శాసనమొకదానిలో "భక్తిరాజు కామవరాన చక్రవర్తి యగు భక్తిరాజు చోడ భక్తిరాజేయనుటలో సందియములేదు. కాని ఈతని కొడుకు కూనపరాజెవ్వరో తెలియుటలేదు.

21. రెడ్డిరాజ్యాంగ చరిత్రము. పుటలు 112, 113.

తుఁడైన అన్నదేవచోడుఁడు పరరాజ్యముల ప్రవాసముండినట్లు వెలుగోటివారి వంశావళి మున్నగు వానినిబట్టి తెలియుచున్నది.

అలచోడ భక్తీంద్రునన దేవరాజును
బెంపారఁ గాంచె మాపిన్నతాత.

తదనుగుణముగ ప్రస్తుత త్రిపురాంతకశాసనమనఁగా క్రీ. శ. 1388 తరువాత మరల క్రీ. శ. 1404 నాటి దాక్షారామ భీమేశ్వరాలయ శాసన[22]కాలము వఱకుఁగల మధ్యకాలమున నీతనిశాసనము లింతవఱకు ఆంధ్రదేశమున గాన్పించుటలేదు. ఇంతలో మధ్యాంధ్ర దేశరాజకీయ పరిస్థితులు విషమించినవి. రెడిరాజ్యమున విప్లవము సంభవించెను. కొండవీటి ప్రభువగు కుమారగిరిరెడ్డి మరణించుటచే పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సింహాసనమును, కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరరాజ్యము నధిష్ఠించిరి ఉభయులకును బద్ధవైరమేర్పడి రెండురాజ్యములకు నెడతెగని పోరు సంభవించినది. ఆ సమయమును సద్వినియోగము చేసికొని అన్నదేవచోడుఁడు వెలమదొరల సాయముతో పిత్రార్జితమైన రాజ్యములో కొంతభాగమునేగాక పూర్వరాజ్యమునుకూడ కబళించి రాజాధిరాజ పరమేశ్వరుడు. పూర్వసింహాసనాధీశ్వరుఁడని చెల్లుకొనెను.[23] కాని కాటయ వేముఁడాతనిని తేలికగా విడిచి పెట్టలేదు. ఆతని నైన్యైన నా ప్రాంతమునుండి తరిమివేయ సంకల్పించెను. అన్నదేవచోడుఁడీవిషయము గ్రహించి కాటయవేముని బద్ధశత్రువగు పెదకోమటి వేమునితోఁ గలిసెను. కాటయ వేమారెడ్డి విజయనగర దేవరాయల సహాయము నర్థించెను. ఉభయసైన్యములకు అత్తిలి, కాకరపర్తి, జగ్గువాగుల యొద్ద ఘోరయుద్ధములు జరిగినవి ఈ దిగ్విజయము లన్నియు అన్న

22. దక్షిణ హిందూదేశశాసన సంపుటము 4, నం. 1347.

23. డిటో డిటో డిటో.

దేవచోడుని రాజమహేంద్రవర మ్యూజియము శాసనములో చక్కఁగా నభివర్ణింపఁబడినవి. తురుష్కరాజుతో చేరి కర్ణాటరాజుల బలమును ధ్వంసముజేసి జగ్గువాగు మొదలగు ననేక పట్టణములను స్వాధీనపఱచుకొనెను; దాక్షిణాత్యరాజులను అత్తిలికి సమీపమున నోడించి ఆనగర ప్రాకారములో దాగియుండిన శత్రువులను పదివేల మందిని అభయమిచ్చి రక్షించెను; తన మిత్రునొకనిని సంరక్షించు నిమిత్తము తన బావమఱఁది పిన్నుండి రాజు అధ్వర్యుఁడుగ, కన్నడులు మొదలైన శత్రువులను యజ్ఞ పశువులుగఁ జేసి గౌతమీనది తీరస్థమైన నాకరపర్తి వేదికపై తానొక వీరయజ్ఞము చేసెనఁట.

భూత్వాతురుష్క నృపతేస్సగరే సహాయః
కర్ణాటసైన్య మసిమాత్ర సఖో వ్యనైషీత్.
యేనైవ భూపిదిత మత్తిలి సీమ్ని సర్వా
న్నిర్జిత్య దక్షిణ దిగీశ్వర వైరిభూపాః
తత్పట్టనావరణ మధ్యగతాశ్చ నమ్రా
స్సంరక్షితా దశసహస్రమితా విపక్షాః.
అధ్వర్యుభూత పినయుండి నృపేణ యేన
శ్రీ గౌతమీ నికట నాంకఱపర్తి వేద్యాం
ఆలభ్య కన్నడముఖారిపశూ నకారి
వీరాధ్వరో నిజసుహృత్పరి రక్షణాయ.

పై శ్లోకముల యందలి చరిత్రాంశముల నన్నింటిని సుప్రసిద్ధ చారిత్రులగు శ్రీడాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు శాసనపరిష్కార సందర్భమున విపులముగ చర్చించియున్నారు. మరల వాని నిట తడవుట యనవసరము. పై యుద్ధములలో బహుశః నాకరపర్తి యొద్దనే కావచ్చు నాతఁడు కాటయవేముని వధించి స్వపదాంబుజ ప్రణతులైన కాటయవేమ వంశీయులను కీర్త్యేక వత్స

లతచే సంరక్షించి 'శరణాగత భూపరక్షా దీక్షాగురు'వని ఖ్యాతి బడసెను.

పాదాంబుజ ప్రణత కాటయ వేమవంశః
కీర్త్యైకవత్సలతయా సమరక్షి యేన
సోఽయం విభాతి శరణాగత భూపరక్షా
దీక్షాగురు ర్జయతి చోడకులాన్న దేవః.

ఈ యుద్ధముల ఫలితముగ నన్న దేవచోడునకు గోదావరి పశ్చిమతీర ప్రాంతమంతయు పూర్తిగ స్వాధీనమైనది. ఆతఁడు వెంటనే పాలకొల్లు క్షీరారామేశ్వర శ్రీమన్మహాదేవుని సందర్శించి శక వర్షములు 1335 అనఁగా క్రీ. శ. 1413 లో తమ తల్లిదండ్రులు అన్నమాంబాభక్తిరాజుల పేర కొన్ని దానములు చేసి శాసనములను వెక్కించెను[25]. కానిజయలక్ష్మి యన్న దేవునికడ స్థిరము కాలేదు. కాటయ వేమారెడ్డి మరణానంతర మాతని వియ్యంకుఁడగు దొడ్డ అల్లాడరెడ్డి కాటయ వేముని సంతతిపక్షము వహించి స్వామిద్రోహ పరాయణులు, కున్నృపతులగు ఆతని ద్రోహికులమును సమస్తమును నిర్మూలము గావించెనఁట.

స్వామిద్రోహ పరాయణ
కున్నృపతి జలరాశి జలధి నిమగ్నధరాం
దొడ్డయ యల్లన కేంద్రో
హరిరివ సౌకర్య్యా తస్సముద్ధృతవాన్.
(అని తల్లి కలువచేఱుశాసనము,
గతేదిశం గాటయ వేమ భూపే
నిర్మూల్య తద్ద్రోహికులం సమస్తం.
(పలివెల శిలాశాసనము[26])

24. ఎపిగ్రాఫియా ఇండికా. సంపుటము 26. పుటలు 14-48.
25. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 5. నం. 145
26. డిటో డిటో నం. 113.

క్రీ. శ. 1414 తర్వాత అన్నదేవచోడుని శాసనములు మఱి గాన్పింపకుండుటచే నాతఁడు దొడ్డయల్లాడరెడ్డి చేతిలో క్రీ.శ. 1415 ప్రాంతమున మృతినొందె ననుట స్పష్టము.

అన్నదేవచోడుఁడు గొప్ప పట్టుదలగల రాజు. పోయిన రాజ్యమును మరల స్వశక్తి సామర్థ్యముల వలన సంపాదించి కొద్దికాలమైనను బాలించినఁగాని యాతఁడూఱకొనలేదు. భయ మెఱుఁగనివాఁడు. రణలాలసుఁడు. తుదకు రణరంగముననే వీరస్వర్గ మలంకరించెను.

అన్నదేవచోడుఁడు గొప్ప శివభక్తుఁడు. శైవాలయములకును, బ్రాహ్మణులకు నాతఁ డనేక దానము లొసంగినట్లు త్రిపురాంతక, దాక్షారామ, పోలవర, పాలకొల్లులలోని ఆతని శిలాశాసనములే చాటుచున్నవి. రాజమహేంద్రవర మ్యూజియము తామ్రశాసనమునుబట్టి ఆతఁడు షట్కాలములయందు శివుని బూజించెడివాఁడని తెలియుచున్నది.

"షట్కాలపూజిత సదాశివపాదపద్మో
నిత్యాన్నదాన నియమార్చిత భూమిదేవః"
"నిత్యం గిరీశ చరణా వరుణోదయాది
వేలాసు షట్స్వపి ముదాయుత సంఖ్యదీపైః".

ఆతని దాక్షారామ శాసనములోని "షట్కాలమిూశార్చన" మను దానినిబట్టి ఈ విషయము మఱింత స్పష్టమగుచున్నది. ప్రస్తుత శాసనములోఁ గూడ శ్రీ త్రిపురాంతక మహాదేవునకు సోమవారోత్సవము లాకల్పాంతము జరిపించుటకుఁగాను కాంచనపల్లి దానమియఁబడినదని గలదు.

ఈతఁడు సూర్యవంశజుఁడగు శ్రీ చక్రవర్తి కుమారుఁడు. పిన్నుండిరాజు సోదరియగు ఇరుగాంబికను వివాహమాడెను. ఆమె

యందు వీరభద్రుఁడనే పుత్రుఁడు జన్మించెను. పాప మీతఁడుకూడ దొడ్డయల్లాడరెడ్డి చేతిలో మరణించినట్లు కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు దెల్పుచున్నాఁడు.

భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్రు
గర్వసంరంభంబుఁ గట్టిపెట్టి.

ఇంతటితో నీ వెలుగోడువంశజుల చరిత్ర మంతమయిన దనియే చెప్పవలెను.

ఇందు పేర్కొనఁబడిన కంచనపల్లి యెచ్చటిదో స్పష్టముగఁ దెలియుటలేదు. ఈ దానశాసనమును రచియించిన కవి జగన్నాథుఁడు. కవిత్వము సరసముగఁ జక్కగ నున్నది. ఈ శాసనకాలమునుబట్టి ఆతఁడు క్రీ. శ. 1338 ప్రాంతమువాఁడని తెలియుచున్నది.

తమచేఁ బరిష్కృతమగు చోడభక్తిరాజు పెంటపాడు తామ్రశాసనములోని శ్లోకములను గొన్నింటి నిందుదహరించుటకు దయతో నంగీకరించిన శ్రీ హెచ్. కె. నరసింహస్వామిగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

## శాసనమూలము

1. శ్రీ శాకే దశవిశ్వభాజి విభ
2. వే మార్గేశ్ శశాంకగ్రహే దేవాయ
3. త్రిపురాంత్తకాయ మహతే శ్రీ సో
4. మవారోత్సవాత్ । ఆకల్పం భువి క
5. త్తుర్ణ మున్నత మదాత్ భక్త్యేశసూను
6. ర్ముదా కాంచిత్ కంచ్చనపల్లి మం

7. చిత యశో శ్రీ యన్న దేవేశ్వరః[27].
8. లక్ష్మ్యాః పూర్వజ మసేవ్య జీవన మ
9. యే భంగాంకితే బాడబాతంకే
10. పంకమయే జడే జడనిధౌ జా
11. తేతి జాత త్రపా । ప్రాదు భూ్భర్జయ
12. సుభేన సద్గుణ గణాం భో
13. ధౌ ముదా మోద తే యస్మి న్
14. సంతత మన్న దేవనృపతౌ రాజ
15. న్య చూడామణౌ[28]॥ కంచనపల్లి
16. శాసన మ...జగన్నాథ వి
17. రచితం జీయా...ద్ భూ మ
18. రుద్రమ... ... ...
19. మాసము (ద్రం[29] మంగళ)
20. మహా శ్రీ శ్రీ శ్రీ.

---

27. శార్దూల విక్రీడితము.
28. డిటో.
29 ఆర్యా కావచ్చును.

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము—నాడులు

కుందూరి ఈశ్వరదత్తు.

(గతసంచిక తరువాయి)

## అహారుపాకనాడు

సింహాచల దేవాలయములోని యొక శాసనములో రాపర్తి మంగిరాజుల మహాదేవి ల వి తనకొడుకు ఉపేంద్రరాజున కాయురారోగ్యాభివృద్ధిగా స్వామికి రెండు అఖండదీపములు వెట్టించి వానినిమిత్తము ఆహాఱుపాకనాటిలోని మండప మనెడి గ్రామమును ధారవోసి యిచ్చెను. ఈ రాపర్తి సామంతుల శాసనములు ద్రాక్షారామ దేవాలయమునందుఁ గలవు. ఈ మండపము తూర్పుగోదావరీ మండలములోని పెద్దాపురము తాలూకాలోఁ గలదు. ఆహాఱు పాకనాడు ప్రోలునాటికిని చాగల్నాటికిని మధ్యప్రదేశమై యుండనోపును.[1]

## సకటమంతినాడు

సకటమంతినాడు తూర్పుగోదావరీ మండలమున నుండెను. దీనిని బేర్కొన్న శాసనములు సామర్లకోట సమీపమున నున్న చాళుక్య భీమవరమునఁ గలవు. వానిలో నొకదానియందు రాజేంద్ర చోడమండలమైన గోదావరి వడగర సకటమంతనినాటి చాళుక్య భీమేశ్వర దేవరకు శ్రీ రాజేంద్రచోడదేవుని గురువులు సర్వసిద్ధి పండితుడు దీపదానము చేసి దానికొఱకు రెండువందల యేఁబది గొఱ్ఱెల దానముచేసెనని వ్రాయఁబడినది అట్లే యింకొక శాసనమున సరఁ

దక్షిణహిందూదేశ సంపుటము. 6 సంఖ్య 692. (సింహాచలములోని శాసనము).

2. దక్షిణహిందూదేశశాసనసంపుటము. 4. సంఖ్యలు 1019, 1038, 1245 (ద్రాక్షారామశాసనములు).

లోకాశ్రియ విష్ణువర్ధనమహారాజులు కులోత్తుంగచోడమండలమున, గంగంగొండ చోడవలనాటిలోని సకటమంతనాంటి రాజనారాయన పురమున రాజనారాయనదేవరకు అభిషేకనిమిత్తము సంధ్యాకాలములందు నాలుగు కుంచములపాలు నిబంధనము గావించినట్లుగలదు.

దాక్షారామ శాసనములో నొకదాని యందు చోడదేశవాసుఁడైన మార్తాండవేలారు గావించిన దానశాసనములో 'సకటమంతనినాటి రాజేంద్రచోడ చతుర్వేదిమండలమున నేనూట యిర్దరి మహాజనులు చింతపల్లి పొలమున నిరువది పుట్టులేల కృషిచేసి యిరువది బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు నిబంధనము గావించినట్లు వక్కాణింపఁబడినది. ఈచింతపల్లిగ్రామము కాకినాడ తాలూకాలోఁ గలదు. చాళుక్య భీమవరము సహిత మాతాలూకాలోనే గలదు. కావున సకటమంతనినాడు కడలునాటిని, సరిహద్దులఁ జేరియుండెనని చెప్పవచ్చును

కులోత్తుంగచోడమండలము రాజేంద్రచోడుని బిరుదునామమైన కులోత్తుంగచోడాభిదానమువలనఁ గలిగెను. అతని రాజధాని గంగైకొండచోళపురము. ఆ రాజధాని పేరనే గంగైకొండచోడమునాడను పేరుగలైను చాళుక్యచోళుల పరిపాలన కాలములో వేఁగి కళింగములు కులోత్తుంగచోడమండలములో నంతర్భాగమై వేంగి కళింగ మండలములలోని వివిధ నాడులు సహితము వీర సామంత సేనానాయకులు వ్రాయించిన శాసనములలో నీ ప్రాంతముల నాడులు కులోత్తుంగచోడమండలములోని యంతర్భాగముగానే పరిగణింపఁబడెను. ప్రోలునాడు గుదిద్రవారము గంగైకొండ చోడవలనాటిలోని వనియే శాసనములలో వక్కాణింపఁబడినవి ఈ విషయము ద్రాక్షారామ శాసనములు పరిశీలించినచోఁ దెలియనగును.

ప్రకటమంతనినాటిని పేరొక్కొన్న శాసనములఁ గొన్నిటిని జూపుచున్నాను[2].

తూర్పుగోదావరి మండలములోఁగల పొత్తపినాటినిగూర్చి యిదివఱకు చర్చించియున్నాము. పొత్తపినాటిని పేర్కొన్న రెండు శాసనముల నిందుదాహరించుచున్నాను. సింహాచలములోని యొక శాసనములో "నాగవంశోద్భవుఁడైన శ్రీ మన్మహామండలేశ్వర సంగనాంటి మంగరాజులు పొత్తపినాడులోని పట్టపు నెలవైన పొతడ మారెడ్లపూడి తూర్పున ఊడుపుభూమి రెండు పుట్లు స్వామికి దీపారాధన నిమిత్తము దానము చేసినట్లుగలదు[3]. ఈ మారెడ్లపూడి అనకాపల్లి తాలూకాలోఁ గల మారేడుపూడి యనుగ్రామము. చాళుక్య భీమవరములోని యొక శాసనములో నాగవంశోద్భవుడైన సెమ్మంగిరాజుల భోగమహిషియైన ప్రోలక్కనగ్రపుత్త్రుడు సంకరాజు తననిజవృత్తియైన పొత్తపినాంటిలోని నడుపూరు చతుస్సీమమును కుమారారామ భీమేశ్వరునకు తండ్రి ధర్మార్థముగా అనుపడిన సుఫ్సనకు ధారపోసి యిచ్చె"నను విషయ మిదివఱకె వ్రాసియున్నాను. ఈనడుపూరు గ్రామము ప్రోలునాటిలోని గ్రామమేదైన యుండవచ్చుననియు, కాకినాడ తాలూకాలోని నడకుదురుగానోపుననియుఁ

1. కొండపడిమిలో త్తుంగభ్రోడదేవుని భీమవరము శాసనము. (ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 6. పుటలు. 219. 223).
2. చాళుక్య భీమవరములోని శాసనములు. దక్షిణహిందూదేశశాసన సంపుటము. 5. సంఖ్యలు 42, 62, 66.
3. దాక్షారామశాసనము. దక్షిణహిందూదేశశాసన సంపుటము. 4. సంఖ్య. 1281.
3. దక్షిణహిందూదేశశాసన సంపుటము. 6. సంఖ్య. 1187.

జెప్పియుంటిని. ఈ నడుపూరు గ్రామము విశాఖపటణము తాలూకా లోని నడుపూరు గ్రామమని యూహించుచున్నాను సొత్తపినాటి లోని సూరేడుపూడి, నడుపూరు గ్రామములు అనకాపల్లి, విశాఖ పట్టణము తాలూకాలలో నుండుటచేత పొత్తపినాడు పోలునాటి కుత్తరమున పైనుదాహరింపఁబడిన తాలూకాల ప్రాంతమని చెప్ప వచ్చును.

## చీకూరవిషయము

ప్రాచీనాంధ్రమండలాంతర్గతమైన విషయము లేక నాడులలో నిదియొకటి తూర్పుగోదావరి మండలములోని చోడవరము తాలూకా శరభవరమను గ్రామమున దొరికిన ఎనిమిదవ శతాబ్ది సంస్కృతశాసనములో నిది పేర్కొనఁబడినది ఆశాసనభాగ మీ దిగువ నిచ్చుచున్నాను.

ఈ శాసనములో దాతపేరు లేదు. ప్రతిగ్రహీత హారిత గోత్రుఁడైన హరిశర్మ యనుబ్రాహ్మణుడు. దాన మొసంగఁబడిన గ్రామము పులక- విజయచీకూరపురమునుండి యీయఁబడినది. చీకూరపురము చోడవరము తాలూకాలోని చీడీరు. పులక లేక పులోక యనునది యీ తాలూకాలోపలదేయగు పలకూరు అనుపల్లె చీకూరవిషయమును నేటి తూర్పుగోదావరిమండలములోని ఉత్తర మన్య ప్రాంతమని యూహింపవచ్చును

## ఎఱడ, లేక ఎరడవిషయము

ప్రాచీన కళింగాంతర్భాగ విషయములలో నిది యొకటి. పండ్రెండుపదుమూఁడవ శతాబ్దములనాఁటి శాసనములలో దీని ప్రశంస

4. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 13 పుటలు 104, 105.
"ఓం. స్వస్తిశ్రీ విజయచీకూర పురాత్ ..... చీకూరవిషయాధిపతిః పులకగ్రామవ్యాపారయుక్తః ... అజ్ఞాపయతి॥

గలదు. విశాఖపట్టణము తాలూకా సింహాచలమునందును, విజయనగరము తాలూకాలో రెల్లివలస గ్రామములోను గల శాసనములలో నిది పేర్కొనఁబడినది,

సింహాచల శాసనములలో ఎరద విషయములోని వని యీ గ్రామము లుదాహరింపఁబడినవి

"కళింగ దేశమందున ఎరదవిషయానను తాండ్రింగి,
మోద్రింపాలు, పినకెల్ల, కరటము, వెలఁగాలు.
వెంటిగారఁబల్లి......" (శాసనసంపుటము. 6 సంఖ్య 1052)

ఆ గ్రామములు నేటి తొండరంగి (చీపురపల్లి తాలూకా) కరటాము (విజయనగరము తాలూకా), వెలగాడ (చీపురుపల్లి తాలూకా) కెల్ల (విజయనగరము తాలూకా) గ్రామములు.

విజయనగరము తాలూకా సారిపల్లి రెడ్డిపాలెము ని యొక్క శిలాశాసనములో "ఎఱడపంప్పున తాలాండి పండెల్గిణ్గికి నైరుపైన ధర్మవారమున చోడగంగేశ్వర దేవరకు." అని ఎఱడవిషయము లోని ధర్మవరము గ్రామము పేర్కొనఁబడినది. ఈ గ్రామము విజయనగరము తాలూకాలోని ధర్మపురి యనుగ్రామము. (శాసన సంపుటము 10– సంఖ్య 702, ఆశాసనసంపుటములోని 707, 708, 709, సంఖ్యగల రెల్లివలస శాసనములలో ఎఱదవిషయ ముదాహరింపఁబడినది.

(1) ఎఱడపంప్పున తాలంక పండెల్గిణ్గిలోని తటరాన
(2) ఎఱడపంప్పున తాలాండ చోడగంగ మహాదేవరకు
(3) ఏఱడపంప్పున తాలాండచోడగంగమహాదేవర గుడిస్థానాపతితనము.

ఈ ఎఱదవిషయము విజయనగరము, చీపురుపల్లి తాలూకా ప్రాంత మని యూహింపనగును.

## ఏఱువనాడు

ఏఱువనాడు ప్రసిద్ధమైన ఆంధ్రదేశవిభాగములలో నొకటి. పీసరనాటినిగూర్చి వ్రాయునపుడు ఏఱువనాటినిగూర్చి వ్రాసియుంటిని. ఈనాటిని పాలించిన ఏఱువభీముఁడు పీసరనాడు, చక్రకోట్టము వేంగి, కళింగాది దేశముల జయించినట్లు తాళ్ళప్రొద్దుటూరి శాసనములోని పద్యము చాటుచున్నది. ఈ ఏఱువ కాకతీయులకాలములో కాయస్థసామంతుడైన గండయసాహిణి అంబదేవమహారాజు పరిపాలనమం దుండెను. ఇతఁడు కడపమండలములోని కడపతాలూకా వల్లూరు రాజధానిగ నేటిదత్తమండలముల నేలుచుండెను. రాజంపేట తాలూకా పోలిగ్రామములోని శాసనములో ఏఱువవిషయము పేర్కొనఁబడినది కర్నూలుమండలములోని త్రిపురాంతకశాసనములలో నొకదానియందు అంబదేవమహారాజు బిరుదములలో ఏఱువమల్లిదేవుని తలగొండుగండ యనుబిరుద మొకటి నెల్లూరుమండల శాసనసంపుటములలోని అచ్యుతదేవరాయల కాలమునాటి యొక శాసనములో కొచ్చెర్లకోట కొండవీటి రాజ్యములోని ఏఱువనాటిలోనిగ్రామ మని యిట్లు చెప్పఁబడినది- "కొండవీడీమహారాజేఁ మండల పరిశోభితే ఏరువనాడు విఖ్యాత కోచెర్లకోట సీమని .." ఈ కొచెర్లకోట నెల్లూరిమండలములోని దర్శితాలూకా కొచ్చెర్లకోట యను చరిత్రప్రసిద్ధమైనగ్రామము. తాళ్ళప్రొద్దుటూరి శాసనము సమగ్రముగా ప్రకటించిన సుప్రసిద్ధచరిత్రకారు లిరువురు ఏఱువనాడు కమ్మనాటికి పశ్చిమమునను పాకనాటికి పశ్చిమోత్తరమునను, పల్నాటికి వాయువ్యమునను నుండెననియు, ఇప్పటి నెలూరి జిల్లాలోని పొదిలి, దర్శి. తాలూకాలలో కొంతభాగమును, కడప జిల్లాలోని బద్వేలు సిద్ధవటము తాలూకాలలో కొంతభాగమును,

కర్నూలుజిల్లాలోని మార్కాపురము తాలూకాయు చేరిన దేశము నకు పూర్వము తాలూకాయును చేరిన దేశమునకు పూర్వము ఏఱువ నా డని పేరని నిర్ణయించిరి.

## టెంకణము

కవిరాజశిఖామణి నన్నిచోడుఁడు కుమారసంభవకృతిలో దాను టెంకణాదిత్యుఁడనని చెప్పుకొనెను ఈ టెంకణముఁగూర్చి తెలుఁగుకావ్యములలో ప్రథమోదాహరణ మిదియే యని తలఁచు చున్నాను.

క. కలుపొన్నవిరులఁ బెరుగం
గలకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘుపరాక్రము డఁ డెంకణాదిత్యుండన్.

(ప్రథమాశ్వాసము. ప. 54)

అనంతపురముజిల్లా తాడిపత్రిగ్రామములోని రామేశ్వ రాలయమునందు శా. శ 1120 నాటి శ్రీమహామండలేశ్వర ప్రతాప కుమార ఉదయాదిత్య మహారాజు వ్రాయించిన కన్నడశాసనములో నీ టెంకణమండలము పేర్కొనఁబడినది. ఈ శాసనము ఆంధ్రదేశ ప్రాచీన చారిత్రక భూగోళవిషయమునకు ముఖ్యమైనది.

1. మార్కాపురము లోని త్రిపురాంతక శాసనములు సంఖ్యలు 460, 463, 465.
2. కల్లూరము దంశాసనసంపుటములు, అచ్యుతరాయల శాసనము, సంఖ్య. 10
3. తాళ్ళ ప్రొద్దుటూరి శాసనము – భారతి ఈశ్వర సం. మాఘమాస సంచిక.

నవరత్నభరిత జలచరనివహపరిక్షుభిత బహళకల్లోలరవ
ప్రవిఘూర్ణమాన లవణార్ణవపరివృత మనిప్పుదింతుజంబూ
ద్వీపం॥
అముతల సహస్రయోజనగదిత సువిస్తారమాగి సమవృత్తాకా|
రదిసర్పడడఱ మధ్య ప్రదేశ దోళ్మంధరాద్రి సొగయిసి
తోర్ప-
మేరుమహీధరద తెంకణభారతవర్ష దొళు మనోహరియి
దెంబిననొళ్ప కుంతలదేశదపూర్వభాగదొళు
సొరియురప్పుదంధ్రదరణీతల వందముండ తెంకణధారణియల్లి
పెన్నపరినాడు నిరంతర ఒప్పితోర్గుం॥
(దక్షిణహిందూదేశశాసన సంపుటము 4- సంఖ్య 798)

జంబూద్వీపములో భరతవర్షమునందు కుంతలదేశమునకు పూర్వదిక్కున ఆంధ్రదేశమునందు తెంకణరాష్ట్రములోని పెన్నపరినాడొప్పియుండెనని దీనిభావము

## తెంకణాదిత్యబిరుదాంకితులు

ఈ బిరుదము వహించినవారలలో రేనాడేలిన వెంకయచోడమహారాజు ప్రథముడు. కడపజిల్లాలోని సిద్ధవటముతాలూకా దొంగలసానిగ్రామ శాసనములలో నితనికి తెంకణాదిత్యుడని బిరుదము కలదు. ఈ శాసనము పదియవశతాబ్దినాటిది. రెండవవాడు కొణిదెనచోడులలో ప్రసిద్ధుడైన త్రిభువనమల్లదేవచోడ మహారాజు. ఇతనికి తెంకణాదిత్య బిరుదము కలిగియున్నట్లు గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకా కొణిదెన గ్రామమునందలి శంకరస్వామి దేవాలయములోని శాసనములో నిట్లు లిఖింపబడినది. "ఆదిత్యవంశ తిలకుండు తెంకణాదిత్యుండు దుర్జయుండా త్రిభువనమల్లధాత్రీనాథుం డుర్విక" ఈ శాసనకాలము శా. శ. 1034.

ఆ దేవాలయములోని కాకతీయగణపతి చక్రవర్తి సామంతుం డగు కమ్మనాం డేలిన రెండవ ఓపిలిసిద్ధికి తేంకణాదిత్యబిరుద మున్నట్లు వ్రాయంబడియున్నది. రేనాంటిచోళులు, పొత్తపినాటి చోళులు, కమ్మనాటికొణిదెనచోళులు, తెంకణమును తమబాహు పరాక్రమముచేజయించి వారివారిరాజ్యములలోం గలుపుకొని యుండ వచ్చును. ఈ ప్రాంతము కమ్మనాటికి దక్షిణమునను పాకనాటికి పడమటను ములికినాటి కుత్తరమునను గల ఇప్పటి అనంతపురము కడపజిల్లాప్రాంత మని చెప్పవచ్చును[6].

## పూంగినాడు

ఈ పూంగినాడు ప్రాచీనాంధ్ర రెడ్లచరిత్రమునందు ప్రసిద్ధి కెక్కిననాడులలో నొకటి. ప్రోలయవేమారెడ్డి రాజధానియైన అద్దంకిపట్టణ మీ పూంగినాటిలోనిదే.

ఆసే శ్రీగిరిపూర్వపాదనికటా దాపూర్వపాథోనిధేః
దేశః కుండితరంగిణీ ముభయతః శ్రీపూంగినామాంకితః
తస్మిన్ భాసుర సౌధగోపురవతో నిత్యోత్సవాలంకృతా,
నందత్ పౌరజనా విభాతి నితరా మద్దంకినామాపురీ॥

శ్రీ పర్వతపూర్వపాదము మొదలు పూర్వసముద్రమువఱకు గుండ్లకమ్మనదికిరుపార్శ్వములను గలదేశమునకు పూంగినాడని పేరు. దానికి అద్దంకి రాజధాని.

(ఎపిగ్రాఫియాఇండికా. సం॥ 8. పుట 15 అనవేముని మద్రాసుమ్యూజియము శాసనము.)

---

6. దొంగలసాని శాసనము (తిలింగరజతోత్సవసంచికయందు ప్రకటింపఁబడినది. కొణిదెవశాసనములో దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 6. సంఖ్యలు 624. 628 శాసనములం జూడనగును.

అట్టే రెండవదేవరాయల తామ్రశాసనములలో నొకదాని యందు గుండ్లకమ్మయొడ్డున పూంగినాటివిషయములోని పోలవరమనెడి గ్రామమును చేజెర్ల యని నామాంకితముచేసి బ్రాహ్మణోత్తముల కగ్రహారముగా నిచ్చెనని కలదు. ఈ చేజెర్ల గుంటూరు మండలములోని ఒంగోలు తాలూకాలో కలదు.

## గుండ్లకమ్మ

ఈ గుండ్లకమ్మనదికి కుండితరంగిణి యనియు, కుండిప్రభా యనియు, బ్రహ్మకుండి యనియు నామాంతరములు ఇది కర్నూలు జిల్లాలోని నల్లమలల సమీపముననున్న గుండ్లబ్రహ్మేశ్వరమునొద్ద పుట్టి, జంపిలేరు, ఎనుమలేరు అను ఉపనదులను జేర్చుకొని, కంబము గ్రామమును జుట్టుకొని నెల్లూరుమండలములోని పొదిలి, దర్శి డివిజనులగుండా ప్రవహించి, మార్కాపురమును దాటి, వినుకొండ తాలూకాలోని ముమ్మిడివరము సమీపమున తూర్పుదిశకు మరలి ఒంగోలుతాలూకా దక్షిణభాగముగుండా, ఒంగోలు నగరమునకు ఉత్తరమువైపున పండ్రెండుమైళ్ళదూరముననున్న పెద్దదేవరంపాడు సమీపమున తూర్పుసముద్రమునఁ గలియుచున్నది. ఈ నది కిరువంకల, నెల్లూరుమండలములోని ఉత్తరభాగమును, కర్నూలు గుంటూరు మండలములలోని తూర్పుదక్షిణభాగములును, పూంగినాడై యున్నది.

నెల్లూరుమండలశాసనసంపుటములలోని శాసనసంచయమునందు పూంగినాడు పేర్కొన్న కొన్నిశాసనముల నుదాహరించుచున్నాను.

కందుకూరు (1) పూంగినాంటిలోని అగ్రహారము భీమావరము ప్రసన్న కేశవదేవరదీపానకు (ఈ భీమవరము కందుకూరుతాలూకాలో నున్నది.)

ఉదయగిరి (7) పూంగినాటిలోని మిద్దికలు, గుడిమెట్ట, బద్ది
మడువు, జోకూరు, ఉప్పరపూరు, రావిపాడు,
కలపాడు, జమ్రిపడియ, సంగము, గోనుగుంట,
గుడిపాడు, బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చి...

పైని వివరింపఁబడిన గ్రామములలో గుడిమెట్టయు, రావిపాడును కంబంతాలూకాలోను. గోనుగుంట జమ్రుపడియ, ఒంగోలు తాలూకాలోను, సంగము గుడిపాడు దర్శి తాలూకాలోను గలవు.

త్రిపురాంతకములోని రెండుశాసనములలో పూంగినాంటిలోని ముశికఋతి కెదుతెపల్లి యను గ్రామమొకదానియందును, పూంగినాటిలోని ముశికఋతి 'రేడుమడపల్లియనెడి' యనెడు గ్రామమును రెండవదానియందును బేర్కొనఁబడినవి. ముశి యను నది వెలగొండలలో నుద్భవించి పొదిలి దర్శి, కందుకూరు, ఒంగోలుతాలూకాల గుండా ప్రవహించి, ఒంగోలుతాలూకా అనంతవరము గ్రామసమీపమున సముద్రగామియగుచున్నది. ఈమూశినదిగుండ్లకమ్మకుదక్షిణము గాను పాలేరునది కుత్తరముగాను ప్రవహించుచున్నది. త్రిపురాంతకములోని మూశీయొడ్డున నున్న రెండుగ్రామములేవో నిర్ణయించుటకు వీలులేకపోయినది. కీర్తిశేషులైన శ్రీ రామయ్యపంతులుగారు కొండవీటిరెడ్ల శాసనములు ఎపిగ్రాఫియాఇండికా పదునొకండవసంపుటములో ప్రకటించినపుడు ఆ పత్రికా సంపాదకులగు శ్రీకృష్ణశాస్త్రిగారు పాకనాటి పూంగినాటి విషయనిర్ణయమును గావించుచు, తమసంపాదకీయ వివరణమునందు పూంగినాడు పాకనాటిలోని భాగమే యనియు, తమిళశాసనములలోని పాక్కైనాడనునది పూంగి, పూగిపోకపదభవమే యనియు, పాకనాఁడను పెద్దదేశవిభాగనామము చిన్నవిభాగమైన పూంగివిషయనామమువల్లనే కలిగియుండు ననియు వక్కాణించియున్నారు.

7 South Indian Inscriptions Vol X. No. 355 ; 371.

## పంటరాష్ట్రము

ఈ పంటరాష్ట్రము నెల్లూరుమండలములోని పాకనాటికి దక్షిణదిగ్భాగమున నున్న చిన్న నాడులలో నొకటి. నెల్లూరి చోడరాజగు తమ్ముసిద్ధి తాను వ్రాయించిన కంచి అరుళాళపెరుమాళ్ళ దేవాలయములోని శా. శ. 1127 శకాబ్దమునాటి దానశాసనములో పంటరాష్ట్రములోని ముట్టియంపాక యను గ్రామమును దేవునికి దానము చేసెనని గలదు. ఈ ముట్టియంపాక యనుగ్రామము గూడూరుతాలూకాలోని ముట్టెంబాక యనుగ్రామము.

సఖిలు సమస్తసామ్రాజ్యాయ నెల్లూర్నగరే
కృతాభిషేకః శ్రీగణ్డగోపాల శ్రీదేవీవీరసూతి
ర్మన్మసిద్ధిమహారాజానుజన్మా తమ్ముసిద్ధి
మహీపాలః పాలయ న్నఖిలా మర్ణవాంబరామ్॥
దేవాయాస్మై హస్తిశైలేశ్వరా య
స్థాయ ద్భూమ్నే సారయో గ్యే శకాబ్దే
...ద్ధిమ్ పంటరాష్ట్ర ప్రధానమ్
ప్రాదాత్ గ్రామం ముట్టియంపాక సంజ్ఞామ్॥

రెడ్డిసంచికసంపాదకులు "పంట-దేసటి మహాన్వయము" అనువ్యాసమున పంటదేశమునుగూర్చి వ్రాసినవిషయము గమనింప వలయును. ఈ పంటరాష్ట్రము రెడ్లచరిత్రకు ప్రాముఖ్యత వహించుచున్నది[8].

## ముండరాష్ట్రము – ముండనాడు

ముండనాడు లేక ముండరాష్ట్రము నెల్లూరి మండలములలో నుత్తరభాగమున నున్న ప్రాచీనదేశవిభాగములలో ప్రసిద్ధకెక్కి-

---

8. ఎపిగ్రాఫి యాఇండికా సంపుటము. 7. పుట 157
రెడ్డిసంచిక. పుటలు 140-141.

యుండెను. ఈ ముండనాడు పల్లవసంస్కృతశాసనములలోను, నెల్లూరుమండలములలో పెన్నానదికి ఉత్తరముననున్న కోవూరు తాలూకాలో వెలువడిన తమిళశాసనములందును పేర్కొనఁబడినది. శ్రీ సోమశేఖరశర్మగారు మద్రాసు విశ్వవిద్యాలయ పత్రిక పంద్రెం డవసంచికలో ప్రచురించిన పల్లవ రెండవసింహవర్మ బుచ్చిరెడ్డి పాలెము శాసనమునందును, శ్రీ వెంకటరామయ్యగారు మద్రాసు ప్రాచ్యపరిశోధకపత్రిక పంద్రెండవసంచికలో ప్రచురించిన ప్రాచీన దేశచారిత్రిక భూగోళమను వ్యాసమునందు, ముండరాష్ట్రమునుగూర్చి విపులముగ చర్చించిరి. ఆ వ్యాసములోని సారాంశమే యిందు పొందుపఱచుచున్నాను.

ముండరాష్ట్రము సింహవర్మ పికిరశాసనములోను, విష్ణుగోపుని ఉరువపల్లిశాసనములోను, నెల్లూరుజిల్లాలోని నెల్లూరు, కోవూరు, ఆత్మకూరు గ్రామములలోఁ గొన్నిటియందును పేర్కొనఁబడినది. ఉరువపల్లిశాసనములోని ఉరువపల్లి, కెందుకూర, కరుపూర యను గ్రామములు ఆత్మకూరుతాలూకాలోని ఉలపాళ్ళ నెల్లూరుతాలూకా లోని గొల్లకందుకూరు, కనుపూరు గ్రామములై యున్నవి. ఉరువ పల్లిశాసనములోని కొండమురువుడను గ్రామ మేదో తెలియదు. శ్రీ వెంకటరామయ్యగారీ గ్రామము ఆత్మకూరుతాలూకాలోని కొండ మీఁది కొండూరను గ్రామమని వ్రాసియున్నారు. బుచ్చిరెడ్డిపాలెము శాసనములో దానమీయఁబడిన విడువట్టిగ్రామము కోవూరు తాలూకాలోని విడవలూరను గ్రామము. నెల్లూరుశాసన సంపుటము లలోని ముండనాటిలోనివని పేర్కొన్న గ్రామము లీదిగువ నిచ్చు చున్నాను. ఈ గ్రామములు కోవూరు తాల్లూకాలో గలవు.

గండవరము :— నెల్లూరు (19) తమిళశాసనము.

కంఠనారాయణపురమను కులోత్తుంగ చోళపురము.

కొడవలూరు :- నెల్లూరు (31) తమిళశాసనము.
ముండనాటిలోని కొడవలూరు.

వేగూరు :- నెల్లూరు (121) తమిళశాసనము.
నెల్లూరునాటి ముండనాటిలోని వేగూరు

నెల్లూరు :- నెల్లూరు (72) తమిళశాసనము.
ముండునాటిలోని తామ్రైమడువు ఇది యే
కోవూరు తాలూకాలోని తామరమడుగు
గ్రామము.

నెల్లూరు :— నెల్లూరు (6) తమిళశాసనము,
ముండైనాటిలోని మూవడికుండై. ఇది కోవూరు
తాలూకాలోని మేడికుంటగ్రామము.

గుంటూరుజిల్లాలోని బాపట్లలోని భావనారాయణస్వామి వారి దేవాలయములోని శాసనములో "భావనారాయణ దేవరకు ముణ్డనాణ్టిలోని (వెలకలూరి బాదిరెడ్డికొడుకు కేతమరెడ్డి" యని ముండనాటిలోని వెలకలూరు పేర్కొనబడినది. ఈ వెలకలూరే కోవూరుతాలూకాలోని విడవలూరని నాయభిప్రాయము. లేదా ఆత్మకూరుతాలూకాలోని వెలగపాడై యుండవచ్చును.

కీర్తిశేషులైన ప్రభాకరశాస్త్రిగారు శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధకసంఘమువారి యెనిమిదవసంపుటము రెండవసంచికలో పల్లవ నరసింహవర్మ ప్రథమ తామ్రశాసనము ప్రకటించు సందర్భమున ముండరాష్ట్రమునుగూర్చి వ్రాసియున్నారు. ఆ శాసనములు క్రీ. శ. 701-702 నాటిది. దానిలో నిట్లున్నది.

"పరమమాహేశ్వర పరమబ్రహ్మణ్య బప్పభట్టారకపాదభక్త శ్రీనరసింహవర్మణః మేల్మణ్డరాష్ట్రే అసిధారపురస్యోత్తరే రేయూరునామగ్రామమ్ గ్రామేయకా నిత్థమాజ్ఞాపయతి

ఇందలి రేయూరుగ్రామము ఆత్మకూరు తాలూకాలోని రేపూరని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు. మేల్ముణ్డరాష్ట్రమనఁగా పడుమటి ముండనాడనియు వ్రాసియున్నారు.

"ఈశాసనమున దత్తాగ్రహారముగనున్న రేయూరు మేల్ముణ్డ రాష్ట్రములోనిదిగా నసిథాపురమున కుత్తరముగా నున్నట్టిదిగాఁ జెప్పఁబడినది పల్లవశాసనములలో నింతకంటె నూఱేండ్లకుఁబూర్వ కాలపువయిన 'పేకిరె' ఉరువుపల్లె తామ్రశాసనములలోను ఇంకను మఱికొన్నిచోట్లను ముణ్డరాష్ట్రము పేర్కొనఁబడినది. అది నేటి కందుకూరిప్రాంతమునుండి నాయుడుపేటప్రాంతములదాఁక వ్యాపించిన దేశముగా గుర్తింపఁదగినట్లున్నది. ఏలనఁగా నా శాసనములందు పేర్కొనఁబడినగ్రామము లాభూభాగమున నున్నవి. అంతకంటె నధికభూభాగమునకుఁగూడ నాముణ్డరాష్ట్రము వ్యాపించియుండ వచ్చును. మేల్మండరాష్ట్రము దానికిఁ బడుమట నుండవలెను. ప్రాచీనకాలమున మేల్ పదము 'మీఁద' 'పడుమర' అర్థములందును, తర్వాత ప్రశస్తము అనునర్థమునందును వాడుకగాంచినది. నేఁడు తూర్పుగోదావరి పడమటిగోదావరి యని విభక్తమయినట్లు ముండ రాష్ట్రము మేళ్ముండరాష్ట్రము, మేల్మండరాష్ట్రము అనియానాఁడు ద్విధా విభక్తమయి యుండును. అందొకటి ముండరాష్ట్రమనియు, రెండవది మేల్మండరాష్ట్రమనియు నాయాశాసనముల పేర్కొనఁ బడినది. నేఁడీశాసనము కాళహస్తిరాజాగారి నగరిలో దొరికినది. గావున కాళహస్తి రాజుగారికిఁ జెల్లుచువచ్చినదియు, కందుకూరు నెల్లూరు మధ్య భూభాగమునకుఁ బడుమరగా నుండునట్టిదియు నగు దేశవిభాగము మేల్మండ రాష్ట్రమగుననియు, రేయూరులు అక్కడ ఉండఁదగునేమో యనియును బరిశీలించితిని అసిథాపురము తెలియ రాలేదు. కాని ఆత్మకూరుతాలూకాలో రేవూరనుగ్రామమున్నది.

శాసనకాలమునాటి రేయూరు నేడు రేవూరుగా పేరుమాఱి యుండ వచ్చుననుకొంటిని. నాడు ముండరాష్ట్రముగాఁ జెప్పఁబడిన దేశపుఁ బడుమటి భాగముగావున నిది మేల్ముండరాష్ట్రమనఁ బరగినదని తలఁప వచ్చును,"

రేయూరుగ్రామ మాత్మకూరు తాలూకాయందుఁ గలదు గావున, ఆత్మకూరు తాలూకా కోవూరు తాలూకాకు పడుమటి దిశ నున్నది గావున, ఆత్మకూరు తాలూకా ప్రాంతము మేల్ముండరాష్ట్ర మగునని యూహింపనగును. ఇట్లే పాకరాష్ట్రము మేల్పాకరాష్ట్ర మును గలవని యిదివఱకు వ్రాసియుంటిని. పాకరాష్ట్రమునకు మేల్పాకరాష్ట్రము ప్రాచ్యదిశయం దుండెను.

## పెన్న — సుప్రయోగ

నెల్లూరుజిల్లాలోని కోవూరు, ఆత్మకూరు తాలూకాప్రాం తము ముండరాష్ట్రమని నిరూపించి యున్నాము. ఈప్రాంతము గుండా పెన్నానది ప్రవహించుచున్నది. ఈ పెన్నానదికే మహా భారత, మార్కండేయ పురాణాదులందు సుప్రయోగ యని పేరు గలదు. ఉరువుపల్లి శాసనములో ఆగ్రామసరిహద్దులు వ్రాసినపుడు "ఏతస్మిన్ గ్రామసీమే ద్విశతం సీమనివర్తనాని ఏతేషాం నివర్త నానాం అవధయః దక్షిణాందిశి సుప్రయోగనదీ అవధిః।" అని ఉరువుపల్లెకు సుప్రయోగనది దక్షిణదిశయం దుండెను తిక్కన సోమయాజి సంస్కృతమహాభారతము తెనిఁగించునెడ, దక్షిణాపద ములో నదులు పేర్కొన్న సందర్భముల నన్నిటియందును సుప్ర యోగకు మాఱుగ 'పెన్న'యనుపదమే ప్రయోగించెను. నెల్లూరు మండలవాస్తవ్యుఁడైన సోమయాజి సంస్కృత భారతములోని 'సుప్ర యోగ'కు బదులుగ 'పెన్న యనుపదమే వాడియుండుటచే సుప్ర యోగ యన్నను, పెన్నయన నొకనదికే నామము సిద్ధించునవిచెప

వచ్చును. శ్రీ సోమశేఖరశర్మగారును, శ్రీ వెంకటరామయ్యగారును సుప్రయోగకు పెన్న నామాంతరమని నిరూపించియున్నారు.

శ్రీ శర్మగారు ముండరాష్ట్రమున కాపేరు ప్రాచీనకాలమున ముండులను జాతివారి కావాసమైనందున, ఈ దేశవిభాగమునకు ముండనాడని పేరు వచ్చియుండునని భావించుచున్నారు. ఈ విషయము పరిశీలింపఁదగును[9].

## పెన్నబడి — హొన్ననాడు

వెంకటరాష్ట్రమునుగూర్చి వ్రాసినపుడు, తాటిపర్తి వెంకటరాష్ట్రములోని పెన్నపరినాటిలోనిదని కన్నడశాసనము నుదాహరించితిని ఈ పెన్నపరినాడు, ఆ గ్రామమునందలి రామేశ్వరాలయములోని యీ క్రింది తెలుగుశాసనములలో పెన్ననది, లేక పెన్నబడిసీమగా పేర్కొనబడినది.

వీరనరసింహరాయ శాసనములు:— (1) శ్రీవీరప్రతాప శ్రీవీరనరసింహ్వారాయ మహారాయల విజయనగరమందు పృథివీరాజ్యం శేస్తుండంగాను తత్పాద

---

(1) రెండవపల్లవ సింహశర్మ బుచ్చిరెడ్డిపాలెము శాసనము Journal of the Madras University Vol XII- Sri Somasekhara Sarma.

(2) ఆ శాసనమే 'విళవట్టుశాసనము' అను పేరుతో Epigraphia Indica Vol XXIV. No. 43 శ్రీకృష్ణమాచార్యులు గారిచే ప్రకటింపఁబడినది.

(3) 'Ancient Political Geography of South India.' M. Venkataramayya Journal of Orinental Research Vol XII. Part IV.

(4) ఉరువుపల్లిశాసనము Indian Antiqnary Vol V. February 1876.

(5) పికిరశాసనము :- Epigraphia Indica. Vol VIII Pages 159-'63

(6) శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన పల్లవరాజసింహుని తామ్రశాసనము.

'Journal of Sri Venkateswara Oriental Institute Vol VIII. No. 2.

(7) బాపట్లశాసనము South Indian Inscription, Vol VI, No. 173.

పద్మారాధకుండైన శ్రీమన్మహాప్రధాన సాళువతిమ్మయ్యంగారు గుత్తిరాజ్యములోను పెన్నంబడి తాడిపర్తి రామేశ్వరదేవరకు దండం పెటి......

మాకు నాంక్రమై చెల్లేటి గుత్తిర్యాజ్యం లోని పెన్నంబడిస్థలంలోను నెలకలపాడు అనే గ్రామాకు ... ...

(2) శ్రీమన్మహాప్రధాన సాళువతిమ్మయ్యంగారు - ఆ వీరనరసింహరాయమహారాయలు పాలించి మాకు నాయంకరమై చెల్లేటి గుత్తిరాజ్యంలో నన్న అందుచెల్లే పెన్నబడి శీమలోనున్న...

అచ్యుతదేవరాయలశాసనము:- శ్రీనాధరాజ రామరాజు కొనూ మంగు సిరిగర్రైంగారు గుత్తిరాజ్యంలోని పెంనబడి తాడిపర్తి రామేశ్వర దేవునికి దండం సమర్పించి.

అష్ట్రశ్రీకృష్ణదేవరాయల కృష్ణాపురము కన్నడశాసనములో గీ పెన్నబడిసీమ హొన్ననాడని పేర్కొనఁబడినది. తెలుగుభాషలోని 'ప'. కన్నడములో 'హ' కొన్ని పదముల మొదిని ప్రయుక్తమగును. పెన్ననాడె, హొన్ననాడని శాసనములో వ్రాయఁబడినది. ఆశాసనములో "గుత్తిసీమ యొళగణ పెంనేనాడ యొళగణ వంగమూరగ్రామ ఉముకొండేయసీమె యొళగణ బేలచింతే గ్రామ ... ... అని హొన్ననాడు గుత్తిసీమలోని యంతర్భాగమని తెలుపఁబడినది శాసనములలో దానముచేయఁబడిన గ్రామములు రెండును తాడిపర్తి తాలూకాలో నున్నవి. 'బడి' యను పదమునకు మార్గము. పథము, స్థల మను నర్థము. పెన్న పెన్నానదియే. (సశేషము)

---

(1) కృష్ణాపురశాసనము ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 1, పుట 40.

(2) విజయనగరరాజ్య శాసనములు దక్షిణహిందూదేశశాసనసంపుటము 4. సంఖ్యలు 798.801.802.803

# Miduturu Inscription of Jata-Choda Maharaja

H. K. Narasimhaswmi.

The Telugu-Cholas or Chodas were one of the great and perhaps the earliest subordinate dynasties of the South, who were contempo-aneous with the Imperial Pallavas, the Chalukyas of Badami and their successors. Their territory lay round about the Cuddapah region comprising a greater portion of this district and parts of the Anantapur, Kurnool and Nellore districts. They were essentially feudatory but assumed independent rule whenever the overruling power exhibited signs of weakness either owing to internal dissentions or pre-occupations with external enemies. They have left quite a few lithic records in Telugu which apart from being historically valuable, are of great interest for their linguistic features. The earliest among them which is also the earliest inscription so far known in the Telugu language comes from Tippaluru, Cuddapah District, referred to therein as the capital of king Punyakumara [1] The only two copper plate grants known of this dynasty also belong to a king of the same name and comes from the Cuddapah District itself. They are like most of the copper-plate charters and unlike the stone inscriptions, in Sanskrit. The insciiption published below belongs to Jatachoda-Maharaja, a later member of this family.

The record is engraved on three faces of a red stone pillar lying in a field bearing Survey No. 305, on the boundary between Miduturu and Pudumuladinne in the Cuddapah Taluk of the Cuddapah District in Andhra. It is about six feet high and the broader face on which the record commences is roughly a foot wide while the two side faces on which it is continued, are about 8 inches in width. The two narrow faces contain at their top the figures of a couchant bull and a standing lion, the latter with its right foot raised and its tail twisted into a loop over its back. The bull is engraved in a topsy-turvey manner while the lion resembles similar figures depicted

1. Ep. Ind. Vol. XXVII, plate opp. p. 229 F.
2. Ibid., Vol. XI, pp. 337 ff and Vol. XXVII pp. 268 ff

on several lithic records of this family as well as on the seals of the two copper-plate charters already referred to. The latter probably stands for the ensign of the Telugu Chodas while the former probably indicates their Saiva leanings which fact seems to get confirmed by the opening verse in praise of Siva in both the copper plate charters of the family already referred to.

The record is in Telugu, engraved in Telugu or Telugu-Kannada characters assignable to about the middle or the third quarter of the 10 th century A. D. Except for the introductory *prasasti* with which the inscription commences and the imprecatory verses at the end, which are in Sanskrit, the rest of th record is in simple prose. Among the palaeographical peculiarities may be mentioned the following: a circle on the top of the letter marks the short vowel sign *i* (స్వస్తి in l. 1 etc.) while an inward loop in it marks the long form of it (దీనికి, l. 19); a hook bent to the left and attached to the side or bottom o the letter stands for the *u* sign (శర్గుంబు, l 20) while the same bent over again to the left like a horizontal *S* marks the long *u* sign (ముద్దుభూర -l. 14; భూమెూ ,l.41; a horizontal bend with its opening to the right on the top of the letter (పెంబుసు l. 12, నెల l. 12) or a downward hook attached to its left (చేడు l. 10 marks the sign for '*e*' or '*e*' while two hooks, one on either side of the letter (భూమెూ l-41) or a caplike semi-circle over it (గోత్ర l-6) stands for the sign for '*o*'. The forms సమ్మర్తికి, ఎణ్బది, మఱుతుల్లు, బాణరాసి etc. are of orthographic interest. The words దమ్మర్గ (ధమ్మర్గ) భరత్భిః (భరద్భిః), పాత్రిక వేన్ద్ర.(ప్రాథి క వేందార్గక), న్రిపాణాం (నృపాణాం), వసున్ధరి(వసున్ధరాం)etc. are palpably faulty in spellnig.

The object of the record is contained in the expression నాసమి పాఱ అయితసమ్మర్గరికి ముద్దుభూర ఎణ్బది మఱుతుల్లు నే౦ రాజమానంబు in which the verb ఇచ్చిరి has obviously to be supplied to complete the sentence. The gift land lay in Mulduluru and was 80 *marutu* in extent by the royal measure. The word Nasami-para qualifying Ayitasarma seems to indicate either the place to which the donee belonged or from which he hailed or perhaps the name of his family. As for Nasami being a place name, it

may be compared with the name Nossam, a village in the Kurnool District. The gift was made while Jatachoda Maharaja was ruling from Tibaluru. In the expression, మహారాజు తిబలూర వెలుకుచుణ్డి the word వెలుకుచుణ్డి is only the archaic form of వెలుగుచూణ్డి meaning 'shining' used in the sense 'reigning'. The use of *ka* for *ga* is a common feature in archaic inscriptons of this period and as instances my be cited the words దుకరాజు for దుగరాజు; ం పిసుకు; for ం పిసుగు; కణ్డత్రినేత్ర for గణ్డత్రినేత్ర etc. [4] The occasion for the gift is not specified in the record. But the person who appears to have been instrumental in inducing the king to make it was Kaluredu. For, in the expression కలురేడు వియ్యంబున, the word వియ్యంబున seems to have been used in the sense of 'at the instance of'[5].

As for the historical importance of the record, it centres round Jada-Chola or Jat*a*chola-Mah*a*r*a*ja who bears the title Chola-Mah*a*r*a*ja. Copper plate grants attribute the acquisition of this title to Mahendravikramavarman, a remote king of this family. The eulogy చారుదక్షిణకరభుజాసిభాసుర etc. with which the inscription commences also characterises the chief or king of the record as a Telugu-Chola. There are no kings of this name in any other family excepting this and of them who bear this name the earliest figures as a mythical ancestor of Dasavarman, who was himself a remote member of that branch

---

3. The *Sabdaratnakaramu* gives పెలుసు, ఉత్పాటించు as meanings for వెలుసు. Adopting this meaning for the word, the passage has been construed to mean, 'while Tipaluru was devasted in the battle at (or with) Kalureju', and the act of destruction attributed to Ayitasrman (A. R. Ep. 1937-38, No. 303). This is rather unlikely, for a Telugu-Chola king could hardly have tolerated, much less rewarded a person for destroying Tippaluru which was a capital of this family.

4. Ep. Ind., Vol. XXVII, p. 228, 233; ibid. Vol. XXIV. p. 192

5. This has been read as కయ్యంబున in the Annual Report and the passage construed accordingly to refer to some fight at or with Kalureju. (Op. cit. No. 303). But this way of understanding the passage does not fit in with the context of therecord.

' the Telugu-Cholas who ruled from Pottapi.[6] Of the two
her kings of this name, one is the king of the record under
view and the other figures as the ruler of Renadu in an
scription at Animala[7], a village not far from Midutur, the
indspot of our record. The Animala inscription which is
adly damaged, is in characters markedly earlier than those of
he Midutur inscription, and unlike the present record, it com-
nences with the Vaidumba prasasti, స్వస్త్యనేకసమరసంఘట్టనోపలబ్ధ
tc. of the Vaidumba king Gandatrinetra. The Jata-Choda
of the Animala record was therefore an earlier namesake of
Jata-Chola of the Midutur inscription and apparently a subor-
dinate of the Vaidumbas. How the two were related to each
other, whether as grand-father or grand-son, is not known.
Did Jata-Choda of our record shake off the Vaidumba yoke
to which his namesake of the Animala inscription had acquie-
sced? There is reason to believe that he might have done so
The adoption of his own *prasasti* in place of the Vaidumba one
in his record may point to his independence from Vaidumba
overlordship. Besides, the Conjeevaram inscription[8] mention-

6. SII, Vol. VI, No. 651.
7. A. R. Ep. 1937-38, No. 191
8. Ep. Ind. XXI, p. 32, textl. 5. వైదుంబి ప్రభృతి రాజ రాజన్య రాజరాజిత పీఠస్థం etc. This inscription has been ascribed to the Chola king Rajaraja I by Mr. K. V Subhramanya Iyer on the sole evidence of the last short sentence, the only Tamil part of it which runs *Ivanai Kora......... kaikkondar*. While the major portion of the record, unfortunately very fragmentary, consists of an eulogy similar to that of the Eastern Chalukyas and gives a long string of epithets, all in apposition with Jatachoda-Bhima and the last few lines contain a verse in Telugu pertaining to certain deeds, also applicable to the same king, it is enigmatic how the great Chola king allowed all praise for his enemy and was content with the mere record of the fact of having captured him. Did he thereby mean to enhance his reputation in having captured so distinguished and powerful an enemy? This, if true, is a unique way of doing so and altogether out of the usual style of Chola records. Dr. N. Venkataramanayya on the other hand ignores the last sentence of the record completely and asserts hat the assigning of it to Rajaraja I is utterly wrong (*The Eastern Chalukyas*: p. 200 f. n. C. f, J. A H R S. Vol. X, pp. 16 ff.) The truth perhaps lies midway between these two views. Could it not be possible that an ardent and impartial admirer of Jatachola-Bhima, struck at his remarkable success of having over-run the entire territory from Kalinga to Kanchi felt the irony of the whole episode when he saw the object of his admiration fall a victim to Rajarajaand translated his feelings into this record?

ing JataChoda-Bhima refers to the uprooting of the Vaidumba and other kings, in all probability by Jatachoda-Bhima himself. The date of this record viz. Saka 923 (1001 A. D.) and the details that it furnishes of the antecedents and activities of Jata Choda-Bhima, disconnected and fragmentary though they are, suggest that Bhima and Jata-Choda were related to each other as father and son. The father and son might together have succeeded in shaking off the Vaidumba yoke. The close relationship that existed between Bhima and the Eastern Chalukyas is indicated by the lengthy, although disconnected account of a number of kings of this family such as Chalukya-Bhima, Kollabhiganda Vijayaditya, etc. Danarnava, the elder step brother of Amma II and Kamarnava of Kalinga both appear to have met with their death at the hands of Jatachoda Bhima[9]. The immediate cause of Bhima's ire against Danarnava has been conjectured to be the death of Ammaraja II at the hands of the latter i. e. Danarnava. Amma's relationship with Jata-Choda was probably of the nature of a sister's husband, for the latter refers to the Andhra country as his sister's abode భగినీపదం in this same inscription[10]. The reprisals that followed Bhima's conquests were equally telling, for Saktivarman, the 'Chalukya-Narayana' claims to have killed Choda Bhima who is compared to Ravana in prowess.[11] That Rajaraja aided Saktivarman in his war against Bhima or Ahdhra-Bhima is borne out by the Tiruvalangadu Plates of Rajaraja which allude to the death of Andhra Bhima at the hands of Rajaraja in a verse which puns upon the names of Bhima and Rajaraja:[12] In his Prabhuparru Plates, Saktivarman claims to have rooted out the tree

---

9. The Eastern Chalukyas p. 204.
10. Ep. Ind, Op. Cit, text 1. 14.
11. A. R. Ep. 1917-18, C. P. No. 15;
స్వంరూపం పరిహృత్య దైత్యనికరా న్మత్యా దలీకాత్మతాం
ప్రాప్య ప్రాగ్జితవాన్ కిలేతిహసతా నారాయణం చేతసా।
ఈశస్సంయతి రావణప్రతినిధి శ్చాలుక్యనారాయణో
నాహాస్త ద్విషతాఽపి యేన నిధనం శ్రీ చోడభీమాధిపః॥
12. *South Indian Inscriptions;* Vol, III, p-398.
దణ్డేన భీమేన యుధి ప్రవీణో
యద్రాజరాజో నిహతో మదాఖ్యః
తద్భీమనామాన మరంధ్రమంధ్రం
హన్త్రీతి దణ్డం జఘాన తం సః॥

that was Jata-Choda by killing Ekavira sent by Choda Bhima and routing certain others like Baddema and Maharaja.[13] Although the relationship between Choda Bhima, Baddema and Maharaja is not known, it is certain that they constituted the *Jatachoda - Vriksha* destroyed by Saktivarman. It is obvious that this Jatachoda alluded to in the *Jatachoda-Vriksha* of the copperplate grant, and the Jatachoda in the name Jatachoda-Bhima of the Conjeevaram inscription are both identical with Jatachoda Maharaja of the record under review. If according to the Conjeevaram inscription, Choda-Bhima's death has to be placed sometime about 1001 A. D., it would be reasonable to assign the date c. 950 A. D. for his father Jatachoda.

Of the geographical names occuring in the record, Tibaluru may be identified with Pippaluru, the findspot of the earliest inscription of this family,[14] and Mudduluru Midutur with itself. Both the villages are situated in the Cuddapah Taluk.

## TEXT

First Side

1. స్వస్తి హరిదుర్ధర
2. రవర భుజాసి
3. భాసుర ప్రచణ్డ
4. ప్రద్యోతిరదిన
5. కరకులనన్దనకాస్య
6. పగోత్రి కరికాలా
7. న్వయ శ్రీమాన్ప్రతిమ
8. హారాజులు జడ

13. *Andhra Sahitya Parishat Patrica*, Vol. II, p. 693.
ప్రేషితంచోడ భీమేన యచ్ఛిత్రిశిత సాహసః।
పంచత్వ మనయత్తీక్ష్ణ మేకవీరం స్వబాహునా॥
బద్దెమశ్చ మహారాజో మదాన్ధో బలినావుభా ।
వశీకృతాం తతో యస్మా దిభద్విష ఇభావివ ॥
ఉచ్చైర్బలస్కన్ధ మతి ప్రరూఢం
భూభృచ్ఛిరః కోటి విసారితాంఘ్రి।
ఆమూల మున్మూలయతిస్మయోన్త
స్సారం విశాలం జటచోడవృక్షం॥

14. Ep. *Ind.*, Vol XXVII, p. 229.

9. చోళిమహారాజు
10. కలుతేడు నియ్యంబున
11. మహారాజు తిబలూర
12. మొఱుకుచుణ్డి
13. నాగమి పాఱ అయి
14. త సమ్మ్రారికి ముద్దుభూర

Second Side.[15]

15. ఎణ్బొదిమ
16. ఋతుల్లు
17. నేలరాజ
18. మానంబు[/*]
19. దీనికి (వ)
20. వక్రంబువచ్చి
21. నవాణ్డు బార
22. నాసియు శ్రీ
23. పర్వతంబుతి
24. చ్చినవాణ్డు[/*]
25. స్వదత్తాం ప
26. రదత్తాంవా
27. యోహరే
28. తి వసున్ధ
29. రి పష్టివ
30. రుషసహ
31. స్రాణి విష్ఠా
32. యాం జాయ తేక్రిమి[1]

Third Side.[16]

33. సామాన్యోయం
34. ధర్మసేతు
35. ర్నృపాణాం కా
36. లే కాలే
37. పాలనీయో
38. భవద్భిః సర్వా
39. నేతా(ం) భావి
40. నా పార్థివేన్ద్ర
41. భూయోభూ
42. యో యాచ
43. తే రామ
44. భద్ర [/*]

---

15. The figure of a couchant bull in a topsy-turvy manner is engraved above the writing.

16. The figure of a lion with a twisted tail and raised rihgt paw is carved above the writing.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రప్రస్తావకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

ప్రధానకార్యదర్శి, కోశాధికారి,

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ కార్యదర్శి

శ్రీదువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

కార్య నిర్వాహక సభ్యులు

శ్రీ కోరా శివనాథశాస్త్రి.
శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి. (బాలవ్యాస)
శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి. (వ్యాకరణవిద్యా భాషా,ప్రవీణ)
శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య. ప్రౌఢకవిచంద్ర)
శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితా విశారద)
శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసిక సమ్రాట్)
శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు (యం. బి. బి. యస్.,)
శ్రీ చిరువోలు కోటీశ్వరరావు.
శ్రీ దామెర రాజగోపాలరావు బి. ఏ.,

పత్రికాసంపాదకులు:

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

సంపాదక సహాయులు:

శ్రీ బండారు తమ్మయ్య

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | |
|---|---|
| 1వ సంపుటము | రు 6—0—0 |
| 2వ సంపుటము | 6—0—0 |
| 3వ సంపుటము | 6—0—0 |
| 4వ సంపుటము | 6—0—0 |
| 5వ సంపుటము | 10—0—0 |
| 6వ సంపుటము | 10—0—0 |
| 7వ సంపుటము | 10—0—0 |

7వ సంపుటములో 'వ' తుదివఱకుగల పదములున్నవి. రు 10 లు చెల్లించి ఈ సంపుటమును తీసికొనువారికి తరువాతి 'శ-హ' భాగ ముచితముగ పంపఁబడును.

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయు గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది. వెల రు 1—50

## మాధ్యమికకారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—50

కాకినాడ.

Printed by J. Bhaskara Rao at Republic Press Kakinada.
Edited by C. PAPAIAHSASTRY
Published by Andhra Sahitya Parishat, Kakinada.